రామకృష్ణమాచార్యులు, ధర్మవరము

చిత్రనళీయ నాటకము

చెన్నపురి, 1916

Record no.92

Rāmakṛṣṇamācāryulu, Dharmavaramu

Citranaḷīya nāṭakamu

Cennapuri, 1916

Record no.92

## Bibliographic Record Target

రామకృష్ణమాచార్యులు, ధర్మవరము.
శ్రీ చిత్రనళీయ నాటకము / ధర్మవరము రామకృష్ణమాచార్యులు.- 7.కూర్పు.-
చెన్నపురి: ఆదిసరస్వతీలయముద్రాక్షరశాల,1916
xviii, (2), 144, (1)p. :port. ;20.5 cm.
Record no.92

Rāmakṛṣṇamācāryulu, Dharmavaramu.
Śrī Citranaḷīya nāṭakamu / Dharmavaramu Rāmakṛṣṇamācāryulu.- 7.kūrpu.- Cennapuri: Ādisarasvatilayamudrākṣaraśāla,1916.
xviii, (2), 144, (1)p. :port. ;20. 5 cm.
Record no.92

శ్రీ

# చిత్రనళీయ నాటకము.

---

ఇది

బళ్లారిలోనున్న డిస్ట్రిక్టుకోర్టు వకీలు
"ఆంధ్రనాటక పితామహ" యను బిఱుదు గాంచిన
ధర్మవరము. రామకృష్ణమాచార్యులచేత

రచియింపఁబడి

డి. క. కృష్ణమాచార్యులు అండ్ బ్రదర్సువలన ప్రకటింపఁబడినది.

ఏడవ కూర్పు.

చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.

1916.



[క్రయము రూ. 1-0-0.]

శ్రీ

# చిత్రనళీయనాటకము

## మొదటికూర్పు—పీఠిక.



మనోహరములగు భాషలలో మున్నెన్నఁదగినదియై మాతృభాషయందలి ప్రౌఢకావ్యాదులతోఁ బోల్చిచూడ నించుకంతయు వెనువడని ధీరకావ్యాదులు గలిగినదియైయున్న మనయాంధ్రభాషలోఁ జక్కని నాటకములుండకుండుట యెంతయుఁ గొదువయని నాకు మిక్కిలి చిన్ననాఁడే తోఁచెను. ఆదినుండి మన మహాకవులు సంస్కృతభాషలోనున్న పురాణములు, కావ్యములులోనగువాని నాంధ్రీకరించుచువచ్చి పేరెన్నికగనిరి. ఆభాషలో ధీరపద్ధతిగలిగి సంవిధానవిశేషమున విఖ్యాతివహించిన యెన్నియో నాటకములున్నను, వానిఁ దెనుఁగించునట్లు కనఁబడదు. కారణమూహ్యముగా నున్నదిగాక విశదముగాఁ దెలియఁబడదు. ఇదియంతయు నధునాతనులగు నస్మాదృశులభాగ్యవిశేషమని యింతమాత్రము తలఁపఁదగియున్నది.

“దేశభాషలందుఁ దెనుఁగు లెస్స” యని సముచితముగ నుడువఁబడిన యీభాషపై నాకుఁ జిన్ననాఁటినుండియున్న యభిలాషవశంబున, నిరువదియేఁడుల యీడుగలిగిన క్రీస్తుశకము ౧౯౦౭ సంవత్సరమున నేదేని కావ్యము రచియించు కుతూహలము కలిమి, గోత్రకర్తయగు గాధినందను చరిత్రము పద్యకావ్యము సగమువ్రాసి యప్పుడు నాకుఁ గలిగిన నాటకరచనాకుతూహలమున నంతకునిలిపి ముఖ్యముగ సంస్కృతమునందును, ఆంగిలేయభాషయందును గల నాటకముల నానక్తిమైఁజదివి ౧౯౦౯ సంవత్సరమున “ఉన్మాదరామప్రేక్షణికము” “మదనవిలాసము” నను పేరులుగల చిన్ని నాటకముల

రచియించి యీ చిత్రనళీయనాటకము వచనభాగము కొంతరచియించితి. కాని, కార్యాంతరప్రసక్తుఁడనౌటచే నంతతో దాని నుజ్జగించితి మానవశక్తిమీఱిన కొన్ని సందర్భములవలన మరల ౧౮౮౬ సంవత్సరమువఱకు నీవిషయము విచారింప సాధ్యముకాకయుండె.

చిరకాలమునుండి మనవారిలో నాటకములన్న హేయములుగను నాటకులన్న దూష్యులుగను భావించు వాడుకకలదు. ఈ భావము సముచితము కాదనియు జనసముదాయమునకు నీతినిబోధించుటకు నాటకములకంటె సాధనములు వేఱొండు కలుగనేరవనియు, నీచకులజులౌండె నీతిబాహ్యులౌండె నాటకములు ప్రదర్శించుచు వారు కొన్ని యకృత్యముల నొనర్చుటవలనను, సునీతిని బ్రచురించుటయే ముఖ్యోద్దేశముగాఁగలిగిన నాటకములు మనలో లేకుండుటవలనను నాటకులకు నాటకములకు మనలో దూషణగలుగుటకుఁ గారణమాయెననియు నాయెన్నిక. ఈ యెన్నిక ననుసరించి సమయ మొదవినప్పుడంతయు నామిత్రులతో సంభాషించుచు నందం దుపన్యసింపుచుంటిని. ౧౮౭౯ సంవత్సరమున నాకు సవయస్కులగు మిత్రులతోఁ గొన్ని యాంగ్లేయనాటకములు ప్రదర్శించు తలంపుగలుగ వారియందఱితోడుపాటున రెండుమూఁడులట్లు ప్రదర్శించుట సంభవించె. ఆ యింగ్లీషునాటకములకుఁ దోడుగ పైనఁజెప్పిన చిట్టితెలుఁగు నాటకములుసయిత మీఁబడియె. నీతినిమాత్రము బోధించు నుద్దేశమున నొక నాఁట, రెండునాళ్ళ, ప్రారంభింపఁబడి ముగియింపఁబడిన యీగ్రంథములే చూడవచ్చినవారు మిక్కిలి యాదరించునట్లు ఘటిల్లె. మొదటినుండి పాటువడి సంవిధానములు కుదుర్చుకొని నాటకములు రచియింపఁబడెనేని జనసమూహ మింకను నెక్కువగా నాదరింతురుగదా యని యుత్సాహము జనించుటయు, నన్నెల్లప్పుడు వెడబాయని మిత్రుఁడును నాటకపరిచయము పెంపున నదివఱకే కర్ణాటభాషయందు నాటకముల రచియింపఁ బ్రారంభించినవాఁడును నగు బ్రహ్మశ్రీ, చిత్తవాడిగి-హనుమంతగౌడు (Mr. C. H. Goud) నన్నెంతయు నందునకుఁ బ్రోత్సాహ



పఱచుటయుఁగాఁగా నాంధ్రమున నళనాటకమునకు సూచిక నేర్పఱచుకొని కొంతవచనభాగము గూర్చితిని. ఆయుద్యమమప్పు డంతతో నుజ్జగింపవలసివచ్చెనని యిదివఱకే చెప్పఁబడెఁగదా?

తరువాత ౧౮౮౬ వ సంవత్సరమున నా మిత్రమండలి నన్నెంతయు నాటకరచనమునకును, తన్నాటక ఖేలనమునకును నుత్సహింపఁజేసె. వారందఱు బహుతరముగా నాంధ్రభాష నభిలాషచే నభ్యసించినవారయ్యుఁ గర్ణాటకభాషయం దించుక పక్షపాతముకలవారుఁగాఁ బొడకట్టె. అదియుంగాక వా రదివఱకు నందందుఁజూచిన నాటకములు కర్ణాటనాటకములే కావున దేశభాషలలో నాటకములకుఁ దగినభాష కన్నడమేయనియు, తెనుఁగందునకుఁ దగదనియు నొక్కపట్టు నారికిస్థిరముగాఁగలిగె. దృష్టాంతయుక్తముగ నే నెంతప్రబోధించినను వారిపట్టు మానదయ్యె. నా కా కన్నడమునందును నొక్కింతపరిచయమున్నందున వారిమతముచొప్పునఁ బోవలసివచ్చి మొట్టమొదట స్వప్నానిరుద్ధమను పేర నుషాకల్యాణ చరిత్రమును గన్నడభాష నాటకముగా నొనరించితి. మామక మిత్రకోటి "సరసవినోదినీ" యనుపేర నొక సభగా నేర్పడియె. ఆ సభవారివలన నా నాటకము ౧౮౮౬-వ సంవత్సరము సెప్టెంబరునెల ౧౪-వ తేది నాఁడు ఖేలనము గావింపఁబడియె. నెలలోపల మూఁడుమాఱులా నాటక మాడఁబడినను ఆ మూఁడుమాఱులును దిదృక్షాగతులకుఁ గొందఱికి నెడమబ్బుటయే కలవయ్యె. ఈ సరసవినోదిని సభయొక్క చరిత్రమంతయు వ్రాయవలయునన్న నెన్నియో గ్రంథములగును. తొలుతఁ గొన్నినాళ్ళు వివేకమును విమర్శనశక్తియుఁ జాలని జనులవలన దూషింపఁబడిన తెఱంగును, తనివితీఱ దూషించిన భంగియంతయుఁ దరువాత నుపేక్షయందుఁ బరిణమించిన చందమును, ఆ యుపేక్షపోయి పిదప నపేక్షకుఁ దిరిగినకరణియు, ఆగ్రహనిగ్రహములన్నియు ననుగ్రహమునకు మాఱినకైవడియు, ఆసభఁజేరిన వా రెట్టివారగుటయు, వారే మొనర్చియుండుటయు ఇవియన్నియు నుగ్గడించి వ్రాయుట కిది చోటునుగాదు. సమయమునుగాదు.

ఈస్వప్నానిరుద్ధనాటక మాడినపిదపఁ దెనుఁగున నొకనాటకమైన రచియించి యాడుటకై నా మిత్త్రుల యనుజ్ఞఁ వేఁడితి. తెనుఁగున నాటకము భంగపాటునకుం బరిహాసమునకుం గారణమగునని మనసార నమ్మియుండియు నా యుత్సాహభంగ మొనర్చుట కిష్టపడక విధిలేక యందునకు సమ్మతించిరి. అప్పుడీ చిత్త్రనళీయ నాటకము సాంతముగా రచియింపఁబడి ఖేలనముగావింపఁబడియె. ఊరివారును వినోదమునకని చూడవచ్చిరికాని తమ కీనాటకమువలన ముదము గలుగఁగలదని యెంచివచ్చినవారు కారఁట. అయినను దెలుఁగుభాష యొక్క బళ్లారియందు గలిగియుండిన దుష్ప్రాప్తికడచను వేళ యెదిగివచ్చినందునఁ గాఁబోలు. కన్నడ నాటకమునకంటె నీ నాటకము విశేషాదృతమయ్యె. నాఁటినుండి తెనుఁగన్న మఱి కొందఱు చూడ వచ్చునట్లు సంఘటిల్లి బళ్ళారి కన్నడసీమ కాదనుమాట స్థిరముగా నాటుకొనునట్లుద్భవిల్లె. ఈ మాటవలనఁ గన్నడభాష తెనుఁగునకంటె దక్కువయని చెప్ప నుద్యమించిన వాఁడఁగాను. నాకుఁ దెలుఁగునందుఁ బోలెఁ గన్నడమున విశేషపరిచయము చాలమియే యీ సభవారి తెనుఁగు నాటకములకు బ్రాశస్త్యము గలిగించెనని చెప్పినను జెప్పవచ్చును. అయిన మంచి చదువరులై యుభయభాషల నెఱిఁగియున్న మామిత్త్రులకు నాటకములకుఁ దెలుఁగు తగిన భాష కాదను మతముపట్టువడియుండెనే యనుట కింత చెప్పవలసివచ్చెను. ఈచిత్త్రనళీయ నాటకమునను న్న, ప్రస్తావన, ఈ సందర్భములు తెలియనివారికి నర్థ రహితముగాఁ దోఁపఁగలదని యీవిషయము వాక్రువ్వవలసివచ్చె.

(ఈ నాటకమును, మఱి యితరములగు నాటకములును, ఆడఁబడిన కాలమునఁ బాటలు కొన్ని రచియింపఁబడియుండె. ఈపాటలు విషయమై యొక్కింత వక్కాణింపఁదగియున్నది. నాటకములు సామాన్యముగాఁ బద్యగద్యాత్మకములై కానంబడియెడి. పాటలుగలది యక్షగానమను పేరునఁ బరఁగుచున్నది. ఈ నాటకములు సర్వవిషయముల నింగ్లీషుభాషయందును సంస్కృతభాషయందునుగల నాటక



లక్షణముల ననుసరించియే రచియింపఁబడినవి కాని యక్షగానములవలె రచియింపఁబడినవి కావు. అయిన నీనాటకములు తత్కాలమునఁ గ్రీడించి చూడ వచ్చినవారికి సుబోధగలిగించు తలంపుకలిమివలనను, జనసామాన్యమునకుఁ బద్యములయందు విశేషాభిలాషము కలుగకుండుటం జేసియు, అట్టివారు గానమును బాటలను నాదరించుటఁ జేసియు, వారి యాదరణ ముఖ్యముగాఁ గలుగవలయుటం జేసియు, నాటకముల యం దందందుఁ బద్యములుండినను బహుతరముగఁ బాటలు నెలకొలుపఁబడియె.) ఈనాటక ప్రస్తావనయందే యీవిషయము సూచింపఁబడియె. ఈ పాటలతో నాటకముల నిట్లే ప్రచురింపవలయునని మొదటనుండి నాయుద్దేశము కాదు. (ధీరపద్ధతిగల నాటకమునఁ బాటలుండుట యంతసురుచిరము కాదనియే నా తాత్పర్యము. మాతృభాషయందు నిండుసాహితికలవారి " నాటకాంతసాహితి " కలవారని యాఖ్యగలిగింపఁజాలు నాటకములున్నయట్లు, ఆంధ్రభాషయందట్టివి లేవుగా యనులోపమును నాయావచ్ఛక్తి సవరించుతలంపే పట్టువడియుండుటచే సాహితిని వృద్ధిచేయఁ జాలుశక్తిచాలని పాటల నందుఁ బొందింపవలయునని నాయుద్దేశముగాదు. కాఁబట్టి పాటలున్న చోట్లనెల్లఁ దగినభంగిఁ బద్యములఁ బొందుపఱచియున్నాఁడ. పాటలయందును నభిలాషముగలవారికోరికఁ దీర్ప నాపాటల నొకప్రక్కనఁ బ్రచురించినాఁడ. ఈమాటలవలనఁ బాటలుగర్హణీయములని చెప్ప నెంచినవాఁడఁగాను. (వ్యాకరణదుష్టములగు పదముల మాని ప్రాసాది నియమములఁ దప్పక రచియింపఁబడినపాటలు తఱుచుగా నుండమిచే సాహితీనైపుణిగలవారికి వానియందు పేక్ష పొడమియుండుఁగాక పాటలేమి పాప మొనర్చినవి ? వానియందు రసమొదవదా ? పాకములభింపదా ? భావముగలుగదా ? ఛందోనియమముచాలదా ? అయిన నాటక కుర్దన మొనరించు వారికి రాగమునందును దాళమునందును ధ్యానము మానకుండవలయుటం జేసి పద్యములయందుఁబోలెఁ బాటలయందు భావప్రకటనము గలిగింప నిర్బంధము గలుగుననుటమాత్ర మొప్పుకొనఁదగియున్నది. ఈకారణమువలననే మానవలసివచ్చెఁగాని

వేఱొండు కారణమువలనఁగాదు. అరసిచూడఁ గొన్నిసందర్భముల యందు పద్యములకంటెను, వచనములకంటెను బాటలే రసజనకము లగునని నాకుఁ దప్పని యభిప్రాయము.) కాఁబట్టియే యీనాటకము తృతీయాఙ్కము తురీయరంగమున వీరనాయకునకుఁ గావించియుండిన "మెగంబులనురేవగల్" అనుపాటను సార్థవాహులపాటను నట్లనే నిలిపియున్నాఁడ.

సరసవినోదినీ సభకై పెక్కు నాటకములు రచియింపవలసిన యావశ్యకము కలిగియున్నందునను, ఆ నాటకములు గీతభూయిష్ఠము లుగా నుండవలసినందునను, ఆగీతములుమాని పద్యములు రచియించి ప్రచురింపించుటకుఁ గార్యాంతరాసక్తుఁడనై నా కవకాశము చాలమిఁ జేసియు, నూరక దాదాపున నిరువది నాటకముల రచించితిఁ గాని రచియించినవాని సవరించి వ్రాయుకాలము చాలక యిదివఱకు నిన్నియేండ్లైయున్నను నొక్కదానినైన ముద్రింపఁజాలనైతి. ఇప్పుడించుక యవకాశ మొదవియుండినందునఁ గ్రమక్రమముగా నొక్కటొక్కటిం బ్రచురింపింపఁ దలంపుగొంటిని. దోషజ్ఞులగు సుధీజనులు గుణైకగ్రాహులు లగుదురని నమ్ముచున్నాఁడ.

ఈ నాటకములయందుఁ బ్రాచీనులగు మనవారు గ్రహించిన నాటకలక్షణములయందు లేని కొన్ని లక్షణములు పొడకట్టుచున్న వనుట నొప్పుకొనుచున్నాఁడ. అంకములలో రంగవిభజనము సంస్కృతనాటకముల వచియింపఁబడదు. అయినను, అది యింగిలీషు నాటకకర్తలచే నాదరింపఁబడి యుండుటయేకాక కథాసౌలభ్యము కలిగింపఁజాలుటచే నాపద్ధతి యంగీకరింపఁబడియె. ఇట్లే రసముకొఱకుఁ గొన్ని కట్టుబాటు లుల్లంఘింపఁబడియె. దానివలన నాటకముల ముఖ్యోద్దేశమునకు భంగముగలుగదు. కావున నట్టివి దూషణీయములుకావు. నేఁ బ్రచురింపఁ దలంపుగొన్న నాటకములన్నియు సరసవినోదినీ సభవారివలన ఖేలన మొనర్పఁబడినవనుట వచియించితి.



ఆనాటకములఁ బాటలున్నచోట్లఁ బద్యములు నిలిపియున్నాఁడనియు వచియించితి. అంతియేకాక సందర్భముల ననుసరించి తొలుత సంవాదమూలముగ వచనభాగము మాత్రమున్నయెడల నయితము కొన్నిపద్యముల నునిచియున్నాఁడ. పాటలు కొన్నిపద్యములకు సరిపోవుచున్నందున వానిఁ బద్యములుగా మార్చియున్నాఁడ.

౧౮౮౭ - సం॥ జనవరినెలలో సరసవినోదిని సభవారిచే నీ నాటకమున నెంతభాగ మెట్లు ఖేలనము గావింపఁ బడియున్నదనియు నందలి పాత్రల గ్రహించినవా రెవ్వరగుటయుఁ దెలియవలయు నని కొందఱు మామిత్రుల కోరిక యగుటచే నావివరములఁ దెలుపఁగల గుఱుతు లీతెఱంగున వ్రాసియున్నాఁడ. పేరులుగల పట్టికయు వ్రాసియున్నాఁడ.

1. 2. &c. ఈ సంఖ్యలు గ్రంథముకడనున్న పాటలగుఱుతు తెలియఁ బఱచుచున్నవి. పాటలకు మాఱుగా నొనర్చినపద్యములకుఁ బ్రతిపుటయందును, ఇట్టిసంఖ్యలగుఱుతు వ్రాసి యాపుట యందాసంఖ్యను గ్రంథాంతమునఁ జూచిన నందున్నపాటలు తెలియఁబడు నట్లొనర్పఁబడియె.

* ఈగుఱుతు తొలుత వచనభాగముగానుండి పద్యము లొనర్పఁ బడిన వానికీఁబడియె.

‡ ఈ గుఱుతు పద్యలక్షణములకు సరివచ్చి పాటను బద్యముగామార్చి వ్రాసినవానిప్రక్క నునుపఁబడియె.

§ ఈ గుఱుతు ఖేలనము కాలమున వదలియున్న నాటకభాగము సూచించుచున్నది.

# చిత్రనళీయనాటకము.

## రెండవకూర్పు—పీఠిక.

---

ఈనాటకము ౧౮౯౭-సంవత్సరమున మొదటిసారి ప్రకటింపఁబడియె. రెండువేలప్రతు లచ్చొత్తింపఁబడియె. ౨-౩-సంవత్సరముల వఱకు నప్పుడప్పుడు ప్రతులకు వ్రాయుచుండిరి. తర్వాత విశేషముగాఁ బ్రతులు వ్రయమగుటకుఁ బ్రారంభమయ్యె. దాదాపున నాఱుమాసముల క్రిందటఁ బూర్తిగాఁ బ్రతులు లేకపోయె. రెండవకూర్పునకు త్తరు లివ్వవలసివచ్చె. ఆంధ్రభాషాభిమానుల సంఖ్య మితముగా నుంటుటచే నిదివఱకు ౨౦౦౦ ప్రతులు వెచ్చము కాఁబడియుండి మఱియెక్కువయేలయని యేనూఱుప్రతులకుమాత్రము రెండవ కూర్పునకు త్తరువిచ్చితిని. అయిన నీనాటకముయొక్క భాగ్యవిశేషమున నీయాఱు నెలలలో నప్పుడే నాలుగునూఱ్లప్రతుల కు త్తరువులు వచ్చియున్నవి. మఱిత్వరలోనే మూఁడవకూర్పునయితము కాఁదగియున్నది. ఆంధ్రభాషాభిమానులందఱు నీనాటకము నింతయాదరించుటకు నేఁగృతజ్ఞుఁడనైయున్నాఁడ. ఇంతియేకాక యీనాటకము కావలయునని కోరువారందఱును నాయితరనాటకము లేవేనిఁ బ్రచురింపఁబడియున్నవాని నయితము బంపఁగోరుచువచ్చిరి. కార్యాంతర ప్రసక్తుఁడనై "దినగండముగాఁ" బలుమాఱు నే దేసిరుగ్ణతచే బాధపడుచుండుటచేత నితరనాటకముల కవకాశముచాలమి నీవఱకుఁ బ్రచురింపలేనైతినని చెప్పుటకు సంకోచించుచున్నాఁడ. అవి ప్రచురించుట కెన్నియోప్రయత్నములొనరించితి. తుదకు మాసపత్రిక మూలముగనైనను నింతింతగాఁ బ్రచురింతమనియెంచి ప్రకటన పత్రిక నయితము వేయించితి. అయ్యెడనే నాకు శరీరమున స్వాస్థ్యము దప్పె. ఆప్రయత్నము నిలుపవలసి



వచ్చె. ఇంతలో నానాటకములఁ బ్రచురించు తలంపుతో నన్నెల్లప్పుడు ప్రేరేపించుచుం బ్రార్థించుచు వేసరుకొనుచున్న నామిత్రులునే నింకను బ్రకటింపకయుండిన నాప్రకటన పత్రికం గ్రహించి శశిలేఖకుఁ బంపి ప్రచురించునట్టుచేసిరి. శశిలేఖలో నాప్రకటనము ముద్రించినఁ దినములలో నాభావిమాసపత్రికకు వేఱువేఱుస్థలములనుండి యిరువదిముప్పది చందాలువచ్చెను. వానినన్నిటిని దర్వాత వెనుకకుఁబంపితిని. అందులో నొక్కరు దానిం దీసికొనక మరల వెనుకకుఁబంపుచు "మీరు మీనాటకములఁ బ్రచురింపకుండుట యాంధ్రదేశమునకే యెగ్గొనర్చుటయని నేనమ్మితి. ఈ మొత్తము మీపత్రికకొఱకిచ్చితిని. మరలఁజేకొనుట నాకసమ్మతము. ఎప్పుడుగాని ముందుమీపత్రిక ప్రచురించినదానికి చందాధనముగా దీనిమీయొద్దనేయుంచి యుండవలయు"నని ఇంగ్లీషున జాబువ్రాసిరి. ఆపైకము నాయొద్దనే యెన్నాళ్ళో యుండె. తర్వాత వేఱువిధమున దాని వెనుకకుఁబంపితి. అది యిప్పటికిని వారెఱుఁగుదురో యెఱుఁగరో చెప్పవచ్చినదేమన్న, నానాటకము నింతయాదరించువారును ముద్రింప బలవంత మొనర్చువారును న్నారని ఈనాటకముపై నెన్నియోపత్రికలు సదభిప్రాయములవ్రాసె. భాషాభిమానులు పలువిధములఁ బ్రశంసించుచు నుత్తరములు వ్రాసిరి. అవియన్నియుఁ బ్రచురించుకొనుటకు సంకోచించి విరమించితి. శశిలేఖపత్రికలో నొకానొకరు ౧౯-౬ వత్సరముల క్రిందట కొన్ని యాక్షేపణలొనర్చిరి. దానిధోరణి సదభిప్రాయముగలదై యున్నట్టు నాకుఁ దోఁపనందున దానికిఁ బ్రత్యుత్తరము లివ్వ యత్నింపనైతి. ఆయాక్షేపణలలో నొకటిమాత్రము యుక్తముగానుండినది. తురీయాంకమునఁ రంగమున "ముదమార" యనుపద్యములో గీతమున "ప్రావృడంబుదచికురసారంగమదసుగంధి" యని యుండినది పొరబాటు - జవ్వాజియు, కస్తూరియు వాసనద్రవ్యములై యున్నందున భ్రమచే నొకటికి మాఱు మఱియొక్కటి యునిచితి. ఇది కనుఁగొన్నపిదప ప్రకృతమున్నట్టుదిద్దితి. మిగిలినయాక్షేపణ లొక్కటియైన సరిఅయినవికావు. అయిన సదభిప్రాయమున నాయాక్షేపణలఁ బ్రచురించియుండిన విన

యముపైఁ బ్రత్యుత్తర మిచ్చుచుంటిని. ఆయాక్షేపణకర్తల పొరపాటుల నూచింపుచుంటి. ఇట్లుండినను నెల్లూరిలోనుండిన వారొక్కరు నాకంతరంగముగఁ బలుమాఱు జాబులువ్రాసి యాయాక్షేపణలకెల్ల సమాధానములు నావలన గ్రహించి యందులో నిరుపయోగములైన కొన్నిటినిమాత్రము కొన్నాళ్ళపిదప మఱియొక యుద్దేశమునఁ బ్రచురించిరి. దానింగాంచి యూరకే మందహాసము వహించితిఁగాని కనలనైతి.

ఈచిత్రనళీయము ప్రతులు కావలయునని వ్రాసియున్న పెద్ద మనుష్యులకుఁ గొందఱికి ముద్రితమగుచున్నదని "పోస్టుకార్డులు" ప్రత్యుత్తరములుపంపితి. మరలమరల వ్రాయుచువచ్చిరి. ఇప్పటి కది ముగిసినది. కాఁబట్టి యింతవఱకు వారిపుస్తకములు పంపుటలో నాలస్యమొనరించినందున క్షమింప వేఁడుచున్నాఁడను. భాషాభిమానము గల మామిత్త్రుల యభీష్టమునకుఁ గొఱఁత గలుగకుండ శీఘ్రకాలమున నా యితరనాటకములఁ బ్రచురింపఁజూచెదనని నేనిప్పుడు నుడువుట చర్వితచర్వణముగా నుండఁబోవును. ఈనాటకముపై నాదరము గలిగి యింత నాకుత్సాహ మొసరించుచున్న మామిత్త్రమండలికంతయు మఱియొకసారి వందనము లొనర్చుచు నీపీఠిక నింతతో విరమించుచున్నాను.

శ్రీ

# చిత్రనళీయనాటకము

మూఁడవకూర్పు—పీఠిక.

---

ఇప్పటికి దాదాపున సంవత్సరముక్రిందట నీనాటకమునకు రెండవకూర్పుకలిగె. అందునకుఁ బీఠిక వ్రాయుచో నానాటకము నాదరించినవారికిఁ గృతజ్ఞత వెల్లడిపఱిచితిని. నాకవల దేశదేశములనుండి జాబులువచ్చె. వానిలో నాటకప్రశంసయే మిక్కిలి కలిగియుండుట యేకాక యెన్నిచోటులలోననో యీ నాటకము ప్రదర్శించినట్లును, ఎక్కడను దానికి మిక్కిలి యాదరణము కలిగియున్నట్లును సూచితమయ్యె. ఇది మిక్కిలి సంతసమునకుఁ గారణమయ్యె. జనసముదాయమంతయు నాటకమును జదివికాని వినికాని యానందింతురనియు నాకారణమున జనసంతతికి నీతి యలవడుననియు నుద్దేశించి నే రచియించియున్న యీనాటకము జనులకు నాదరణీయమై విలసిల్లెనని వినుటకంటె నాకుఁ గృతకృత్యత వేఱులేదు. నాకు జాబులు వ్రాసియున్న ఘనుల కీమూలమున వందనము లొనరించుచున్నాఁడను. మొదటికూర్పు కాలమునఁ బాటలకెల్ల గుఱుతులు వేయఁబడి యుండెఁగదా! ఆపద్ధతి యీకూర్పునమానితి. నాటకాంతమునఁ బ్రచురించియున్న పాటలున్నచోటఁ బుటసంఖ్య వేసియున్నాఁడ. ఆమూలమున నెక్కడ నేపాట లుండవలయుననుటయు విశదమగును. మొదటికూర్పు పీఠికలోఁ గడభాగమునన్న యితరములగు గుఱుతులుసయితమీకూర్పున ననావశ్యకమని మానితి.

ధ. రామకృష్ణమాచార్యులు,
గ్రంథకర్త.

శ్రీ

# చిత్రనళీయనాటకము.

నాలుగవకూర్పు—పీఠిక.



ఈనాటకము మూఁడవకూర్పు ప్రచురింపఁబడిన యొక వత్సరము లోననే యీనాలుగవకూర్పు ప్రచురింపఁబడవలసి వచ్చినందుకు సంతసించెద. ఇప్పటి కాఱుమాసములనుండి యీనాటకము కావలయునని పలుమాఱు వ్రాసివచ్చి నావలన నుత్తరము వడయకయున్న పెద్దమనుష్యులకంతయు నీప్రతులు సిద్ధముగాలేని కారణము వచింపుచు వారిని మన్నింపవేఁడెద. నా యితరనాటకములు ముద్రితములు కాకుండినను దేశదేశముల నున్నవారు యనుమతిమీఁద వ్రాతప్రతులు తెప్పించుకొనియున్నారు. ఈ మూలమున నాటకసంవిధానములసంభాషణవిధానములఁ బలువురెఱుంగుట కాస్పదమయ్యె. దానివలన నాకేమియు లోపము కలుగకపోయినను, నానాటకముల నున్న కొన్ని సంవిధానాది విధానముల నితర కవివర్యులవలనఁ బ్రచురితములైన నాటకముల నేచూచినప్పుడు నాకింత చింతవొడముట కాకరమయ్యె. నాకుఁ దోచిన సంవిధాన విధానములే యితరులకుఁ దోఁచియుండిన నుండవచ్చును. అందేమియు దోషములేదు. అయిన నా నాటకములఁ బ్రచురించినప్పుడు నా సంవిధానక్రమమే యితరుల స్వత్వముగా పాఠకు లెక్కడ భావింతురో యను శంక వొడముట కాస్పదమయ్యె. కావున నింక నానాటకములఁ బ్రచురించుటకుఁ దడవుసేయుట సముచితము కాదనిదోఁచె. "సావిత్రీ చిత్రాశ్వము" "పాదుకాపట్టాభిషేకము" "విషాదసారంగధరము" అను నాటకములఁ బ్రకటింప నుద్యమించి పాటుపడుచున్నాఁడని నాటకాభిలాషులకుఁ జెప్పుట కుత్సాహము కలవాఁడనైతి.

మఱి యొకమాటతో నీపీఠిక విరమించెద. నా చిత్రనళీయనాటకము "చిత్రనళీయము డ్రామా" అని పేరుపెట్టి పదునాఱవపుట మొదలు తప్పులతడకగా నిరువురు ముద్రాక్షరశాలవాండ్రు, చెన్నపురిలో మూఁడుసంవత్సరములనుండి ప్రచురించుచు, ప్రతియొకటికి నర్ధరూపాయ మొదలు పదకరూపాయవఱకుఁ జేసి విక్రయించుచుండుట యిప్పటి కాఱుమాసముల క్రిందట నాకుఁ దెలిసి (Presidency Magistrate's Court) ప్రెసిడెన్సీ మ్యాజిస్ట్రేటు కోర్టులో నందొకరిపై నభియోగ మొనరించి యుండి యతఁడు ప్రచురించియుండిన తప్పుతడకల నన్నూఱుప్రతుల నాకొసంగి యపరాధపరిహారము నింత యిచ్చినందున ముందు చర్యల మానితి. మఱి యొకరిపై నీలోపలనే వ్యవహారము పూననున్నాను. అందఱికిఁ దెలియుటకై యీయుదంతము నిందు వ్రాసితి.

20-6-08 గ్రంథకర్త.



# ఈ నాటకమునందలి ముఖ్యపాత్రలు.

# తత్ప్రవేశస్థలము.

---

### పురుషులు.

ఇంద్రసేనుఁడు.— నలునికుమారుఁడు ప్రవేశము. అంకము II రంగము. 3-7. అంకము V రంగము 5-6.

ఇంద్రుఁడు.— దేవరాజు. ప్ర॥ అం॥ I రం 3.

ఋతుపర్ణమంత్రి.— ప్ర॥ అం॥ III రం 5 అం॥ IV రం 7 అం॥ V రం 2.

ఋతుపర్ణుఁడు.— అయోధ్యరాజు. ప్ర॥ అం॥ III రం 5 అం॥ IV రం 7. అం॥ V రం 2-6.

ఋషులు.— ప్ర॥ అం॥ IV రం 1.

ఎఱుకులు.— ప్ర॥ అం॥ III రం 4.

కర్కోటకుఁడు.— నాగరాజు. ప్ర॥ అం॥ III రం 3.

కలి.— ప్ర॥ అం॥ II రం I అం॥ III రం I అం॥ V రం 6.

కాముఁడు.— ప్ర॥ అం॥ II రం 1.

క్రోధుఁడు.— ప్ర॥ అం॥ II రం 1.

జయసేనుఁడు.— మాళవరాజు. ప్ర॥ అం॥ I రం 3-5.

జాంఘికుఁడు.— ప్ర॥ అం॥ II రం 2.

జీవలుఁడు.— ఋతుపర్ణునివంటలవాఁడు. ప్ర॥ అం॥ IV రం 8.

దమనుఁడు.— దమయంతిసోదరుఁడు. ప్ర॥ అం॥ I రం 5 అం V రం 6.

దేవలుఁడు.— పుష్కరునిమిత్రుఁడు. ప్ర॥ అం॥ I రం 3-5. అం॥ II రం 4-6-7.



నలుఁడు.— నిషధరాజు. కథానాయకుఁడు. ప్ర॥ అం I రం 1-3-4-5. అం II రం 3-4-6-7. అం III రం 1-2-3-5 అం IV రం 7-8. అం V రం 2-3-5-6.

నిషధపౌరులు.— ప్ర॥ అం I రం I అం V రం .6

పర్ణాదుఁడు.— భీమరాజుయొక్కయాశ్రితుఁడు. ప్ర॥ అం VI రం 4-6.

ప్రతివింధుఁడు— సింధురాజు. ప్ర॥ అం I రం 5.

పావకుఁడు.— (అగ్ని) ప్ర॥ అం I రం 3-5.

పుష్కరుఁడు.— నలుని పిన్నతండ్రికొడుకు, విదిశాపురమురాజు. ప్ర॥ అం I రం 3-5. అం II రం 4-6.

బృహద్వ్రతుఁడు.— ఋషిశ్రేష్ఠుఁడు. ప్ర॥ అం IV రం 1.

భీమమంత్రి.— ప్ర॥ అం I రం 2-5. అం V రం 6.

భీముఁడు.— విదర్భరాజు దమయంతితండ్రి. ప్ర॥ అం I రం 2-5. అం V రం 6.

యముఁడు— ప్ర॥ అం I రం 3-5. అం II రం 7.

లోభుఁడు— ప్ర॥ అం II రం 1.

వరుణుఁడు.— ప్ర॥ అం I రం 3-5.

వార్ష్ణేయుఁడు.— (నలునిసారథి) ప్ర॥ అం I రం 3-5. అం II రం 3-5-7. అం III రం 5 అం IV రం 7 అం V రం 2-6.

విశారదుఁడు.— నలునిమంత్రి. ప్ర॥ అం I రం 1.

వీరనాయకుఁడు.— ఎఱుకులయధిపతి. ప్ర॥ అం III రం 4.

శుచి.— సార్థవాహులయధిపతి. ప్ర॥ అం IV రం 2.

శూరమాలి.— కుంతలరాజు. ప్ర॥ అం I రం 3-5.

సార్థవాహులు.— ప్ర॥ అం IV రం 2.

---

## — స్త్రీలు. —

దమయంతి.— నలునిభార్య కథానాయిక. ప్ర॥ అం I రం 4-5. అం II రం3-7. అం III రం 1-2-4. అం IV రం 1-2-3-5-6. అం V రం 1-4-6.

దాసి.— ప్ర॥ అం IV రం 3 5-6.

నర్మద.— దమయంతి చెలికత్తె. ప్ర॥ అం I రం 4.

భారతి.— డిటో ప్ర॥ అం I రం 4-5. అంV రం 4.

విపుల.— సుబాహువురము రాజమాత. ప్ర॥అం IVరం 3-5-6.

## ప్రథమాంకము.

రంగము॥ 1. నలునితో నిషధపురి పౌరులు పుష్కరరాజుయొక్క దుర్నయములను గుఱించి మొఱపెట్టుకొనుట. [ఇంద్రాగ్ని యమవరుణులు నలుని సంధించుట.

రంగము॥ 2. దమయంతీ స్వయంవరమునకై యాకాశమార్గమున వచ్చియున్న

రంగము॥ 3. దమయంతి విరహతాపము. ఆమె సఖులగు భారతీనర్మదలహాస్యము. దేవదూతరై నలుఁడు దమయంతిని దర్శించుట. [నుండుట-దమయంతి నలునివరించుట.

రంగము॥ 4. స్వయంవరగృహము - రాజులయాగమనము-దేవతలు నలరూపమున

## ద్వితీయాంకము.

రంగము॥ 1. కామక్రోధ లోభులవెంట కలిప్రవేశించుట - దమయంతీ స్వయం వరము తనకు తప్పినందుకు కలివిచారపడి నలుని బాధింప ప్రతిజ్ఞచేయుట. [ప్రకటన.

రంగము॥ 2. నలుని కుమారుఁడైన ఇంద్రసేనుని నాలుగవపుట్టినదినమును గుఱించిన

రంగము॥ 3. నలునిస్వప్నమనోవిచారము.

రంగము॥ 4. తనజ్ఞాతి యగుపుష్కరునితో జూదమాడి రాజ్యమంతయు వోడి నందుకు నలునియంతరంగమిత్రుఁడై సారథియై యున్న వార్ష్ణేయునిసంతాపము.

రంగము॥ 5. నలుఁడు దమయంతితో రాజ్యభ్రష్టుఁడగుట-ఇంద్రసేనుని మాతామహునొద్దకు బంపుట - (మిక్కిలి దుఃఖకరమైన రంగము.)

## తృతీయాంకము.

రంగము॥ 1. నళ దమయంతు లరణ్యములో కూడులేక బాధపడుట.

రంగము॥ 2. నలుఁడు దమయంతి నెడబాయుట (బహుదుఃఖకరమైనరంగము).

రంగము॥ 3. నలుఁడు పాముకఱచి విరూపుఁడగుట. [శిక్షింపఁబడుట.

రంగము॥ 4. ఎఱుకనాయకుఁడగు వీరనాయకుఁడు దమయంతిపై దుర్మోహముకలిగి

రంగము॥ 5. బాహుకనామమున నలుఁడు ఋతుపర్ణునికొలువున వంటవాఁడుగను, రథచోదకుఁడుగాను నిలుచుట.

## చతుర్థాంకము.

రంగము॥ 1. దమయంతి సార్థవాహుల దర్శించుట.

రంగము॥ 2. భీమరాజుచే నలదమయంతుల వెదుకను పంపఁబడిన సుదేవ పర్ణాదులను బ్రాహ్మణులు విచిత్ర సందర్భముల చేరుట.

సేవకులు క్రొత్తసేవకుల నెట్లుచూచుటయు నెఱుఁగుట.

రంగము॥ 4. సుదేవుఁడు దమయంతిని గుఱుతించుట.

రంగము॥ 5. సుదేవుఁడు బాహుకుని నలుఁడని సంశయించుట.

రంగము॥ 6. నలుని విరహతాపము-సుదేవుఁడు నలుని గుఱుతించుట.

## పంచమాంకము.

రంగము॥ 1. భీమరాజునొద్దనుండి సుదేవుఁడు దమయంతీ ద్వితీయస్వయంవరము లేఖ ఋతుపర్ణునికి తెచ్చుట. బాహుకుఁడు దాని చదువవలసి వచ్చుట.

రంగము॥ 2. బాహుకుఁడు. జాబు. అతనిదుఃఖము. (అతిసంతాపకరమైన రంగము.)

రంగము॥ 3. దమయంతి చెలికత్తె యగుభారతికి బాహుకునకు వినోదసంభాషణము. తనకొడుకునుఁజూచి బాహుకుఁడు మైమఱచుట.

రంగము॥ 4. బాహుకుఁడు నలుఁ డగుట. క్షమాపణములు. మంగళము.

# CHITRANALIYAM ARGUMENT.

## ACT I.

**Scene I.**—The citizens of Nishadha complain to Nala about the misdeeds of his cousin Pushkara.

**Scene II.**—Indra, Agni, Yama and Varuna the Celestial Lords, arrive at Vidarbha having heard of the unrivalled beauty of Damayanti.

**Scene III.**—The love-sick Damayanti. Her maids Bharati and Narmada ridicule her. The arrival of Nala as messenger of the Celestials.

**Scene IV.**—The marriage pavilion and the array of Princes. The celestials personate Nala. Damayanti chooses Nala.

## ACT II.

**Scene I.**—Kama, Krodha and Lobha, personifications of human vices, enter with Kali the Demon. Kali is disappointed at the choice of Damayanti and determined to ruin Nala.

**Scene II.**—The proclamation of the 4th birthday of Indrasena, son of Nala.

**Scene III.**—Nala's dreams and presentiments.

**Scene IV.**—Varshneya the chariot-driver and confidential servant of Nala is grieved over the loss of the Kingdom by Nala in gambling with his cousin Pushkara.

**Scene V.**—The banishment of Nala and Damayanti ; Indrasena sent to his maternal grand-father's house. (A very touching scene).

## ACT III.

**Scene I.**—Nala and Damayanti in the wilderness. Their starvation and suffering.

**Scene II.**—Nala parts from Damayanti (a very tragic scene).

**Scene III.**—Nala is bitten by a serpent and is entirely disfigured.

**Scene IV.**—The hunters. Viranaika their Chieftain falls in love with Damayanti and is punished.

**Scene V.**—Nala assuming the name of Bahuka, joins the service of Rutuparna, King of Ayodhya as a cook and chariot driver.

## ACT IV.

**Scene I.**—Damayanti with some caravans.

**Scene II.**—Sudeva and Parnada, two Brahmins sent by Damayanti's father in search of Damayanti and Nala meet under peculiar circumstances.

**Scene III.**—Damayanti in the service of the Dowager, Queen of Chedi. She is made to feel the treatment given to new servants by the old.

**Scene IV.**—Sudeva recognises Damayanti.

**Scene V.**—Sudeva suspects Nala in Bahuka.

**Scene VI.**—Bahuka's recollections. Sudeva's suspicions confirmed and Nala recognised.

## ACT V.

**Scene I.**—Sudeva brings to Rutuparna the letter of invitation for Damayanti's re-marriage ; Bahuka asked to read it.

**Scene II.**—Bahuka and the letter ; His desperate grief. *The most touching scene.*

**Scene III.**—The humorous conversation between Bharati, a maid of Damayanti and Bahuka forgets himself when he sees his son.

**Scene IV.**—Bahuka transformed into Nala. The explanations, apologies and Mangalam.



Bellary, D. KRISHNAMA CHARLU,
**ANDHRA NATAKA PITHAMAHA**
*Born 1853—Died 1912.*

శ్రీ

# చిత్రనళీయనాటకము.

―――

## ప్రస్తావన.

[ప్రవేశము: విజయుఁడు, జయంతుఁడు నను నిరువురు పౌరులు.]

విజయుఁడు,—

శా. శ్రీనంధిల్లఁగ మేడికుంటనగరీశృంగారపూతస్థలిన్
శ్రీసీమంతినితో ధరారమణితో నీళాసరోజాక్షితో
వాసింగాంచిన వేల్పురాయఁడు జగద్వంద్యుండు భక్తావనా
భ్యాసుండాద్యుఁడు కృష్ణదేవుఁడొసఁగున్ భద్రంబుల శ్రాంతమున్.

(అనుబంధము. 1.)

జయం—విజయా! నీవొనర్చిన స్తవము మనోహరముకాని యిక్కడ కిప్పుఁ డేలచూచి వచ్చితివి?

విజయు—ఈబళ్లారిపురమున నేఁడు చిత్రనళీయమను నాటకము జరుగఁగలదఁట, దానిం గాంచ వచ్చితిని; రమ్ము.

జయం—ఏ భాషయందు?

విజయు—ఆంధ్రమునందు.

జయం—ఇన నింక వెనుకకుఁ దిరుగుదము!

విజయు—అదేల.

జయం—ఆంధ్రభాషయందైన దాని సారస్యము తెలిసికొనదియున్నదిగదా?

విజయు—అయ్యో! ఇటులంటివా? చూడకపిదపఁగదా గుణదోషము లెంచవలయును!

జయం—అటులకాదు, ఆంధ్రభాష నాటకమున కుచితభాషకాదనియే నా తాత్పర్యము. కాకున్న నింతవఱకెందఱో పూర్వకవిపుంగవులుండినను, ఒక్కటైన నాటకము నేల యాంధ్రమున రచియింపరైరి?

విజయు—అదెంతమాట! ఇదియొట్టి భ్రాంతి! నాటకములకుఁ దగిన భాషయొకటియుఁ దగని భాషయొకటియు నుండునా? అందునను దేశభాషలన్నిట నాణెమైయున్న తెనుఁగునకట్టి కొఱఁతయా? పూర్వకవులు నాటకములు రచియింపరైరన్న నందునకుఁ గారణము [illegible] అకారణముల నెల్ల నిపుడూహించి వాదింపఁబనిలేదు.

ఆధునికకవిశ్రేష్ఠులు కొందఱు మాతృభాషనుండియు, నాంగ్లేయభాషనుండియు నాటకములఁ దెనుఁగున భాషాంతరీకరించియున్నారు కదా! వానివలన నానందము గలుగుఁగదా? ఒకభాషనుండి మఱియొకభాషను వ్రాయుచోఁ గల పారతంత్ర్యములకుఁ బదపదార్థనిర్బంధములకు నెల్ల నోర్చిన యానాటకములే యానందజనకములైయుండ నూతనపథకమునఁ గల్పించిన స్వతంత్రనాటకము లానందజనకములేకావు! అందునను, ఈనాటకములఁ గ్రీడించువారు సార్థకవిద్యావంతులును, మనీషావిశేషులును నగు నగ్రజన్ములు. సరసవినోదినీసభఁజేరినవారు. ఆదికాక నాటకకర్తయే తానొకపాత్రగాఖేలన మొనర్చువాఁడు. చూడనైనఁజూచి మఱి గుణాగుణములఁ బ్రశంసింతము.

జయం—విజయా ? ఎట్టివారైన నాటకము లాడువచ్చునా ? అట్లాడుట జనసమ్మతముగా నుండునా?

విజయ—అందువలన బాధకమేదియుఁ గానఁబడదు. మనధర్మశాస్త్రములఁ గొన్నింటియందు నాటకుల యింటియన్నము భుజింపఁగూడదని చెప్పఁబడియున్నందున నాటకక్రీడనముపరిగ్రహణీయముకాదని కొందఱందురు. అయినఁ దానితాత్పర్యము నారయ నాటకములవలన జీవించువారియన్నము పరిగ్రహింపఁగూడదని యేర్పడుఁగాని వేడుకకొఱకు జనుల నీతిబోధకొఱకును నాటకఖేలన మొనరించువారివిషయము చెప్పబడినట్టు తోఁపదు. ఒకవేళ నట్లేయున్నట్టెంచి దూష్యమని తలంచిన, అదేధర్మశాస్త్రముల వైద్యుల యింటియన్నమును జ్యోతిష్కుల యింటియన్నము నభోజ్యములని చెప్పఁబడదా ? ఎవరు విడిచినారు ? కాఁబట్టి యందువలన నంతదోషములేదని చెప్పవలసి వచ్చుట యట్లుండఁగా నుద్దేశము మంచిదై జనులకు సుబోధ కలిగినయెడల నున్న స్వల్పదోషము నడఁగిపోవుఁగదా ? అయినఁ "బ్రాచీనులగు మనవా రెవ్వరుగాని యట్లు నాటకముల నాడిరా ? " అనిమాత్ర మడుగవచ్చును. మనప్రాచీనుల చరిత్రలే మనకుఁ దెలియఁదగిన సాధనములు కలుగవు. కావున నాడిరనికాని యాడలేదనికాని చెప్పను దృష్టాంతములులేవు. అయిన సంస్కృతభాషలో ఘనపద్ధతిగల నాటకములఁ జూడఁగాఁ జక్కని జ్ఞానముగల మనపూర్వికులు వాని నాడియే యుండవలయునని తోఁపఁజేయుచున్నది. కాకున్న నంతపూర్ణదశ కానాటకములు రాఁజాలవు. తెనుఁగుననన్న నట్టినాటకములు గానరావు. నీచనాటకులకు యోగ్యములై కేవల భరతాభినయవిశేషముల కాస్పదములైన యక్షగానములు నాటలు గొన్నిమాత్రమే కానఁబడుచున్నవి. అవి తక్కువవారికొఱకే చేయఁబడినవి. అవి వారివలన రసహీనముగా నాడఁబడి యామూలముగ వారకృత్యములు జరుపుచువచ్చినందున నాటకమన్న నసహ్యముగా నెంచునట్టి దుష్ప్రసిద్ధిలభించెనని తోఁచుచున్నది. సదుద్దేశము కలదియై హానిలేక యేవిధముననఁగాని జనోపయోగకరమైన యేకార్యమునందును దోషము గలుగదు. అయినను, నూతనముగా జరుపఁబూనిన యేకార్యమునుగాని దూషించువారు పెక్కండ్రు, అట్టిదూషణమునకు భయపడిన నొక్కకార్యమును గాఁజాలదు.



ఉ. కొంచెపుపెంట లేరితినుకుక్కుటము ల్నినుఁ గందిగింజగా
దంచుఁ ద్యజించినంతనె యహో యపకీర్తియె నీకు రత్నమా!
కాంచనపీఠి నిన్నునిడి కాంతకిరీటములందు నిల్పి య
భ్యంచితరీతి మస్తకములందు ధరింపరె రాజశేఖరుల్.

అనుమాట వినవె ?

జయం—విజయా! నీమాట యథార్థము. పోనీ, ఈ నాటకము పద్యరూపమా? లేక వచనరూపమా?

విజయ—సాధారణముగాసంస్కృతనాటకములేమి యాంగిలేయ నాటకములేమి వృత్తములును వాక్యములును గలయవి. ఈ నాటకకర్తయు నట్లే వృత్త వాక్యరూపముగ దీని రచియింప నుద్యమించె. తన కాలముననే తా నొనర్చిన నాటకముల జనుల సుబోధకై క్రీడింపవలయునను నభిలాష మీకవికిఁ జనించె. ఈప్రాంతములవారదేమి కారణమో నాటకములఁజూచునప్పుడందలి సంవిధానచమత్కారమును, అర్థవైశద్యమును, గవితాచమత్కృతియునంత సరకుసేయక సంగీతమునమాత్ర మెక్కువగా నభిలాషగలవారుగా నుండుటచే వారి సంతోషమునకై సంవిధానసందర్భము ననుసరించి వచనసరణికిని, పద్యసరణికిని గొఱఁతలేకుండఁ జేసియున్నను, అందందుఁ బాటలు సయితము నెలకొలుపవలసివచ్చె. ధీరనాటకములకుఁ బాటలు ముఖ్యములుకావనియు, మీఁదు మిక్కిలి పాటలవలన నెప్పటికిని భావప్రకటనము సురుచిరముగాఁ గలుగఁజాలదనియు జనులందఱు తెలియువఱకు వారిమార్గమే యవలంబింపవలయుఁగదా ?

జయం—విజయా ! ఈ నాటకము రచియించిన కవియెవరు!

విజయ— తే.గీ. కలఁడుగాదె కౌశికగోత్రకలిత కృష్ణ
మార్య పౌత్రుండు కృష్ణార్య నగ్రసుతుఁడు
ఆంధ్ర గీర్వాణ కర్ణాట కాంగిలేయ
గీర్విశారదుఁ డగు రామకృష్ణ సుకవి.

ఆడె వినుము గంట మ్రోయుచున్నది. మాటలసందడినిఁ బ్రొద్దుమఱచితిమి. ఇంకనాటకముపక్రమింపఁబడును. ఇంకింత తడసిలిమా నలుని యాస్థానపై ఖరిఁ జూడఁజాలము. పోదము రమ్ము. (నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

---

శ్రీ

# చిత్రనళీయ నాటకము.

## ప్రథమాంకము.

### ప్రథమరంగము - నిషధలో నలునియాస్థానము.

[ప్రవేశము: నలుఁడు, విశారదుఁడు, సేవకుఁడు.]

నలుఁడు—మంత్రీ! విశారదా! సుదేవునిఁ బంపివచ్చితివా?

విశారదుఁడు—నేఁడుదయమున నేతరలిపోయెను. నేఁగడువవ్వు వెంటవంటిపోయిపంపి వచ్చితిని.

నళ—అతఁడు గొప్ప విద్వాంసుఁడుగదా? అట్టి పురోహితుఁడు భీమరాజు భాగ్యవశమున లభించినాఁడు.

విశార—అతఁడు వచ్చినకార్యమేమో తెలియదయ్యె.

నళ—కార్యమేమి? దేశదర్శనార్థము వచ్చితినని చెప్పఁడా?

విశార—దేవరవారికతనితో మొన్న నేకాంతగోష్ఠి కలిగినది మొదలు చింతయున్నట్టు ముఖభావము సూచింపుచున్నది. అది రాజ్యవిషయముగా నున్న యెడల—

నళ—రాజ్యవిషయము చింతయేమికలదు? ఆ విషయమునందంతయు మన పుష్కరుని చింతయే.

విశార—ధాత్రీశ్వరా! అపుష్కరునివలన మనరాజ్యమున కేయపకీర్తిగలిగె. పినతండ్రి కుమారుఁడని యోచించిన దుష్కాళము తప్పదు.

నళ—సత్యము.

తే,గీ. ధర్మమార్గంబు దప్పక కూర్మిగలిగి
బాధలనుమాన్చి దాక్షిణ్యభంగి విడిచి
ప్రజల రక్షింపఁజాలని వానికేల
కొల్పనే రాజనామంబు ఘనతరంబు.

అయ్యో! చందనవనమునఁదుమ్మచెట్టుపుట్టినట్టు లీవంశమున నీపుష్కరుఁడుజనించె.

సేవక—రాజేంద్రా! కొందఱుపౌరులువచ్చి కాచియున్నారు.

నళ—నిర్వివాదముగ రానిమ్ము.



[ప్రవేశము: నలుగురు పౌరులు.]

పౌర—రాజశశాంకా! విజయోఽస్తు.

నళ—పౌరులారా! కుశలమా?

పౌర—ఎక్కడి కుశలము?

(అనుబంధము. 2)

తే, గీ. భూవయేమని మాపరితాపభంగి
విన్నవించెదము?

న। అదియేమి యన్నలార!

పౌరులు— అధిప మీపుష్కరునిదాడి-

నళ— అక్కటావి

శారదా! యెందు మొఱయిడువార కాదె!

మొదటి పౌరుఁడు—

క. తనుఁ గాంచి లేవలేదని
కనికర మింతైనలేక కడులేవంజా
లని ముదుకని నా జనకుని
జనులెల్లనుఁ జూడఁ దన్నెఁ జరణమున—

నళ— అయో

రెండవ పౌరుఁడు—

తే, గీ. నేఁడు నాభార్యవీథిని నీరుదెచ్చు
చుండ నిర్భీతిఁ బైఁబడ నుద్యమించె
కడవఁ బడవైచి యయ్యింతికడకుఁబారెఁ
గనుమిదే భాండ మింత యాగడమె—

నళ— అకట

మూఁడవ పౌరుఁడు—

క. తులువతనంబున, "నీకీ
బలుమీసములేల!" యనుచుఁ బలుకుచు నను వం
గలిఁ బిలిచి యొక్క-చెంపం
బలిమిం గొఱిగించె నట్టిపాడి-

హరిహరీ,

నాలుగవ పౌరుఁడు—ధర్మదయాపరుఁడైన వీరసేనుని సుతుఁడు నలుఁడు రాజ్యమేలు కాలమున నతనితమ్ముఁడు పుష్కరేశుని పరమానుగ్రహమునఁ బ్రజలశరీరములకు భార్యాదులకు మిక్కిలి మరణసౌఖ్యముగలిగియుండెనని జనులందఱు నీదుసత్కీర్తిని బ్రశంసింపఁగా నీవును నీపుష్కరుండును శాశ్వతబ్రహ్మకల్పముగాఁ జల్లఁగానుండుఁడు అయ్యో—

నళ—పౌరులారా! ఊఱడిల్లుఁడు.

మ. కరుణాలేశము లేక మిమ్ము నిటులన్ గారించెనే యూరపు
ష్కరభూమీశుఁడు వాని దండితునిఁగాఁ గావించి ధర్మైకసు
స్థిరత న్నాపినతండ్రి పుత్త్రుఁడనకే శిక్షింతు మన్నింపుఁడీ
పరితాపంబుఁ దొలంగిపొండు నలుఁ డీపాపంబు సైరించునే!

పౌరుఁడు—భూమీశా! ఆర్తులకు మాకింక వెఱ పేటికి? మీపుష్కరుని జనులందఱు దండధరునిగా భావింతురు. వానికంటె నెక్కువగా వానిమిత్త్రుఁడు దేవలుఁడు మమ్ముబాధించువాఁడు. వాఁడు బ్రాహ్మణుఁడఁట! ఎట్టి గ్రహణమువేళఁ బుట్టెనో. వారి దాడిదప్పించి మమ్మెటుల రక్షించెదో యెఱుఁగము.

నళ—పౌరులారా! నేనదంతయుఁ జక్కఁజేయుదు. మీరు చింతలఁ బాసిపొండు.

పౌరులు—భాగ్యము. (నిష్క్రమింతురు.)

నళ—విశారదా! ఇంక నాయత్నములేదు. నీ వింకఁ బుష్కరునితో నీయూరు వెడలిపొమ్మనుము. విదిశాపురమునకుఁ బోయి యందే యుండ నేనాజ్ఞయిడితినని వచియింపుము. అందైన ధర్మమార్గము పట్టునడు నేమో చూచెద. పట్టువడకున్నఁ దరువాతఁ గావింపవలసినవిధానము వేఱు. అదిగాక యా విదిశాపురంబునను వాఁడేమైన దుడుకుచెయిదము లొనర్చినఁ దప్పక మాకెఱింగించుట కందలి మా ప్రతినిధికిఁ గట్టడఁ బంపుము. నేనింక వానిముఖముఁ జూడఁజాల (నిష్క్రమింతురు).

---

## ద్వితీయరంగము - విదర్భలో భీమరాజు నాస్థానము.

---

[భీముఁడును, మంత్రియు నందుండుదురు.]

భీమ—మంత్రీ! నాపుత్త్రి దమయంతి యెట్టిగోల! నళసార్వభౌమునిఁ జిత్రపటమునఁ గాంచిన నాఁటనుండి యూరక పిచ్చిమోహము పూనియున్నది.

చ. బలువెతఁ గాంచుఁ జిత్తమున బాలి జనింపఁగ నేకతంబునన్
నలుని పటంబుఁ జూచి లలనామణి కన్నుల నీరునించు నే



వలపుఁగదూలు నుస్సురను నన్నము నిద్రయుఁ గోరకుండు వి
హ్వలగతి నొక్కమాటడుగ నాడును వేఱొకమాట భ్రాంతయై. (1)

(అనుబంధము. 3)

ఉ. గాసిలి తారతమ్యగతిఁ గానక సూనశరాసనవ్యథన్
మీనర మైనతాపమున మేను కృశింపఁగ సార్వభౌముపై
నాసవహించి డీలుపడు టారయ నందని మ్రానిపండ్లకై
యాసవహించు చందమొకదా యనితోఁచెడు మంత్రిసత్తమా.

మంత్రి—భీమరాజేంద్రా! మీదమయంతి నా నళరాజే యేల? దేవేంద్రుఁడయినఁ గన్నులకుఁ గప్పికొనఁడా? ఇప్పు డారాజునొద్దకుఁ బోయియున్న మన సుదేవుఁడు కార్యము సాధింపలేనివాఁడా?

భీమ—ఆసుదేవుఁడు రెండవబృహస్పతియే. అతనిశక్తి నమ్మియింత యూఱడిల్లవలయు.

మంత్రి—ఇదే తలఁచుకొను వేళకే వచ్చెను.

[ప్రవేశము: సుదేవుఁడు.]

భీమ—మంత్రి (నమస్కరింతురు.)

భీమ—సుదేవా! వృత్తాంతమేమి?

సుదే—ప్రభువునభీష్టమున కేమైనఁ గొఱఁత గల్గునా?

భీమ—ధన్యుఁడ నైతిని. నలుని నెట్లు చూచితివి? ఎట్లు మాటలాడితివి? అతఁ డేమనెను?

సుదే—రాజేంద్రా! నేను నిషధకుఁబోయి నలరాజుం గంటిని. అతని యాదరణమెంతన వచ్చును.

క. ఆరూపం బావినయము
నా రాజశ్రీప్రీతి యాయుదారగుణము నా
ధీరత శీలిత నిరహం
కారత యేరాజులందుఁ గాన నరేంద్రా.

సమయానుకూలముఁ గని యాతనితో మనదమయంతిం బ్రశంసించి-వెయ్యేటికి? ఏమేమి చెప్పవలయునో యదియంతయుఁ జెప్పి దమయంతి రూపపటముం జూపితిని. అతనికి దమయంతిపై ననురాగము జనించినదని తోఁచుచున్నది. స్వయంవరము చాటించితిమేని యవశ్యమేతెంచి పాణిగ్రహణ మొనరింపఁగలఁడని తోఁచుచున్నది.

భీమ—అతఁ డేమనియె? నిక్కమరయ పంపినట్లు వచించితివి!

సుదే—నాయంతకు నేను దేశదర్శనాభిలాషముపూని యచ్చటికిఁ బోయినట్లు వచించితిని, అతఁ డేమనఁగలఁడు అతనియింగితము మాత్రము గుఱుతించితి.

భీమ—మంత్రీ! కడుశీఘ్రకాలమున స్వయంవరమునకు శుభదిన మేర్పఱచి దేశదేశము లకు లేఖములఁ బంపుము. సుదేవా! పోదము రమ్ము. (అందఱు నిష్క్రమింతురు.)

---

## తృతీయరంగము - భీమపురి ముందటి బయలు.

---

[ప్రవేశము: ఇంద్రాగ్నియమవరుణులు (ఆకాశమార్గమున).]

ఇంద్రుఁడు—అగ్నియమవరుణులారా! కంటిరే యీ విదర్భపురము? ఎంతమనోహరము!

(అనుబంధము. 4)

సీ. సమవేత పరిఖాంబు సమితితో దుర్ఘట
ప్రాకార కుంభీర పంక్తితోడ
రమణీయ విపణిభంగములతో నట్టాల
కమనోజ్ఞ నీరజాతములతోడఁ
బ్రకటనిష్కుటవిద్రుమకుడుంగములతోడఁ
గమనీయ సౌధ శైలములతోడ
విద్విడభేద్య వప్రద్వీపములతోడ
నారామజలనీలికాళితోడ
తే,గీ. సంచితశతాంగ నౌకాచయంబుతోడ
సమద దంతావళ తిమింగిలములతోడ
మహితసింధూద్భవ విహంగమములతోడఁ
దనరి యీపుర వారాశి ఘనతమించె.

అగ్ని—దేవేంద్రా! అద్భుతముగా నున్నది.

యమ—

మ. అమరాధీశ్వర నారదుండనిన భాగ్యంబెల్ల నీ ప్రోలునన్
సముదారంబుగఁ దోఁచె నిర్జరపురీ సామ్యంబుగా నింక సం
యమిచంద్రుండు ప్రశంసచేసినటు లీక్ష్మాపాలపుత్త్రిలలా
మము సౌందర్యమునందు మేనకను రంభన్మించుటాశ్చర్యమే.

[ప్రవేశము: శూరమాలి, జయసేనుఁడు (క్రింద).]

జయసేన—శూరమాలీ! మన మింతదూరము వచ్చినదంతయు వ్యర్థప్రయాసమని నాకుఁ దోఁచుచున్నది.



శూరమా—[illegible]యేటికి ?

జయసేన—దమయంతి యిదివఱకే నలరాజును మనసున వరించియున్నదఁట. ఆచక్రవర్తితో మనము సరియగుదుమా ?

శూరమా—జయసేనా ! నీ కేమి భ్రాంతి ? బ్రహ్మఘటన మెట్లున్నదో. లోకమునను న్న రాజకన్యలందఱు నలునే పెండ్లియాడుదురా? కామినులు సౌందర్యము నెడఁ బక్షపాతము గలవారు? నాకంటె నీకంటె నలుఁ డంత యందముగలవాఁడా? పోదమురమ్ము.

(నిష్క్రమింతురు).

[ప్రవేశము: పుష్కరుఁడు, దేవలుఁడు].

దేవల—పుష్కరరాజా ! మొన్న నీవు వేయించిన యుపవనము నీకును దమయంతికిని విహారార్థ మెంతవేడుకగా నుండును!

పుష్క—దేవలా ! ఈ యాశలవలనఁ బ్రయోజనమేమి ! దమయంతి నలరాజునే వరియింపఁ గలదని మనము వినలేదా ?

దేవల—అదేమి నిశ్చయము ? నలునిమాత్రము దమయంతి వరింపనీ—

పుష్క—ఏమిచేసెదవు ?

దేవల—ఆమాట లిప్పుడేటికి ? పోదమురమ్ము.

(నిష్క్రమింతురు.)

వరుణ—ఈరాజులందఱు దమయంతీ స్వయంవరమునకై వచ్చుచున్నవారుకాఁబోలును.

అగ్ని—ఇదేమో రథధ్వాన మద్భుతముగా నున్నది.

ఇంద్ర—అతఁడే నిషధాధిపతి యగు నలుఁడు వచ్చుచున్నాఁడు.

యమ—సత్యశ్రీనిధి యని ప్రఖ్యాతుఁ డగు రాజితఁడే కదా !

ఇంద్ర—ఇతనిఁ బరీక్షించి యొక్క వేడుకచేయుదము.

[ప్రవేశము: నలుఁడు వార్ష్ణేయునితో (రథముమీఁద)]

నల—వార్ష్ణేయా ! చూచితివే యీ భీమపురముసొంపు ?

హరిణగతిరగడ.

ఈపుర వైభవ మెన్న నద్భుతము
కాపుర మగు శ్రీ కాంతకు సతతము
ఎన్నఁగ నెంతయు హెచ్చి మించెను
గన్నుల కద్భుత గరిమ జనించెను

ఘనసాలము లాకాశం బంటెను
జనుభేదంబు రసాతల మంటెను

పొగడం దగదే బురుజుల యందము
తగు వప్రంబుల తరలని చందము

రాణం దనర్చెడు రతనంపు సీమలు
మాణిక్యోజ్జ్వల మందిర భూములు
గగనోన్నతగతింగను సౌధంబులు
మగు డని మదసామజయూథంబులు

రమణీయము లగు రథ నిచయంబులు
కమనీయ శుభాంగముల హయంబులు
మానగు నీడల మలసిన తావులు
జానగు తియ్యని జలముల బావులు

చందము మించిన చక్కని పేటలు
అందము లలరిన నచ్చంపుం దోటలు
సురుచిర ఫలయుత సురసాలంబులు
పరిసర భూతగ నరసాలంబులు

తతగానకళా ధారాళంబులు
హితమధుసేవా హేరాళంబులు
ప్రచుర లతాంత వ్యాలంబంబులు
రుచిరమదాలసరోలంబంబులు

మిహిరోపల నిర్మితసౌధాళీ
మహిమోన్నత బహుమత్త మరాళీ
కీరీ శారీ కృతనాదంబులు
హారి ధూప బహుళామోదంబులు

కంటివె యీపుర కాంతల చందము
కంటి కింపొసంగె ఘనమీ యందము
మందగమనముల మాదిరి పోలదె
సుందరాంగములం జూచినంజాలదె

నెలకొను నీరమణీవారంబుల
యులుకులం గులుకుల నొయ్యారంబుల



నెంతని పొగడంగ నీబలుచందము
సంతరించె మెచ్చంగ నానందము

వల్లక నికరా యత గాంగఝరీ
కల్లోలోద్ధృత కంకణలహరీ
నేచిత కువల కుశేశయభాసిత
మోచా కుసుమా మోద సువాసిత

బృందారక భట విసరా పాలిత
మందార లతా మాలాందోళిత
చలిత పటీరోజ్జ్వలశీతల ఘన
మలయ నగాగత మందానిలమున

బలు తమి మీఱంగం బయ్యెద జాఱంగ
వలపుల మించుచు వన్నెలు నించుచు
సొలపులం గులుకుచు సొంపులం జిలుకుచుం
జిలుకలం బలుకుచు సిగ్గులం దొలుకుచుం

బొలుపుల సోలుచు ముద్దులం దేలుచుం
జెలులను బిలుచుచుం జెన్నులం బొలుచుచు
గజిబిజి నించుచుం గన్నులం బొంచుచు
బొజుంగులం గాంచుచుం బ్రోది వహించుచు

పొంతలం జూచిన పొంకము దోంచిన
కాంతల చందముం గన నానందము.

ఇంద్ర—వీరసేనకుమారా! నళసార్వభౌమా!

నళ—(దిక్కులుపరికించి) ఎవరు నన్ను బిలచినది? (చూచి) ఆహా! వీరెవ్వరో దేవతలు. బృందారకులారా? నమస్కరించెదను.

ఇంద్ర—కళ్యాణమస్తు.

నళ—నాకు సాక్షాత్కరించి నన్ననుగ్రహింపనెంచిన దేవోత్తము లెవ్వరో యెఱుంగ లేకున్నాను.

యమ—ఆ, వె. ఇతఁడు దేవనాథుఁ డితఁడు వైశ్వానరుం
డితఁడు పాశపాణి—

ఇంద్ర— ఇతఁడు యముఁడు!

పార్థివేళ నిన్ను నర్థించువారము
కడఁగి యొక్క స్వల్పకార్యమునకు.

నళ—వార్ష్ణేయా! నీ వీరథముంగొని యందుఁబొమ్ము. నే నిదె వచ్చెదను.

ఆహా! కల్పవృక్ష కామధేను చింతామణులుగల యీదేవేంద్రుఁడు, యజ్ఞముఖమున సర్వశుభముల నొసఁగఁగల యీయనలుఁడు, జీవరాశి శాసింప దక్షుండగు నీ సమవర్తి, లోకజీవనదాతయగు నీవరుణుఁడు, నన్నర్థించువారఁట హా! నా భాగ్యము!

సీ. నేఁడుగా బహుళవర్ణిత మనోభీష్టముల్
సమకూరె నెలమి నా కమరులార!
నేఁడుగా లోకవందితతపోమహిమంబు
వెలయంగఁ గనుఁగొంటి విబుధులార!
నేఁడుగా నాపాప నిచయంబులెల్లను
దీఱుభాగ్యముఁ గంటిఁ ద్రిదశులార!
నేఁడుగా భువనమానితజన్మవితతికి
వెలసె సాఫల్యంబు వేల్పులార!

తే. గీ. నేఁడుగా మదిఁ దలపోసిచూడ నిఖిల
బహుళకల్యాణములుగల్గి మహితభంగి
ధన్యమానసభాగ్యంబుఁ దనరఁగంటిఁ
గలుషపరిహారులార దిక్పాలులార.

దిక్పాలవరులారా! అకించనుఁడనైన నన్ను బెద్దజేసి లోకవంద్యులైన మీ రర్థింప వచ్చినకార్యము నెట్టిదయినఁ జేయఁగలవాఁడ.

ఇంద్ర—నీవు సత్యగుణైకభావ్యుండవు. యోచించి వచనమిమ్ము.

నళ—అయ్యో! ఇదియే మిట్లానతిచ్చెదరు?

ఉ. సూనృతధర్మమాఁది మది స్రుక్కక మీరలు కోరు నర్థముల్
ప్రాణములైననేమి మఱి ప్రాణముకంటెను ప్రాణమైన నే
దేని యొసంగి నేను ఘటియించెద నెమ్మది వింశయింపకో
శ్రీనిధులార భవ్యసురశేఖరులార యొసంగఁ జేయుదే...



ఇంద్ర—నళభూమీశా! సత్యము కానిమ్ము. మేమందఱ మీదమయంతీస్వయంవరమునకై వచ్చినవారము-ఏమట్లు యోచించెదవు?

నళ—దేవేంద్రా! ఏమియునేదు (స్వగతము) హృదయమా! తొందరపడకుము.

ఇంద్ర—ఆదమయంతితో మాటలాడి మానలువురిలో నాతన్వి యెవ్వరినైన వరింపఁ జేయుభారము నీయది.

నళ—(తిచ్చపడును).

యమ—నళరాజా! ఇదేమి? ఊరకున్నావు.

నళ—సురపుంగవులారా! నన్ను మీరిట్లు పరీక్షింపవచ్చునా? నేనును దత్స్వయంవరాపేక్షచేఁగదా వచ్చియున్నాఁడ? ఇది నాకు సాధ్యమగునా?

యమ—దేవేంద్రా! సత్యవ్రతుఁ డనిడు మానవుఁ డెవ్వఁడుకలఁడు? ఒక హరిశ్చంద్రుఁడుండెఁగాక. మిగిలిన యిట్టిమానవులెక్కడ? సత్యమెక్కడ? పోనముఱందు.

నళ—నిర్జరనాయకులారా! ప్రాణహానికైన నోర్తుఁగాని సత్యహానికోర్వఁజాల. నన్నేటి కిట్లాడెదరు?

యమ—ముంజేతికంకణమున కద్దమేటికి? ఉబ్బిముందువెనుకలరయక మాకార్యమెట్టిదైనఁ జేయుదునని మాటయిచ్చి యిప్పుడు తిరుగుబాటుచేసిన సత్యవ్రతముచాలదా?

నళ—అయ్యో! ఇటుతగునా! పురుషుఁడనైన నాకాతరుణీమణియంతఃపురము ప్రవేశింప సాధ్యముకామినట్లంటిఁగాక నేఁ జేయనంటినా!

ఇంద్ర—ఓహో! ఇందునకా? ఈఘుటికం గైకొనుము.

క. ధరణీవర యీఘుటికయె
తిరస్కరణి మానవుం డదృశ్యతఁ జెందున్
శిరమున దీని ధరించిన
నరగునమాయీప్సితంబు సమకూర్పుమిఁకన్. (ఇచ్చును.)

నళ—(కైకొని) భాగ్యము.

(ఇంద్రాదులు నిష్క్రమింతురు.)

ఆహా! "తానొకటితలఁప దైవము తానొకటితలఁచు" ననుట తథ్యమాయె. హా! దమయంతీ! నినువరించి నీజతఁగూడి యెంతో సమ్మోదముననుండ వాంఛచేసితిఁ గదా! పిట్టపిడుగున నాకిట్టిపాటు రాఁజెల్లునే!

(అనుబంధము-5)

ఉ. మీఱఁగరాని బాళి నలమెచ్చులముద్దుల వన్నెలాడికై
తీఱని చిత్తకోరికలు దిట్టతనంబెడవోవఁగోరి యి
ట్లాఱడి యాట యొంచకకటా మిడిమేలఁపుటానఁ జేసి పెం
పేఱిడి నైతి శిగ్గలఁపు వింతలు వాటిలె నేమిచేయుదున్.

ఆహా! ఎంత తప్పుచేసితిని! అనిమిషులకులై గోత్రపవిత్రకరణ తేజాభరణులైన దేవేంద్రాదులకు వచనమిచ్చి నే నీరీతిఁ జింతింపవచ్చునా? ఇంక నీవృత్తాంతము మఱుఁగుపలదయు:—

అయ్యో! ఎట్లుమఱతును! ఎదియెట్లున్నను, ఈ సంధానకరణమునకు నెట్లుద్యోగింతును!

శా. అంధప్రక్రియ సత్యనిష్ఠకయి యా యబ్జాక్షిపై మోహసం
బంధం బీఁగఁగనోర్తుఁగాక బహుప్రేమంబాసి యీకార్య ధా
రంధర్యంబున నెట్లు నాయనుఁగు సారంగాక్షి నే నొడ్లకై
సంధానం బొనరింపఁజాలుదును లజ్జాహీనతన్ దైవమా!

ఈస్వయంవరభ్రాంతి నాకేటికిఁగలిగె? నేనేల యిక్కడికేతెంచితి? ఈదిక్పాలురీకార్యమునకు నన్నేల నియమించిరి? నేనేల యియ్యకొంటిని?—

తప్పదు! ఎట్లును ధైర్యమువహించి కార్యమొనర్పవలయు.

నాకర్ధాంగి కాఁగలదనిరయించిన దమయంతి దేవేంద్రునర్ధాంగలక్ష్మియగుట భాగ్యమే కదా! ఈపటమే నాకింకదమయంతి.

మ. అదిరా యింతుల మేలుబంతి గొనబౌ నచ్చంపుఁ బూబంతి యీ
పదియాఱ్వన్నె కడానిగొంతి ననుఁ జేపట్టంగ నా కోరికల్
పెదచల్లన్ ప్రమతూఱు పెన్నఁడని యువ్విళ్ళూరుచుండుంగదా
యిదియే నాదమయంతి నా రతన మింకేలా తమిం గుందఁగన్.

(పటము నెదకొత్తుకొని).

ఈరూపము చూచినప్పుడే యింతమనోహరముగా శోభిల్లు సుందరాంగి దేవరాణి యగుటకుఁ దగుంగాని తుచ్ఛమానవులకుఁ దగదని యనుకొంటిని. అందని మ్రానిపండ్లకేనేల యాశవహించితిని?—

ఎట్లయినను, ఈరమణీమణి సందర్శనమొదవినందులకు సంతసిల్లెదను. కేవల చిత్రపట దర్శనమేకాక రాకాసుధాకరబింబమువోలె విలసిల్లు నారాజనందన వదనదర్శన పుణ్యము నాకుఁ గలిగియుండఁగనేకదా నన్ను వెదకి దేవత లీకార్యమునకుఁ బంపిరి? కానున్న వారికి దూతలులేకయుండిరా!

ఆహా! ఎంతసరిపుచ్చుకొన్నను మదినూఱటజనింపదుగదా! జనింపకున్న నెట్లు? దమయంతి యందలిప్రేమమా! నన్నిట్లేవెడలిపొమ్ము. తిరస్కరణీ! నీయందైన నదృశ్యకరణ ప్రభావము లేకయుండరాదా! (అని ఘుటికం దలయందు ధరించును).

(నిష్క్రమించును.)



## తురీయరంగము - దమయంతి యంతఃపురము.

---

[ప్రవేశము : దమయంతి].

(అనుబంధము-6)

దమ—(స్వ)

ఉ. ఉల్లన మూడు నెచ్చెలుల నూరక గీటునఁబుచ్చి యిన్నినా
ళ్ళొల్లమిగా నటించి మదనోజ్జ్వలతాపము దాఁచికొంటి నా
వల్లభుఁ డిందు రాఁగలుగువార్త యొకింత తలంచినంతనే
జల్లనిమానసం బదురసాగెఁ దలంకెద నేమిచిత్రమో.

మ. యువతీ మన్మథుఁ డిందువచ్చునొకొ రాఁడో వచ్చి నన్నింత గా
రవ మింపారఁ దలంచునో తలఁపఁడో రక్షించునో కావఁడో
నవలావణ్యకరగ్రహంబుఁగని నానాభంగుల న్సౌఖ్య మొం
దువిధిం గాంచెడిదాననో యకట కానో ప్రాప్తి యెట్లున్నదో.

[ప్రవేశము: భారతి, నర్మద].

భారతి—ఏమి? దమయంతీ! ఇట్లు యోచించుచున్నావు? రేపుగదా నీస్వయంవరము? నలరాజు రాఁగలఁడు వివాహమాడఁగలవు.

దమ—భారతీ! నాకాచింత యేమియులేదు.

నర్మద—చింతలేకున్న నీముఖమేటికిట్లున్నది?

దమ—ఏకారణముచేతనో మనసున భయమవుచున్నది.

నర్మద—సంతోషము సంభ్రమమువల్లనే భయము.

దమ—నన్నేటికి హాస్యముచేసెదరే? నా శరీరమున రోమాంచము లెట్లెగయుచున్నవి చూడుఁడు నే నబద్ధమాడను.

భార—ఇది యబద్ధమేటికగును? ఈ రోమాంచములు రేపు నళచక్రవర్తి కౌఁగిటికి లోనైనపుడు కలుగఁబోవు పులకాంకురముల సూచింపుచున్నవికదా?

దమ—చెలియా! నీ యొగతాళిమాటలు చాలును. నేనెవరిపైనైనను బిచ్చిభ్రాంతి కలిగియున్నా ననుకొన్నారా?

భార—అది పిచ్చిభ్రాంతి యెందునకగును? ఎవరిపైనైననేటికి? నలునిమీఁదిలోక మొక్కటియేకదా?

దమ—ప్రాణసఖులని మిమ్ము నమ్మినందుకు బాగాయె. మీకుఁ బ్రొద్దుపోవకున్న మీప నులకుఁబొండు.

నర్మ—దమయంతీ! ఎన్నిదినములాయెఁజూడుము. నీవు నిండునిద్దుర యెఱుఁగక? ఈమూఁడు రాత్రులనుండి కంటిరెప్ప నొక్కనిమిషమైన మూయకున్నావు.

మొన్నటియాఁకలి లేమికిని, నిన్నటితలనొప్పికిని వేఱుకారణములయునా? నెచ్చెలీ! ఇంత భ్రాంతి నీకుఁదగునా?

భార—నర్మదా! కన్నులనెందఱనో చూచినారముకాని యిట్టిదానిఁ జూడము. అప్పుడుగా దిప్పుడు నలుఁడు తనయెదుటికి దుమికిరావలె ననుకొనుచున్నది.

దమ—(ఆయాసమున నిట్టూర్పువిడుచును).

నర్మ—భారతీ! నిక్కముగా నీసఖికి బాధయున్నట్లున్నదే.

భార—ఊఁ—నీకునుబాధయే.

దమ—(ఇంచుకశరీరము జలపరించినభంగి వణఁకును).

నర్మ—చూడవే? వణఁకుచున్నది. (దమయంతిశరీరమును స్పృశించి) ఎంతజ్వరము వచ్చినట్లున్నది. దీని యొడలైనను జూడవే.

భార—ఒడలేమిచూచెదవే? వడలు, అతిరసాలు! (శరీరము స్పృశించి) ఔనే! ఏమో యని యెంచియుంటిని. ఎంత క్రాఁగుచున్నది!

దమ—(మూర్ఛిల్లినచందమునఁబడును).

భార—దమయంతీ! దమయంతీ! ఆహా! ఇదేమి విపరీతమాయెను.

నర్మ—నేఁజెప్పలేదా? నలరాజువలని యాశాభీతివలన నీచెలి కీమన్మథావస్థ జనించినది.

(ఇరువురు దమయంతి కుపచారము లొనర్తురు.)

దమ—(మెల్లఁగలేచి) హా! ఇదేమే నాకింత తాపమయినది? భారతీ! నే మేలుకొని యున్నానా నిద్రించుచున్నానా?

భార—అదేమో నాకుఁ దెలియదు. కలవరింపమాత్రము కలవరింపుచున్నావు.

దమ—సఖియా! నే జీవింపఁగలనా?

(అనుబంధము-7.)

చ. గటకట దాఁచనేల యిఁక గాదిలి నెచ్చెలులార యూరకే
తటతటయంచు గుండియలు తాళక కొట్టుకొనంగసాగె మి
క్కుటమగు సంగదల్గలిగెఁ గూరిమిఱేఁ డిటువచ్చుదాఁక బి
మ్మటమనఁజాల నెయ్యెడను మండెడు వేసవిగాఁగఁదోఁచెడున్.

సీ. వెలయ నలావనీ విభుఁడిందువచ్చినఁ
గడఁగి యాతని మీరు కాంచరమ్మ
రాకున్న నైషధు రాజధానికిఁబోవ
వేఁడి యాభూమీశుఁ జూడరమ్మ
"నినుఁగోరి దమయంతి మనసిజానలమున
మడిసెఁ దాళక" యంచు నుడువరమ్మ



"పరమేశు నిను భవాంతరమునఁ దననాథుఁ
జేయవేడ" నటంచుఁ జెప్పరమ్మ

తే, గీ. కరుణ వదలకు మనరమ్మ కడకు నిదియె
మనవి యనరమ్మ పితరుల వనటఁ గుంద
వలవ దనరమ్మ యూరడఁ బలుకరమ్మ
మాటికింక మీ దమయంతి మఱవరమ్మ.

భారతి—సకియా! ఇట్టిజాలి నీకుఁ దగునా?

(అనుబంధము-8.)

శా. బాలా యేటి కలంతఁ జెంద నలభూపాలుండు విచ్చేసి ని
న్వాలాయంబు వరించు నమ్ముము శుభప్రారంభకాలంబునన్
లీలన్ జేవు స్వయంవరం బనఁగ నశ్లీలోక్తు లిట్లాడఁగా
నేలా ప్రాణము వాయునంత వగ నీకేమున్నదే మానినీ!

చ. కలఁగకుమమ్మ మా మనవిఁ గైకొనుమమ్మ తలంప వట్టిపే
రలఁతగదమ్మ యిట్లుతగునమ్మ యలందురఁగీడు పేరిఁకన్
దలఁపకుమమ్మ నీదు తలిదండ్రులు దీని వినంగ నెంతయున్
దలఁకుదురమ్మ సంతసము దప్పకపొందెదవమ్మ కోమలీ!

దమ—(నిద్రవచ్చుట నభినయించి) చెలులారా! మీరుచెప్పుటకేమి? నాకేమో.—

(నిద్రపోవును)

నర్మద—భారతీ! ఈతన్వికై మనమింత మన్మథపూజయొనర్చిన నీతాప ముపశమింపఁ గలదని తోఁచుచున్నది.

భారతి—నిక్కము వచించితివి. మన మిప్పుడపోయి వలయుపదార్థముల సేకరించుకొని వత్తము రమ్ము.

నర్మద—నీవు పొమ్ము నే నిందేయుండెద. ఇందెవ్వరును లేకున్న నెట్లు?

భారతి—ఏమిభయమే? ఇందే దాపుననే యుందుముగద? ఎట్లును నీరమణికి నిద్రవట్టియున్నది.

నర్మద—అయినఁ బోదమురమ్ము (ముందటికివచ్చి) ఆహా! ఇదేమే భారతీ! నాకెవ్వరిదో శరీరము సోఁకినట్లాయెను.

భారతి—నీవెవరిని దెచ్చుకొంటివే?

నర్మద—అబద్ధముకాదు. ఎవరైన శీఘ్రగతిఁ బ్రక్కకుఁబోయిన వీవఁగల గాలివీచెను.

భారతి—తెలిసినది. ప్రత్యక్షమయినది.

నర్మద—ఏమయినది?

భారతి—ఇంకేమికావలె? దమయంతికి నళరాజుభూతమాయెను. నిన్ను భూతరాజేపట్టెను.

నర్మద—హాస్యమువలదే. అదిగో యిందెవరో నడిచినశబ్దము వినుపించుచున్నది. కస్తురి కుసుమవాసనయు గంధపువాసనయు వచ్చుచున్నది. కన్నులకొక్కరుం గానరారు.

భారతి—కాదే నర్మదా! నీ విరహమునకు నేనెక్కడ నుపచారముచేయుదు నే?

నర్మద—ఇక్కడచూడవే? నీటిలోనద్దిన కాలిగుఱుతులున్నవి. అందు శుభరేఖ లగపడుచున్నవి.

మ. వివరంబారఁగ నీ నిదర్శనముల న్వీక్షింపఁగాఁ దోఁచె నా
కెవఁడో యొక్క మహాత్ముఁ డబ్బురముగా నిచ్చోటి కేతెంచెనా
భార—అవునే వచ్చినవాఁడు నిన్వలచి నేఁడా రాహువో కేతువో
వివరింపంగ నదృశ్యరూపమున నా బేతాళుఁడో సుందరీ!

ఇంకఁజాలును రావే— (నిష్క్రమింతురు).

[వెంటనే ప్రవేశము: నలుఁడు].

నలుఁడు—(స్వగతము) వీరిరువురు దమయంతిసఖులు! వీరిమాటలవలన దమయంతికి నాయం దనురాగమున్నట్లు తెలిసె. ఆహా! ఏమితెలిసి యేమిప్రయోజనము? నాకును దమయంతికిని స్వర్గమర్త్యలోకములకున్నంత దూరము. (పండుకొనియున్న దమయంతింజూచి) ఆహా! ఈ తరుణియేకదా దమయంతి? ఈపటమున వ్రాసినంతకంటె నెక్కువగానున్నదే!

(అనుబంధము-9.)

శా. ఔరా పెన్నెఱివేణిచందమరరే యామోము నందంబు మ
జ్ఝా రే కన్గవసోయగంబు బళిరే చన్దోయి బల్పొంకమ
య్యారే బంగరుమేనిముద్దువగ మే లాహా కళావిభ్రమం
బీరాజాననఁబోలు సుందరులు లేరెందు న్ధరామండలిన్.

దమయంతి—(కొంచెముగాఁ గలువరించును).

నళ—ఈకోకిలవాణి యేమో మాటలాడుచున్నది (కొంచెమూరకుండి) కాదు కలవరించుచున్నది మదనతాపమున నీవనితకు మో మెంతవాడియున్నది కాయమెంత సోలియున్నది.

సీ. వాడియు నిందు కల్వలతేనిఁ గొఱలాడు
నీమోము చెలువ మింకెంతకలదొ
అరమోడ్పుగలిగి యిం తరుదౌ సొబగునించు
నీకన్నుఁగవ యంద మెంతకలదొ



చెలఁగి నిద్దురలోనఁ జిఱునవ్వు మానని
యీపల్వరుస పొంక మెంతకలదొ
మునుఁగున నుండి యింపుగ నిక్కి వెలిఁబాఱు
నీగుబ్బగవ బింక మెంతకలదొ

తే, గీ. కలువరింపులనైనఁ గోయిలలఁ బిల్చు
నీపలుకు మేలిముద్దు లింకెంతకలదొ
సొలసియుఁ గడాని వన్నియ పొలుపుమించు
నీతలిరు మేనిచాయ యింకెంతకలదొ.—

సీ. సొగసు గుల్కెడునారి శుకవాణిఁ బికవాణి
నెలయించు ముద్దుపల్కులమిటారి
బలువన్నియలచామఁ బాకారి కోకారి
వరవర్ణినులఁబోలె వఱలురామఁ
గులుకు ముద్దులబోటి నలమించు నలయించు
బలుమించు నెమ్మేని వలపుజోటిఁ
బొలుపుమీఱు పడంతి వెలలేని వలతేని
చెలి చే చిలుకవోలెఁ జెలఁగునింతిఁ

తే, గీ. జెలుల మేల్బంతి బెళుకు చూపుల పొలంతి
మురిపెముల దొంతిఁ జిన్నారి మరునిదంతి
జిగిబిగువులేమఁ బ్రాయంపు వగలభామ
బాల ముద్దిడ కేనింకఁ దాళఁగలనె.—

(దమయంతియొద్దకుఁబోయి ముద్దాడనుంకించి తిరిగి)

ఆహా! నాకెంతబుద్ధిమాంద్యము! అమరవిభుఁడైన దేవేంద్రుఁడు వరియించి నను దూతఁగాఁ బంపియున్నవాఁడు.

మ. అకటా దేవకిరీటకోటి తనపాదాబ్జంబుల న్బంభర
ప్రకటక్రీడఁ జెలంగ లోకవిభుఁడై భాసిల్లు దేవేంద్రుఁడ
త్యకలంకస్థితిఁ దావరించి నను మాటాడంగఁ బంపంగ నే
వికలప్రజ్ఞత మోహదృష్టుల సతి న్వీక్షింపఁగాఁ జెల్లునే.

దమ—(కదలుచున్నది).

నళ—ఆహా! లేవఁబోవుచున్నది (ప్రక్కన నిలుచును).

దమ—నళసార్వభౌమా!

నళ—(ఆశ్చర్యమున) ఈతరుణి నన్నెట్లు గుఱుతించె? ఇంకను నాశిరసున నదృశ్య ఘుటికయుండ నెట్లు కనుఁగొననగును? "నళసార్వభౌమా" యని నన్నుఁ గలువరించుచున్నదికాఁబోలు. అయ్యో! ఇంకెక్కడినలుఁడు!

దమ—నీవు స్వయంవరమునకుఁ రాఁగలవో, రావో?

నళ—ఇంకెక్కడి స్వయంవరము? వచ్చిన నేమి, రాకున్న నేమి? రాకున్న నెంత ప్రయోజనమో వచ్చి యంతయే ప్రయోజనము. వచ్చినందున నీదూత్యదుఃఖమొక్కటి లభించె.

[పునఃప్రవేశము: (శీఘ్రగమనమున) భారతి, నర్మద.]

భారతి—మరల నేమితెచ్చితివే? చెప్పనైనఁజెప్పక యింతవఱకు నన్నిట్లేల యీడ్చుకొని వచ్చితివి?

నర్మద—ఇంకను దమయంతి నిద్రించుచున్నది. మేలుకొలుపుదునా?

భారతి—ఎంతయుత్సాహమే నీకు? వృత్తాంతమైనఁ జెప్పవు. దమయంతి నేల మేలుకొల్పెదవు?

నర్మద—వచ్చియున్నాఁడు! వచ్చియున్నాఁడు!

భారతి—ఎవఁడు?

నర్మ—నలుఁడు! నలుఁడు!

భారతి—ఎక్కడికి?

నర్మ—ఇక్కడికే!

భారతి—ఎట్లుతెలిసెను?

నర్మద—నేఁ జూచితిని.

నళ—(స్వ) తిరస్కరణీ! నీప్రభావమేమయినఁ దక్కువాయెనా?

(ఇంకను బ్రక్కకొదుగును).

నర్మద—ఎట్లున్నాఁడు! ఎంత యందముగలవాఁడు!

భారతి—ఇంతవఱకుఁ బుఱ్ఱలేరుచుంటివే. నీవట్లుపోయి కొన్నిక్షణములైనఁ గాలేదు. నలు నెందుఁజూచితివి?

నర[illegible]దలేదుగాని వానిసారథిని రథమును జూచితిని.

భారతి—(నవ్వి) వానినైన నెక్కడఁజూచితివి?

నర్మద—ఆ విడిదియింటియొద్దను జూచినట్టు మన యాశ్వికులు చెప్పిరి.

భారతి—సరిపోయె. ఆచెప్పినమాటకే నలునియందమును వర్ణింపసాగితివా!

నర్మద—అదియు వారు చెప్పినమాటయే.

భారతి—దమయంతి నేల మేలుకొలుప నెంచితివి?



నర్మద—ఈవృత్తాంతము చెప్పుటకే.

భారతి—మేలుకనినపినప వచింపరాదో? నన్నేల యిట్లీడ్చుకొనివచ్చితివి?

నర్మద—అటుకాదు. ఈముద్దుబాలకింతాయాసముఁ గలిగించిన నలునియొద్దకు నీవును నేనును బోయి వానిబుగ్గలు పులిమి యిక్కడి కీడ్చుకొనివచ్చుటకు దమయంతి యనుజ్ఞవేడ నిన్నుదోడ్తెచ్చితిని.

నళ—(చిఱునవ్వునవ్వును).

భారతి—నిక్కముగా నేనన్నట్లు నేఁడు నిన్ను జేతాళుఁడేపట్టియున్నాఁడు. నలునికిఁ జేయ నెంచినపని నీకే కాఁదగియున్నది. (అని బుగ్గలుపులుముచు నీడ్చుకొనిపోవును).

దమ—(భయమునలేచి) (స్వ) ఆహా! నాకేమి కలయా! లేక నిక్కముగా నామనోవల్లభుం జూచితినా!

నళ—(స్వ) మేలుకాంచె, ఇదేసమయము. (అని తలనున్నఘుటిక చేతంధరించి దమయంతియొద్దకుఁబోయి) మానవతీమణీ!

దమ—(వితాకుచెందును).

నళ—జిచ్చపడకుము.

దమ—మీ రెవ్వరు?

నళ—నేను దేవదూతను.

దమ—పూర్ణరక్షణమున వెలసియున్న యీశుద్ధాంతమున కెట్లువచ్చితివి?

నళ.—దేవతలిచ్చిన యదృశ్యఘుటికాప్రభావమున వచ్చితిని.

దమ—ఎందునకై యిక్కడికి నీరాక?

నళ—ఆదేవతలగు నింద్రాగ్నియమవరుణులు నీకీ మందారకుసుమమాలఁ బంపియున్నారు.

దమ—ఏటికి?

(అనుబంధము-10.)

సీ స మా లి క.

నళ— మందేభగామిని బృందారకులు నిన్ను
వాంఛించి యిచటికి వచ్చినారు
వారిలో నొక్కరి వరియించుటకు విన్న
పంబొనర్పఁగ నన్ను బంపినారు

దమ— ఎందైనఁగలదె యీ మందెమేలములీల
నరసతి వరియింప సురలకగున
యరుదయ్యె వారల తరుణులలో నెవ్వ
రినిబోలఁగల విచారింపవలదె



నళ— మందేమేలముగాదు మఱికల్లగాదు బృం
దారకుల్నిను మనసారఁగోరి
"యాశించెదము నీ కటాక్షవైభవ మబ్బు
భాగ్య" మంచును ముట్టఁబల్కిరబల

దమ— అకటకటా యిట్టి యాగడ మీ యుర్వి
వెలయునే యిది యెట్టివింత వారు
సకలజ్ఞు లగుదు రే నొకటియు నెఱుఁగని
దాన వారలకేను దగుదునొక్కొ

నళ— నీయాన వచియింతు నెమ్మి నమ్ముము చాన
యెంతటి భాగ్యమో యింతినీకు
సురనాథు వరియింపఁ జరణదాసులుగారె
సురలెల్ల నీకు భాసురలతాంగి

దమ— అనఘాత్మ లెట్టులాడినఁగాని సరివచ్చు
వారన్న మాత్రనే తారతమ్య
భంగి యోచింప కుప్పాంగి వారి వరింపఁ
గోరుదు నే నేర నేరనమ్మ

నళ— చంద్రబింబానన యింద్రునంతటివానిఁ
బరికింప కిటులాడఁ బాడి యగునె

దమ— ఇంద్రుఁడకాని మ్ముపేంద్రుఁడకానిమ్మ
మ్రొక్కుదాన మఱింత మ్రొక్కుదాన

నళ— హితముగా దిటులాడ నింద్రాగ్ని యమవరు
ణుల సురరాజ్యమాన్యం డొకండు
ఒకఁడు యజ్ఞాధీశుఁ డొకఁడు జీవప్రభుం
డొకఁడు జీవనవిభుం డువిదకంటె

దమ— తే, గీ. వలప దింద్రాగ్ని యమవరుణుల నుతింప
మానవేంద్రుండు పరమ తేజోనలుండు
వైరిసమవర్తి నాదు జీవనవిభుండు
గలఁడొకఁ డతనిఁగాక యన్యులఁ దలంప.



నళ— అతివా ! సర్వదిక్పాలురకు నాయకుఁడగువాఁడు ధరాధరభేదనచణవజ్రాయుధ ధారి యగువాఁడు—

దమ— అకటా ! నీ ప్రశంసమానవుగదా ? సేసేల దాఁపవలయు ? నీకొకయర్థము చెప్పె దనుగ్రహింపుము. సిద్ధకీర్తిజగత్ప్రసిద్ధకీర్తి నళచక్రవర్తింగాని యన్యుల నేవరింపఁ జాలనని వారితో వచింపుము ?

నళ— (స్వ) ఏమిచేయుదునింక ? (ప్రకాశము) అలివేణీ ! ఆ నళచక్రవర్తియే నిన్ను దేవతల వరింపుమన్న నేమిచేసెదవు ?

దమ— ఆమహారాజట్లేలచెప్పును ? తనకుఁగాఁబట్టుకున్న మానేగాక యితరులవరింపు మనుట కతనికేమావశ్యకము ?

నళ— (స్వ) ఆహా ! ఎంతదాఁచుదు ! (ప్ర) అందునకుఁగాదు. ఒకవేళ నతఁడువచ్చి యట్లుచెప్పిన నెట్లనియెడిగద.

దమ—

మ. సురసందేశహరా యిదే సరసమా శుద్ధాంతకాంతాళితో
ధర నా దైవముగాఁగఁ గొల్చు నలభూదారుండు నీవన్న య
ట్లురలం ద్రోచినఁ గూపము ల్గలుగవే యొక్కింత త్రాడుండదే
గరళంబుం గఱ వయ్యెనే యకట ఖడ్గం బైనఁ జేఁజిక్కదే.

అతఁ డంతనిర్దయుఁడా ? అంతపాప మతఁడేల యొడిఁగట్టుకొనును ?

నళ— (స్వ) ఇంకెంత తాళగలను ? (ప్ర)

మ. అతివా దాఁపఁగనేల నిన్వలచి నీ కత్యంతసంతాపదు
స్థ్సితిఁ జేకూఱిచి మీఱరాని సురసందేశంబున న్నేఁడు ని
న్వతలం బెట్టఁగ నేగుదెంచిన మహా నిర్భాగ్యుఁడా పాపుఁడా
హితదూరుం డవివేకి యా నలుఁడు వీఁడేసుమ్ము బింబాధరా.

దమ— (భయము నాశ్చర్యమును లజ్జయు నభినయించి)

(స్వ) ఆహా ! నేనూహించినట్లేయయినది. ఈపటమునందలి రూపముఁజూచియుం డియుఁ జక్కఁగ గుఱుతింపనేరనైతినే ! (అని లోపలికి నిష్క్రమించును.)

నళ— తరుణీ ! ఈ దేవకార్యమునకుఁ దుదకు నాకేమి ప్రత్యుత్తరమిచ్చెదవు ?
(లోపలధ్వని) "నర్మదా ! ఎంతసేపే" అని.

సఖులు వచ్చుచున్నట్లున్నది. నేనింకఁ బోవలయు నేనేమిచేయుదు ? ఈ దమయంతి యిచ్చిన ప్రత్యుత్తరమే దేవవిభులకుఁ దెలియఁజేయుదుఁగాక - (నిష్క్రమించును).

## పఞ్చమరంగము - స్వయంవరగృహము.

[ప్రవేశము : (ఉచితాసనములపై) భీమరాజు, మంత్రి, నలుఁడు, వార్ష్ణేయుఁడు, ఇంద్రుఁడు, అగ్ని, యముఁడు, వరుణుఁడు, (నలువురు నలరూపములు) శూరమాలి, జయసేనుఁడు, పుష్కరుఁడు, దేవలుఁడు, ప్రతివింధుఁడు, సుదేవుఁడు].

భీమ—మంత్రీ! రాజులందఱు వచ్చియున్నారుగదా? ఇంక నాలస్యమేల?

మంత్రి—స్వయంవరసన్నాహములన్నియు సిద్ధములైనవి.

సుదేవ—వచ్చినరాజుల నెల్ల దమయంతికెఱింగించుట కెవ్వరేర్పడియున్నారు?

మంత్రి—దమయంతి చెలికత్తియయగు భారతి యాకార్యమునకేర్పడియె. ఇదిగో దమనుఁడును, దమయంతియు, భారతియు వచ్చిరి.

[ప్రవేశము : దమయంతి, దమనుఁడు, భారతి].

సుదేవ—సుమంగలీరియం వధూరిమాం సమేతపశ్యత ... ... ...

భీమ—(లేచి దమయంతియొద్దకుఁబోవుచు)

ఉ. నా రతనంపు బొమ్మ లలనామణి నా దమయంతి రావె—
(కౌఁగిలించి శిరమునూర్కొని) నా
భారముఁ దీర్ప నీ ధరణిపాలురలో మది మెచ్చినట్టి యా
భూరమణు వ్వరించి తగఁ బుట్టినయింటికి మెట్టినింటికిన్
భూరియశంబు చేకుఱఁగఁ బూజ్యవతీ మహిమంబు వెంపవే.

(అనుబంధము- 11.)

దమయంతీ? ఈరాజులనందఱిని వేర్వేఱుగా నీభారతి వర్ణింపఁగలదు. నీయిచ్చ వచ్చిన వారివరించి యీకుసుమమాల కంఠసీమ నునుపుము. (మాలయిచ్చును.)
దమనా! దమయంతితోఁ బూజ యొనరింపించితివా?

దమన—అయినది.

సుదేవ—లగ్నమువేళ యాసన్నమయ్యె. ఇంకేటికిఁదడవు?

భారతి—(దమయంతిం జెట్టపట్టుకొని)

(అనుబంధము-12.)

క. ఱవ్వని యిటె వర్ణించెద
నివ్వసుధేశ్వరుల నీకు నిష్టుం డెవఁడో
యవ్విభుని కంఠసీమన్
బువ్వులహారంబునెత్తి పొల్పుగ నిడుమా.

ముంగటికిరమ్ము. ఇదే యీధరాధిపుఁ జూడుము?



(అనుబంధము-12. A.)

ఉత్సాహవృత్తము.

మానసీయ భూపవంద్య మాళవాధినాథునిన్
శ్రీనితాంతు ననఘుని జయసేను నిందుఁ గంటివే
యీ నరేశమాళిఁ గోరితేని రాజవంద్యవై
జానుమీఱు సుఖమునొంది సంతసిలుదు మానినీ!

దమ—(లజ్జావనతముఖియై యూరకుండును.)

భారతి—అయిన నిందురమ్ము.

(అనుబంధము-12. B.)

భుజంగప్రయాతవృత్తము.

అమందప్రభు న్గుంతలాధీశుని న్శూ
రమాలిం గనుంగొంటె రాజాననా యీ
క్షమాధీశమాళిం దగంగోరితేనిన్
బ్రమోదంబు సత్కీర్తి భాగ్యంబు గల్గున్.

దమ—(ఊరకుండును).

భారతి—అట్లయిన నిటురమ్ము.

(అనుబంధము-12. C.)

మానినీవృత్తము.

సారసలోచన సింధుధరాధిపు శశ్వదనూనచరిత్రు జగ
ద్వీరుని ధీరవిచారుని నీ ప్రతివింధకుమారుఁ గనుంగొనుమీ
చారుశరీరు వరింపఁగఁ గల్గెడు సర్వసుఖంబు లుదారగతిన్
మారుతవేగతురంగము లబ్బెడు మత్తగజంబుల సంపదలున్.

దమ—(ముందువైపునఁ జూచును).

భారతి—ఇయ్యెడఁ జూడుము?

(అనుబంధము-12. D.)

పృథ్వీవృత్తము.

కరీంద్రనిభగామినీ కనుమితండు కందర్పసుం
దరుండు విదిశాపురీధవుఁడు భూరిసారుండు పు

ష్కారుం డనఁ బ్రసిద్ధుఁ డౌ జగతినోపి నీ వివిభుఁ
వరించిన సమస్తసంపదలఁబొల్తు వబ్జాననా.—

దమ—(మాఱుముఖము వెట్టును).

భారతి—అయిన నీరాజవరుం జూడుము. (అని యింద్రు నిజూపి)

(అనుబంధము-12. E.)

మత్తకోకిల.

విక్రమక్రమ చక్రబాంధవు వీరసేన కుమారుని
ర్వక్రసత్యయశోవిరాజితుఁ బాలితాఖిలధారుణీ
చక్రు నాశ్రితపారిజాతుని జారురూపజితాంగజుఁ
శక్రసన్నిభు నిప్పుడీ నలచక్రవర్తిని జూచితే.

దమ—(లజ్జచే మెల్లఁగఁ బూలహారము నెత్తుచున్నది).

భారతి—(దమయంతి యెత్తినహారము నట్లే తనచేతనిలిపి)

(అనుబంధము-12. F.)

తరల. అతివ తాళుమితండు కాఁడతఁడు-అతఁడుఁ మఱి కాఁడితం
డు-ఇతఁడు కాడతఁడు-అతఁడుండునో యీతఁడో-పరికింప న
ద్భుతము సంధిలె నేవురున్నలభూమిపాలవరేణ్యు నా
కృతులనుండఁగ నెవ్వరి న్వివరింతు నింకఁ దలోదరీ.

దమ—(స్వ) ఇది దిక్పాలుర మాయకాని యితరముకాదు. (ప్ర) దిక్పాలవరులారా! ఇంద్రాగ్ని యమ వరుణులారా! మీరిటు నిగ్రహ మొనర్ప నే నెంతటిదానను!

తే,గీ. ఆర్తనై మ్రొక్కి వేడెద నధికభక్తి
నలఘుకరుణ నాప్రార్థన మాదరించి
రాజసురభూజు మా నళరాజుఁ జూపి
నన్ను రక్షింపుఁడో సురనాథులార.

(నమస్కరించును.)

నళుఁడు—(లేచి)

ఉ. నాకనివాసులై తనరి నవ్యమహోమహిమాద్భుతాంచితా
నేకవిలాసము ల్వెలయ నింపువహింపుచుఁ గామచారులై
ప్రాకటధర్మరీతి బహుళభంగుల లోకములెల్లఁ బ్రోచు నో
శ్రీకరులార భవ్యసురశేఖరులార యనుగ్రహింపరే.—



ఇంద్ర—(లేచి)

కం. ఈవిధము మీకుఁ దగునే
పావనదిగధీశులార పరికించి యిఁకన్
మీవిగ్రహములఁ దాలిచి
యీ వనిత న్నాకుఁ గూర్పుఁ డేఁ బ్రార్థింతున్.—

అగ్ని—(లేచి)

కం. నలుఁడను నే నిందుండఁగ
సులభత నను మఱుఁగుపఱచి సురవరులారా
బలుపింతలాడనేటికి
లలి వేఁడెదఁ గూర్పరాదె లలన న్నన్నున్.—

యమ—(లేచి)

కం. ఇది మంచి వినోదముగా
నొదవె న్నిక్కంపు నలుని నూరక నాకుం
గదిరించిరి సురనాథులు
మృదుపదములఁ బిచ్చితనము నేమనవలయున్.—

వరుణ—(లేచి)

కం. "ఏనళుఁడ నేనళుఁడ" నని
యీ నిర్జరవరులు తామె యిటువాదులిడన్
నానళత యెవ్వఁడొప్పం
బూని యెవరితోడ నింక మొఱయిడుదువాఁడన్.—

అందఱు—(ఆశ్చర్యము నభినయించి) ఏమీ వేడుక?

దమ—అయ్యో! ఇఁక నే నేమిచేయుదును. దిక్పాలురకు నాపైఁ గరుణగలుగదాయె. పూర్ణపరీక్షచేయసాగిరి. నా కింకెవ్వరు శరణము. నే ననవరతము పూజించుచుండిన బ్రాహ్మీసరస్వతియే దిక్కు. హా వాణీ! కమలాసనమనోహారిణీ! రక్షింపుము.

(అనుబంధము-13.)

శా. ఏణాంకోపమ గౌరవిగ్రహకళా హేరాళసంతృప్త గీ
ర్వాణీ వేదరహస్యవ్యాప్తకమణీ రమ్యప్రభావల్లకీ
పాణీ భక్తసుధీప్రదాయని సితాబ్జాతప్రపీఠాంచితా
వాణీ కంజజురాణి నన్నుఁ గరుణ న్పాలింపు భాషాపతీ.

సరస్వతీ! నేను నిన్నెల్లప్పుడు నమ్మి భజించుదాన ననుట నిజమయ్యెనా, నలుఁడే నా జీవితేశుఁడని నిశ్చయమానసమున నుండుటదే నిజమయ్యెనా! నా మనోనాథు నేరు పఱచి నాకుం జూర్పుము. లేదేని నీ యాన నేఁ బ్రాయోపవేశ మొనర్చి యసువుల—

ఇంద్ర—(నలునిబట్టి ముందటికిఁ దెచ్చి)

మ. ఇదె నీమెచ్చిన సార్వభౌముఁడు నలుం డీతండెనూ సోదరీ

అగ్ని— కుదురా నీదగు శుద్ధమానసము మాకు న్మెప్పు వుట్టించెఁ గా

యమ—మది రంజిల్లఁగఁ బెండ్లియాడుమిఁక భామా నీ మనోనాథునిఁ

వరుణ—త్రిదశాధీశుల మేమొనర్చెదము నాందీవాదసందోహముల్.

దమ—(దేవతలకు నమస్కరించి నలుని మెడఁ బూలహారము వేయును).

సుదేవ—" దేవీంవాచమజనయంతదేవాః .................................."

(అనుబంధము-14.)

దేవలుఁడు—(పుష్కరునిచెవిలో నేమో చెప్పును).

పుష్కరుఁడు—ఇప్పుడువలదు కొంచెము తడయుము. ఈదేవనాథులు పోవనిమ్ము.

(యవనిక దిగజారును).



శ్రీ

# చిత్రనళీయనాటకము.

## ద్వితీయాంకము.



ప్రథమరంగము-బయలుస్థలము.



[ప్రవేశము: కామదేవుఁడు]

కామదేవుఁడు—

(అనుబంధము-15.)

సీ. అనవరతానంద ధనలాలసానేక
నరవారసిద్ధాంజనంబు చెలువ
మోక్షుస్పృహామయ మూర్ఛితజనబృంద
సురుచిరసంజీవకరణితరుణి
స్వర్గప్రమోదవాంఛాభూతసంచయో
చ్చాటన మంత్రరాజంబులలన
యైహికసుఖపయఃప్రాపూరితాపీన
మానితనిర్జరధేనువబల

ఆ,వె. ఇట్టివాంఛితముల నిచ్చుకామినులుండ
వేదమేల శాస్త్రవాదమేల
యుసుతపంబులేల గురుఁడేల హరుఁడేల
పూజలేల వట్టిరోజలేల.—

బళిరే! లోకసమూహమునంతయు స్వాధీనమందుంచుకొని బొమ్మలాటలవలె నాడించు ఘనుండు నాకంటె నితరుఁ డెవఁడు! విరహిజనమానసములందలి ధైర్యసాలము నగలించు పిరంగిగుండుగదా నా కుసుమబాణము? నా సాక్షాత్కారముగలిగె నా వైరాగ్య మహిమమూనిన యెట్టి యోగులును గాముకులు కాకుందురా? లోక మోహానమణీహరాపాంగకామినీనిస్తుల స్తనయుగళమధ్య సింహాసనమునఁ బట్టాభిషిక్తుఁ డనైయున్న నన్ను—కామదేవుని—కాంచి "కాసో౽హం" మననిధీరుఁ డెవ్వఁడు?

ఇంతతెలియక కలిరాజు తనపరివారములో మొదటివానిఁగా నన్నెంచుచున్నాఁడా! (ప్రక్కననిలుచును).

[ప్రవేశము : క్రోధదేవుఁడు.]

క్రోధ—

(అనుబంధము-16.)

మహాస్రగ్ధర.

ప్రథనోద్యచ్చాపలభాస్వత్ప్రచురతరమహాభంగురప్రోథఖాహా
మధువిద్విడ్భూరిబాణాముఖహరవాలతభుజ్ఞాన్యఫాలాంబకాభ
ద్రధరోద్యద్ధర్మగరోద్వృద్ధతయమదమనాధ్వస్తధాత్రుత్తమాంగా
బధిరీభూతాష్టకాష్ఠాభయదధమధమాభ్యాసధక్కావిలాసా.

ఆహా ! నిర్ఘోషభీషణమై యాక్రోశకఠోరమై రూక్షేక్షణతీక్ష్ణమైన నాముఖము వీక్షించినమాత్రమున భీతిఁజెందని ప్రాణియెవఁడు ? పృథులపదఘట్టననిష్ఠురదంత ఘర్షణ దీర్ఘాట్టహాస వక్రభ్రూభంగ ఘోరమైన నాయాకార మెవ్వరికి భయంకరము గాదు ? భువనంబుల క్షణమాత్రమున నిర్జింతునని కామదేవుని యభిమానము. నేనుండకున్న వాఁడేమిచేయఁగలఁడు! నాప్రపంచమే యుండదని యెంచు మోహము నందు సహితము ప్రణయాయోధనావతారమెత్తి నేనుండఁగనేకదా యది రుచించును ? ప్రళయకాలమధ్యందినమార్తాండతీవ్రాతపములోఁగూడిన దావదహనునిఁ బోలె మండిపడుచుండు నాకింక నితరస్థలములు దుర్గమములా ? కలిరాజు శరీరము నందంతయు నిండియుండెడు ధీరుఁడీక్రోధదేవుఁడేకదా ? (ప్రక్కన నిల్చును).

[ప్రవేశము : లోభదేవుఁడు (ధనముమూటచేపట్టి)].

(అనుబంధము-17.)

లోభ— కం. ఈధనమే యీధనమే
యీ ధనమే మఱియుమఱియు నీధనమెనుఁడీ
సాధన మిహపరములకున్
గాధల నితరముల నమ్మఁగాఁ దగదెందున్.

కం. దుర్మతులొకకొంద ఱిలన్
ధర్మాత్మత విఱ్ఱవీగెదరు వారల దు
ష్కర్మముగద ధననాశము
ధర్మము నను మోదమొందఁ దవదని చెవుఁడీ.

కం. భోగులు ధనికుల దూఱుచుఁ
త్యాగములేదందు రీర్ష్యఁ దమ దుర్విధతన్



ద్రోహము సేయఁగఁజాలరు
త్యాగికి యాచకునకెందు ధనము నిలుచునే.

కం. నిద్రకు సెలవీవలయున్
భద్రముగాఁ బాతిపెట్టవలయు ధనమున్
రుద్రుఁడు వేఁడిననైనన్
క్షుద్రము దానంబొనర్పు జోలియదేలా. —

అయ్యో ! ధనము ! ధనము ! ధనమే ప్రాణము ! ప్రాణమే ధనము ! ప్రాణముపోయినను ధనము పోవచ్చునా ? ఈజనులెంత యవివేకులు ! మంచిమంచి పిండివంటలఁట! మృష్టాన్నభోజనమఁట ! చేసినభోజనముల్లేయుండునా? ఇంక జరతారుదోవతులఁట ! పట్టుదుకూలములఁట ! ఏటికో? అవి గాలికి వానకు నాఁపునా? అగ్నితగిలినఁగాలవా?

"కం. అంగీలు పచ్చడంబులు
సంగతిగా శాలుజోళ్లు సరిగంచుల మే
ల్రంగుల దుప్పటులన్నియు
గొంగడి సరిపోలవన్న గువ్వలచెన్నా."

అనుమాటయబద్ధమా ? పొట్టకుబట్టకుఁ బెట్టినధన మెట్టువచ్చును ? వడ్డియెట్లువచ్చును ? వడ్డి ప్రాణమునకుఁ బ్రాణమే.

(దూరమునఁజూచి) ఆహా ! ఎవరో దొంగలు వచ్చునట్లున్నది. ఊఁహూఁ— పాతాళమువఱకు గుంతచేసియయినఁ బూడ్చెదఁగాని యితరులకీధనమునిత్తునా ! ఎవరులేరే. ఊరక భయపడితిని. నిద్రలేమి నాకండ్లుచెడి యిట్లుకనుపించుచున్నది. ఎప్పటికిని బగలేయుండనివ్వక రాత్రియని యొకదాని సృజించిన బ్రహ్మకొంప యెంతకాల్చినను దీఱదుగదా !

అయ్యో ! వీరెవ్వరో యాచకులు వచ్చునట్లున్నది. ఇంకఁ బరుగెత్తిపోయెదను.

(ప్రక్కకుఁ బఱువెత్తును).

[ప్రవేశము : కలి (అలంకృతుఁడై)].

(అనుబంధము-18)

రాజహంసవృత్తము.

కలి—† అక్షుద్రకాక్షేయ కాక్షీణ రూక్షేక్షణా
ధ్యక్షత స్ఫారదీక్షజ్జనానీకమున్
బ్రతూంతి దీర్పంగ రుద్రుండొకో వీర
భద్రుండొకో యంచు నన్నెందు వీక్షింపరే

† పంచవింశచ్ఛందమునఁబుట్టినది, రతగణములు, తొక్కగురువు, ౧౩-డింట యతి,

ధీక్షోభఁ గల్గింప శ్రీకాంతుఁడు న్భార
తీకాంతుఁడు న్పార్వతీకాంతుఁడుఁ జైతురే
దక్షత్వము న్జూప జంభారియే శుష్క
దంభోళియై ముక్తకుంభీంద్రుఁడై పారఁడే.

ఔరా! దైవమనఁగ నాకంటె వేఱు దైవమా? లోకసమూహము నావలె శాసించువాఁడెవఁడే? బ్రహ్మ జగమును సృష్టిచేయునఁట! నా ముఖ్యమంత్రులు కామమోహములు లేకున్న వానిచే నేమగును! ఇంక నీశ్వరుండు సంహరించునఁట! క్రోధమాత్సర్యము లనెడు మావారు లేక యున్నప్పుడుగదా వానిపని తెలియవచ్చును? విష్ణువుస్థితిభూతుఁడఁట! మదలోభములు నాసచివులు లేకున్న వానిస్థితి యెందునకు? బుద్ధిలేనిజనులు నన్నుఁగాదని వారినగ్గింతురు.

నేనొకచోట నుండువాఁడఁగాను. అయినను నా ముఖ్యస్థలముల నేమానను. ఎక్కడ నెక్కడ స్త్రీజనముండునో యక్కడఁ గామమోహములనెడు నామిత్రులతోఁ దలయూఁచుకొనుచుందును. ఎందెందుఁ జూదమాడెదరో యందు లోభమాత్సర్యములను నాహితులతోఁ బ్రత్యక్షముగానుందును. ఎచటనెచట సురాపానములుండునో యచట మదక్రోధములనెడు నాప్రియులతోఁ దాండవమాడుచుందును. నేను లోకమేలుకాలమున దేవపూజలు, దానధర్మములు, భక్త్యాచారములు ననుతుచ్ఛభూతము లుండునా? ఇంకను, ఈజనులకు యోగమార్గము, ధర్మవృత్తము, తపోనిష్ఠయు వలయునఁట! యోగమార్గమునకు మాకామదేవుని బంపినఁజాలు. ధర్మవృత్తమునకు మాలోభ దేవుఁడే దైవము. తపోనిష్ఠకు మా క్రోధదేవుఁడే సాక్షి.

కామక్రోధలోభులు—(ముందరికివచ్చి) జగన్మండలచండశాసనోద్దండా! కలి మహారాజా! నమస్కారములు.

కలి—ఆహా! కామక్రోధలోభదేవులారా! కల్యాణమగుఁగాక. భూలోకమున నిప్పుడు జరుగఁగల దమయంతీ స్వయంవరమునకుఁబోవుడు మిమ్మువెంట రాఁజెప్పనంపితి.

(లోపల ధ్వని)

కామ—ఎక్కడిది యీధ్వని? (పైవంకఁజూచి) ఇది విమానధ్వని. ఓహో! దేవేంద్రుఁడు మొదలగువా రెక్కడికో పోవుచున్నారు.

కలి—(చూచి) దిక్పాలులారా! మీకుఁ గుశలమా?

[ప్రవేశము: దిక్పాలుఁడు].

దిక్పాల—కలిరాజా! నీకుం గుశలమా.

కలి—ఇట్టి పరివారములుండఁగా నాకుశలమున కేమితక్కువ? మీరెక్కడికిఁబోయెదరు?

దిక్పాల—నీప్రయాణమెక్కడికి?

కలి—విదర్భపురికి!



దిక్పాల—ఏటికి?

కలి—ఇప్పుడక్కడ దమయంతీస్వయంవరము నెగడియున్నదఁట. నే వరింపఁబోయెదను.

దిక్పాల—హా-హ్హా-హ్హా-హ్హా.

కలి—ఏల యిట్లునవ్వెదవు!

దిక్పాల—మేము పోయియుండి మాకైనది. ఇంక నీవుకాని త్రిప్పఁజాలవు.

కలి—మీ కేమయినది?

దిక్పాల—అందు దేవేంద్రుఁడున్నాఁడురమ్ము. ఆకథనంతయుఁ జెప్పఁగలఁడు.

(కలితో నిష్క్రమింతురు).

కామ—క్రోధలోభదేవులారా! చూచితిరా నా సామర్థ్యము? మనరాజాసయితము దమయంతిపై—ఆఁ—

క్రోధ—నీప్రతిష్ఠయేమి? ఆదమయంతి మనరాజునకుఁజిక్కకపోవనీ. అప్పుడు నేను-ఊఁ—

కామ—చిక్కనీ చిక్కకుండనీ. నేనుండవలయుఁగాక నీ వేమిచేయఁగలవు? ఇది పనికిరాని పౌరుషప్రయము.

లోభ—అయ్యో! అయ్యో! కామక్రోధదేవులారా! వ్రయమన్నమాటనాచెవిని వేసెదరే.

కామ—లోభదేవా! మాటలువ్రయమన్న నీకేమిపోయెను? అందున నవి మామాటలు.

లోభ—మాటలువ్రయమో మూటలువ్రయమో? శివశివ! నేవ్రయమొనర్పుటయెప్పటికి ఊఁహూఁ—ఇతరులువ్రయముచేయుట నేఁజూచియోర్చి ప్రాణములబిగఁ బట్టఁగలనా?

[పునః ప్రవేశము: కలి (ఆగ్రహమున)].

కలి—కామలోభదేవులారా! మీకు సెలవిచ్చియున్నాఁడ. క్రోధమా! నీవు నావెనువెంట వచ్చుట కాయితమైరమ్ము. నేనొకపనిఁ గల్పించుకొంటిని.

క్రోధ—భాగ్యము (అని మిగిలినవారిఁజూచి మీసలుదువ్వుచు కామలోభులతో నిష్క్రమించును).

కలి—ఆహా! ఈదేవేంద్రాదు లెంతటిదుర్బలురు! దేవలోకమునుండి తా మభిలాషమున వచ్చి వరించినకాంత యొండొరుని వరించినదిచూచి నెత్తిపై గుడ్డవేసికొని వెనుకకు వచ్చినారే వీరికంటెఁ బుష్కరుఁడేమేలు. స్వయంవరమయినపిదప నలునితోయుద్ధ మాడెనఁట ఓడిపోయెనఁట. ఓడిననేమి? జయాపజయము లోకరిస్వాధీనములా? ఈ పిచ్చిదేవతలో తాము హారతిచేయించుకొన్నదిచాలక నలునికి వరములిచ్చివచ్చిరఁట. కానీ! ఆనలుఁడింకబ్రదుకనీ! వీరివరములు నా కెట్లడ్డమువచ్చెడినో చూతము.

ద్విపద. నాదు ప్రయత్నంబు నవ్వీరికాదె
యీ దేవతలకింత యెగతాళి తగున
కానికానీ యింకఁ గడఁగి యానలుని
నే నెట్లుచేయుట నేమెఱుంగుదురు

ఈనలరాజున కింత గౌరవమె
తానెందుఁబోయెడు ధరణిపై నింక
శంకింప కేఁగోరు సతినిదాఁగొనియె
నింకనాక్రోధాగ్ని కింధనంబయ్యె
వానిరాజ్యముఁబాపి పరిణతిమాపి
కానలకంపించి కడగండ్లముంచి
కామినీమణిఁబాసి కడకేఁగఁజేసి
భీమరూపముగట్టి పోరుపోఁగొట్టి
హీనసేవకుఁబెట్టి యెఱుకపోఁదట్టి
దీనునిగావించి ధృతిఁబోనడంచి
కడిమిదూలించి దుఃఖములపోలించి
యుడికించి యడఁగింపకున్న నేఁగలినె.

ఐన, నలుఁడు నాకెట్లపకారము చేసినవాఁడు ? (యోచించి) ఇందునకేమివ: ఇట్టియకారణకలహములెన్ని నాకులేవు ! దేవేంద్రునిగాదని దమయంతిని బెండ్లియాడి నకారణమే నాకుఁజాలదా ? ఎట్లును దేవేంద్రునితోఁ బంతములుపలికితిని. ఇఁకఁ దప్పదు. వానికిఁ బుష్కరుఁడను జ్ఞాతియొకఁ డున్నాఁడు. వానియొద్ద దేవలుఁడను నాఁకు దగిన బ్రాహ్మణుఁ డొకఁడున్నాఁడు. ఇఁకఁ గార్యసాధనమునకు యోజనయేల.

(నిష్క్రమించును).

---

## ద్వితీయరంగము-నిషధపురివీధి.

[ప్రవేశము : జాంఘికుఁ డొకఁడు].

జాంఘి—ఇదిగో జనులారా ! చెప్పలేదనెదరు ? వినలేదనెదరు ? ఈదినము మన నల చక్రవర్తికుమారుఁడైన యింద్రసేనుని నాలవసంవత్సరము నిండిన పుట్టినదినము. ఈ చక్రవర్తి పట్టాభిషేకమును, వివాహమును నయిన దినములును నేఁడే. మొన్న మన రాజునకువచ్చిన దుస్స్వప్నదోషము హరించుకొఱకు, పెద్దలు చెప్పినరీతిగా దశ దానములిచ్చుటకు నేఁడే యేర్పాటుచేయఁబడినది. బ్రాహ్మణోత్తములకు గోదాన, భూదాన, హిరణ్యదానాదు లనేకము లివ్వఁబడును. పురజనులందఱు నుత్సవము జరుపవలెను. ఈతీఱున సార్వభౌముని యాజ్ఞయయియున్నది సుండీ !—

(చాటి నిష్క్రమించును).

---



## తృతీయరంగము-నిషధపురి రాజోద్యానము.

[ప్రవేశము: నలుఁడు, దమయంతి].

వృషభగతి రగడ.

నళ— కాంతకాంతలతాంతములువనిఁగాంచఁగాంచరహించెమించుగ
దమ— వంతనంతవసంతుఁడలరఁగ నందమొందవెమదిఁదలంచఁగ
నళ— నారనారద వేణియుష్మదుద్యానయానమునించె మోదము
దమ—కోరఁగోరలభించెఁగాదిది కొంచెమెంచఁగనీవినోదము
నళ—బాలనీలతమాలముఖకలభంగిబొంగిచెలంగెమెచ్చుగ
దమ—కేలనీలలితావనీజము లేకచీఁకటిఁజేయునెచ్చుగ
నళ—నారిభూరిరసాలభూజము నవ్యభవ్యరుచిం జెలంగెడుఁ
దమ—గోరుచారుఫలంబులీతరు కుసుమబలముగ మనకొసంగెడు
నళ—హాళిబాలికయిందుసలిలవిహారమారయ నింపొనర్పదె
దమ—చాలమేలగునిందునీజల జాతజాతముసొంపుగూర్పదె
నళ— నెలఁతయలఁతగలంగఁగానివి నీకరాకలనంబుమించదె
దమ— యలసిసోలసినజాడనిదె రాయంచమించుగ సంచరించదె
నళ— చానయానమునంచలకు నెఱజాణరాణను నేర్పుమింతటఁ
దమ— వీనగానముచే సెనీపిక బృందమందము వెలయునంతటఁ
నళ— గావునీవరవాణికీకల కంఠకంఠరవంబులీడుగఁ
దమ—బోవుతావులకెల్ల వేఱయి పోకకోకములలరెజోడుగఁ
నళ—జాలలీలలనీకుచంబుల చందమొందఁగనివియుఁగోరవె
దమ—చాలుఁజాలును జెల్లనెల్లెడ సరససరసములాడనేరవె.

నళ—అలివేణీ! రమ్యమగు నీలతాభవనమునందింత విశ్రమించి పిదప నీకమలాకరమున విహారమొనర్తము, నీవలసినట్లున్నావు.

దమ—ఆహా! అట్లనేకానిమ్ము. (కూరుచుండును).

నళ—(కూరుచుండి) మఱచితి మనోహారిణీ! నిన్న మఱియు నాకలలోఁ గలిరాజఁట వికారవిగ్రహుఁడువచ్చి నన్ను రాజ్యభ్రష్టుని జేసెదనని బెదరించెను. ఈ పదిదినముల నుండి యిట్టి దుస్స్వప్నములే వచ్చుచున్నవిగదా?

దమ—నాకు నట్లే వచ్చుచున్నవి. అయిన మన మెవ్వరి కేమపకార మొనర్చినారము?

నళ—కాంతామణీ! ఒకవేళ నేను రాజ్యభ్రష్టుఁడ నైన నీ వెందుఁబోయెదవు?

దమ—అయ్యో! ఈమాటలేటికి?

నళ—ఒకవేళ నయినట్లయిన నెట్లని యడిగితిని.

దమ— ఉ. ఆడెద వేల భాషణము లాకులభావముతోడ నాథ యే
కీడును నేలకల్గుఁ బరికింపఁగ నెవ్వరి నెగ్గులాడవే
పాడియువీడ వింతకును బ్రాప్తముదప్పునె యెందునాకు నీ
తోడిదెలోకమై వెలయుఁ దొందరపాటు వహింపనేటికిన్.

నళ—మ. పరితాపంబొదవన్గతంబెఱుఁగఁ దీవ్రభ్రాంతి నిట్లాడెద
న్సరసీజేక్షణ నించె నీపలుకు లానందంబు నాకింక దే
వ్వరము ల్గల్గినఁ గల్గని మ్మనుభవింపం గొంకనింతేని దు
స్తరదుఃఖంబుల నవ్వవాఁడఁగద నీసాన్నిధ్య మింపారఁగన్.

[ప్రవేశము: (దూరమున) వార్ష్ణేయుఁడు (ఇంద్రసేను నెత్తుకొని].

నళ—(ముందిరికివచ్చి) ఇంద్రసేనా! రమ్ము (ఎత్తికొని ముద్దాడి దమయంతియొద్దకుఁదెచ్చి) దమయంతీ! ఎట్టిసంకటము లెట్టిమనఃక్లేశములున్నను బుత్త్రులఁజూచిన నవియన్నియు నంత మొందుఁగదా! సంతతిలేనివారిబ్రదుకేటికి.

సీ. నానాసుఖవ్రాత నక్షత్రసమితిని
దనయుఁడే కుముదబాంధవసముండు
సంసారనామక సరసిలోపల నాత్మ
జాతుఁడే ధర్మకంజాతనిభుఁడు
ఐహికామోద ముక్తాహారమునను గు
మారుఁడే పద్మరాగోరుపదక
మలఘుమనోదుఃఖ జలరాశిఁ దరియింపఁ
బట్టియే ముదము చూపట్టు నావ
ఆ, వె. భవమహాంధకార భానుండు సూనుండు
వితత సర్వకాల హితుఁడు సుతుఁడు
విపదుదయలతాలవిత్రుండు పుత్త్రుండు
ఉడుకులడఁపువుడుకుఁదోడుకుకొడుకు.



నళ—(ముందరికివచ్చి) వార్ష్ణేయా! నీ వేటికివచ్చితివి.

వార్ష్ణే—మహారాజా! ఆస్థానమునందు పుష్కరరాజువచ్చి కాచియున్నాఁడు.

నళ—ఏపుష్కరరాజు?

వార్ష్ణే—దేవర పిన్నతండ్రి కొమారుఁడు.

నళ—వార్ష్ణేయా! ఇప్పుడ వచ్చెదనని వచింపుము.

వార్ష్ణే—(నిష్క్రమించును)..

దమ—ప్రాణేశా! ఇదేమియైయుండును? నాస్వయంవరమున నీతో యుద్ధమాడి యోడిపోయిన వాఁడు రావలయునన్న—ఆహా! నాదక్షిణనేత్రమేటికో యిట్లదరుచున్నది?

నళ—దమయంతీ! వాఁడు నాతమ్ముఁడుగదా? వానికాతిథ్యమీవలయు. నేఁబోయి వత్తును. (నిష్క్రమించును).

దమ—కుమారా! ఇంక మనమావైపునకుఁ బోదమురమ్ము.

(నిష్క్రమించును).

---

## తురీయరంగము: నలునియాస్థానము.

[ప్రవేశము: పుష్కరుఁడు (ధ్వజముతో) దేవలుఁడు, సేవకుఁడు.]

దేవ—సేవకా! మీరాజేమిరాఁడో?

సేవ—అయ్యా! ఇదిగోవిచ్చేసెను.

[ప్రవేశము: నలుఁడు.]

నళ—తమ్ముఁడా! కుశలమా? ఆహా! ఎన్నిదినములకు నిన్నుఁ జూడఁగంటిని (ఆలింగన మొనర్పఁబోవ).

దేవ—(నడుమదూరి) రాజా! మేమువచ్చియుండు కార్యమున కీమంగళాలింగనము సరిపడదు.

నళ—శా. మోదంబారఁగ నాకనుంగయిన తమ్ముం డిందు విచ్చేసెమ
ర్యాదన్మంగళభంగి మాకొదవు ప్రేమాలింగనక్రీడకు
న్నాభ దేవోత్తమ యడ్డమై నిలిచి యన్యుంజేయుదే సోదరున్
దేవల— సౌదర్యం బిపు డింపుగాదు మఱి నీ జ్ఞాతిత్వమే మేలగున్.

నల—సోదరా! ఇదేమి దేవలుఁ డిట్లనుచున్నాఁడు?

పుష్క—దేవలుఁ డెట్లన్న నేమి! నేను గార్యార్థినై వచ్చితి.

నళ—పుష్కరా! అదియేమి కార్యము? ఈధ్వజమేమిటిది?

దేవల—శా. నానాభంగులఁ బెంపుమైఁ గిరీటవిభూషావళీ ద్రవ్య సం
తానంబుల్వారియించి వారియభిమానంబీడ్చు సద్ద్యూత వి
ద్యానైపుణ్యముఁజాటనెత్తిన ధ్వజోత్తంసంబుసు మ్మిద్దె -

పుష్కర— నీ
తో నుల్లాసము జూదమాడుమదినేఁ దోతెంచితి న్సోదరా.-

నళ— చ. కలుషపథక్రమంబుగద గాదిలితమ్ముఁడ యీ దురోదరం
బలవడ నెందుదుర్వ్యసనమాటఁద్యజించెద రార్యులు—

దేవల— అంతయున్
దెలియనునీహితంపుటుపదేశమునూఁకొనరాము జూదమున్
వెలయఁగ నాడుదేని పదివేలహితంబులు మాకుముట్టెడున్.

పుష్క—తే,గీ. ఎనసికూడంగ భీతిగల్గిన "జితోస్మి"
యనుము మాకంతయేచాలు—

నళ— నోర నీవు
చెడుదువని బుద్ధిగఱపంగ నెడదభీతి
యడరెనని యెంతెరమ్ము రమ్మాడరమ్ము.
(నిష్క్రమించును.)

---

## పఞ్చమరంగము-నలునికొలువు ముందరిభాగము.

---

[ప్రవేశము : వార్ష్ణేయుఁడు.]

వార్ష్ణేయుఁడు—అహా! ఎంతటికాలమువచ్చెను! ఈ నలచక్రవర్తికిట్టిమూర్ఖత దగునా అహోరాత్రములు విడునక జూదమాడి యోడుచున్నాఁడే.

(అనుబంధము-19.)

చ. అమలమనీషఁ బాసి యభియాతియమర్చిన యట్టిమాయ జూ
దమునకుఁ జిక్కి కీడు తనుఁదార్కొనుటారయలేక ధారుణీ
రమణుఁడు మానసంబునఁ దిరంబగు నీసుజనింప మిత్రవా
క్యముల నుపేక్షచేసి యకటా తలపోయఁడెకష్టకాలమున్.



ఉ. పోతెఁ దురంగవారణ వసుప్రకరంబుల నోడె రాజ్యమున్
గోలుపడె న్విభూషలను గోశధనంబులనీగె నంతకున్
జాలమికిం గిరీటకవచంబుల నోటుపడె న్దలంపఁ డీ
లీల నొకింతయు న్రిపుమలీమసవృత్తము మానసంబునన్.

దుర్మార్గుఁడగు దేవలుని యుపదేశమున నతిదుష్టుఁడగు నీ పుష్కరుఁడాడు మాయ జూదమున నోడినకొలఁది రోషమెక్కువకాఁగా నెంతయోడినను మానకున్నాఁడే ఈద్రోహి పుష్కరుఁ డింక మారాజును రాజ్యమున నుండనిచ్చునా? అతఁడు లేకున్న మాగతియేమి! హా! దైవమా! (నిష్క్రమించును.)

---

## షష్ఠరంగము-ద్యూతగృహము.

---

[ప్రవేశము : నలుఁడు (విగతభూషణుఁడై)].

పుష్కరుఁడు, దేవలుఁడు (పాచికలుముందుంచుకొని).

దేవల—మ. భళిభళి పుష్కరేశ రిపుభంజనసార యశఃప్రకాశ సం
ధిలనభయంబు జూదమున నిన్ను జయించెడు ధీరుఁడుండునే

(నలునిపైఁ జూచి.)

తొలుతనె యాడఁజాలనని తుండమువంచి వంచించియున్ననీ
యలమట కల్గనేరదుగదా పరికింపఁగ నీకు నో నళా.—

పుష్క—అన్నియు నాయెఁగదా? ఇంకనొడ్డుటకేమైన నున్నదా?

నళ—పుష్కరా! ఇంక నేమున్నది?

దేవ—రాజా! హా! ఏమిది! తెలివితప్పి "రాజా" యని పిలుచుచున్నాను—నళా! మఱియు నొడ్డవలెనన్నఁ బదార్థములేకయున్నదా?

నళ—సామ్రాజ్యమునంతయు నోడినదిచాలక నాకవచకిరీటాదులను నోడితినే - ఇంకే మున్నది?

దేవ—కొంచె మాలోచించుకొనుము.

నళ—దేవలా! ఏల నన్ను నొప్పించెదవు?

దేవ—నేనుఁ జెప్పుదునా?

నళ—ఏదీ?

దేవ—ఉండలేదా నీ—దమయంతి?

నళ—(కోపమున) ఓరి మాతృద్రోహీ! దురాత్మా!

ఉ. ఓరి మహోగ్రకల్మషుఁడ యోరి దురాత్ముఁడ యోరి ద్రోహి యో
రీ ఋజుమార్గసద్గతివిహీనుఁడ యెంతటి మాటలాడితి
వారిఁ దలంప నీదు వితథంబగు బ్రాహ్మణనామ మొక్కటే
కారణమయ్యె నిన్ను గడికండలుగా నొనరింపకుంటకున్.

దేవ—

ఉ. చాలునుజాలు మాయమికఁ జయ్యన నీదగు నోరు మానుమీ
కూళతనంబు జూదమునఁ గోల్పడినంతటినుండి నీవు నీ
యాలును మాకు లెంకలగు టారయవే యరకానుదాని య
య్యాలరికై మదించి యిటులాడఁగ నీకును సిగ్గు గల్గదే.—

స్వయంవరమునాఁడు మమ్మెట్లుపఱచితివో జ్ఞాపకమున్నదా?

నళ—దుష్కర్మా! చండాలా! నీకింత కావరమా?

పుష్క—నళా! ఇంకఁజాలు నూరకుండుము.

(అనుబంధము-20.)

క. రాజ్యమునంతయు నోడితి
విజ్యనిభుని నాదు సఖునిఁ గృతలక్షణునిం
బూజ్యుని దూషింపుచు నిటు
వ్యాజ్యము లాడంగ నీకుఁ బాడియె కితవా.—

మఱియును,

ఉ. మూఢతచేకుఱ న్వెనుక ముందుదలంపక తొల్లి రాజ్యమా
లీఢతఁ దక్కెనంచు వెడలింపవె నన్ను బురంబునట్టి యా
రూఢిఁ జలంబుదీఱ ననిరుద్ధత నిన్ను బురంబుఁ బాపు నీ
గాఢముదంబుఁ జెందు నవకాశము గల్గుట యెంతభాగ్యమో.

దేవ—పుష్కరసార్వభౌమా! మనకు వీనితో నేమిమాటలు? నళా! నీ వీరాత్రియే పురము విడిచి పోవలయును సుమా.

పుష్క—అవును ఈరాత్రియే పోవలయును.

నళ—పుష్కరా! పోయివచ్చెదను. నే నెందునకును దుఃఖింపను.

తే, గీ. ప్రజల బిడ్డలఁబోలెఁ గాపాడుచుంటిఁ
దమ్ముఁడా యెట్లు ప్రోచెదో తనరవారి

పుష్క— నీ యుపన్యాస మిఁకఁజాలు నీదుగతికి
సంతసింపుము ప్రజలపైఁ జింతయేల.



దేవ—ఔరా! ఇంకను నీకుఁ బ్రజలఁ గాపాడు చింతయా? చాలును పొమ్ము.

పుష్కరచక్రవర్తీ! కలిరాజు ననుగ్రహమున మనకువచ్చిన యీరాజ్య మతని యాజ్ఞానుసారముగనే పాలింపుచుండవలయు. ఎప్పుడుకాని ఖడ్గముచూపి ప్రజలనేలవల యుఁగాక తీఁపుమాటలు సరిరావు, ఈ రాజనీతి నేనంతయుఁ జెప్పెద. నగరునకుఁ బోదమురమ్ము. (నిష్క్రమింతురు).

---

సప్తమరంగము-నళాంతఃపురము.

---

(ప్రవేశము : దమయంతి].

దమ—

సీ. కనఁడాయెనే నేఁడు తనుడాయు నెడరు రా
నఁడాయెనే జూద మాడఁబిలువ
దాయాదుఁ డడరించు మాయా దురోదరం
బేయాదుకొనుభంగి యేలకలిగెఁ
గాదంచు నిటులాడ రాదంచు నిది పాడి
గాదంచుఁ దొలఁగించు ఘనులు లేరె
కితవారచితమహాదుర్భర వాగురలఁ జిక్కి
హితవాక్యములఁ గొనఁడే విభుండు

తే,గీ. బేలుపడి పందెములనొడ్డి సోలుకొలఁది
నూలుకొని మఱిమఱి యాడి సోలుఁగాని
డీలుపడఁ డింతయైనఁ గగ్గోలుగనఁడు
మేలుకొనఁ డీఱువిడఁ డెట్టి కాలమహిమ.—

(అనుబంధము-21).

[ప్రవేశము : వార్ష్ణేయుఁడు.]

వార్ష్ణే—అమ్మా! (అని దుఃఖించుచు) ఏమనివచింతును? రాజ్యసర్వస్వమును రాజేంద్రుఁ డోడెను. పుష్కరుఁడును దేవలుఁడును మనరాజును రేపుదయములోపల నగరము విడిచిపొమ్మని చెప్పియున్నారు.

దమ—హా! నాథా! (మూర్ఛిల్లును).

[ప్రవేశము : నలుఁడు (దుఃఖమున)].

నళ—దమయంతీ ! (అని సమీపించి) వార్ష్ణేయా ! అంతయుం జెప్పితివా !

వార్ష్ణే—రాజేంద్రా ! చెప్పఁదగినదేమున్నది.

నళ—హా ! దైవమా ! దమయంతీ ! మనకు నేఁడీశ్వరుఁడు లేఁడు సుమా—

† ద్విపద.

దమ—(లేచి) ప్రాణేశ మనకెట్టి భంగముగలిగె
దీనత చేకూఱె దీనికేగతియొ

నళ— అక్కటకట యెంత లాపదలయ్యెఁ
బొక్కి సంకటములఁ బొందఁగవలసె

దమ— దాయాదుఁడడరి నీధనమెల్ల గెలువ
మాయజూదమటంచు మదిఁ దోఁచలేదె

నళ— చీఁకటిమూసె హెచ్చినబుద్ధిమాసె
నాకర్మగతియిట్లు నన్నీడ్చెఁదరుణి

దమ— మనవిధి యీభంగి మమ్మువంచింప
ననుకొన్నఫలమేమి యనుభవించెదము

నళ— విలసిల్లురాజ్యంబు విడనయ్యె నాకు
నెలనాగ నీవింక నెందుఁబోయెదవు

దమ— హానాథ యిటుల నన్నడిగెదవేమి
నేనెందుఁబోయెద నినువిడనాడి

నళ— పరరాష్ట్రములబాధ పడఁజాలవకట
కరుణించి నీతండ్రికడకుఁబొమ్మబల

దమ— ప్రాణేశ నినుఁబాసి యట పోవఁగలనె
మానకపోదము మనిమిద్దఱమును

నళ— నాఁడు నీపెండ్లి కున్నతరీతివచ్చి
నేఁడిట్లు వెకలినై నేను రాఁగలనె

† ఇది బ్యాగురాగము. అటతాళము గలయొకపాటగా రచియింపఁబడియె. ద్విపదలక్షణమునకు సరిపోవునందున ద్విపదగా నిందువ్రాయఁబడియె.



దమ— అట్లైనవలదు పాయక నిన్నుగూడి
యెట్టిచోటికినైన నేవచ్చుదాన

నళ— కలవాణి నీకడగండ్లకేనోర్వ
వలదువలదు నాదుపలుకుఁ గైకొనుమ

దమ— భూపాల యీమాట పొసఁగునేయెందు
నీపాదములయాన నినుఁబాయఁజాల

నళ— వనజాక్షి నీవిట్లు పట్టుపట్టినను
మనచిన్నికొడుకెందు మనియుండువాఁడు

దమ— ఇంతటిపనికైన యేలచింతింపఁ
గాంతాసుతుని దండ్రికడకుఁ బంపెదను

నళ— పిడుగుఁబోలినమాట విననయ్యె నాకుఁ
గొడుకితరులయిండ్లఁ గుందఁగవలెనె

వార్ష్ణే— ఓరాజరాజేంద్ర యోసార్వభౌమ
యీరీతిశోకించె దేమైనఫలమె

నళ— అలివేణిదమయంతి హాయింద్రసేన
నలఁగించె మిమ్ము నీనలుఁ డెంతఖలుఁడో.

[ప్రవేశము : ఇంద్రసేనుఁడు నిద్దురకన్నుల నులుముకొనుచు].

ఇంద్ర— ఏమయ్యయిది యిట్టులేలయున్నావు
నామీఁద నెట్టిచందము కోపమయ్య

నళ— హాయింద్రసేన యహాసుకుమార
దాయాదుఁ డనునీకుఁ దగునయ్యఁగాను

ఇంద్ర— అమ్మా యిదేల మాయయ్య యిట్లనియె
నిమ్మెయిఁ బలుక నే నేమంటినమ్మ

దమ— మాయన్న యిటురార మారశరీర
మాయయ్యయనకింక మాయమ్మయనకు

ఇంద్ర—(ఏడుచును.)

వార్ష్ణే— పసిబాలు నిటు భయంపడఁ జేయువారె
వెనఁజంద మామను వీక్షింతురమ్మ.

(ఇంద్రసేను నెత్తికొనిపోవును).

[ప్రవేశము : (దేవలుఁడు)].

దేవ—నళా! నీవింకను బురమువిడువలేదా!

దమ—(ప్రక్కకుఁబోవును.)

నళ—అగ్రజన్మా! రాజాంతఃపురములోనికిట్లు రాఁదగునా నీకు?

దేవ—నీకింకను రాజనామమా? అంతఃపురము వేఱయున్నదా?

నళ—భూసురా! ఈనిష్ఠురోక్తులేల!

దేవ—నీవంతఃపురమన్నందునకు నవ్వువచ్చుచున్నది. పురమేలేదు, అంతఃపురమఁట!

నళ—భూసురా! ఈ పరుషోక్తులేటికి? నీవిందేలవచ్చితివి?

దేవ—ఏలవచ్చితినా? నీవు తెలిసికొనఁజాలవా? నిన్ను వెడలించుటకంటెఁ గార్యమేమి!

నళ—ఇదే తొలిజామున నే వెడలెదము శంకింపకపొమ్ము.

దేవ—పొమ్ము. నేను లోకవృత్త మెఱుఁగనివాఁడ ననుకొంటివా? ఇందున్న పదార్థము లేమైన దొంగిలించుకొని పోవుటకా నన్నుబొమ్మనెదు? నాకన్నులయెదుటనే మీరు వెడలిపోవలయు.

నళ—దేవలా! ఇట్లునోనాడవలయునా? నేమ్రుచ్చిలించుకొని పోవుదునని నమ్మితివా!

దేవ— కం. చోరుఁడు నేఁ జోరుఁడనను
ఓరాజ్యమునందుఁగంటి మేవేళకుఁ దా
నేరీతి బుద్ధిపొడమునో
దారిద్ర్యము గలఁప నమ్మఁదగదొక్కరినిన్.—

నళ—అయిన నిప్పుడే వెడలెదము.

దేవ—మొట్టమొదట నాపనికానీ.

(నిష్క్రమించును.)

ద్వితీయాంకము సమాప్తము.

---

శ్రీ

# చిత్రనళీయ నాటకము.

## తృతీయాంకము.

---

### ప్రథమరంగము - అరణ్యము.

---

[ప్రవేశము - కలి].

కలి—బళి దేవలా! బళీ! నీవుగదా నామనసునకువచ్చువాఁడవు! ఇప్పుడు నేను సిద్ధప్రతిజ్ఞుఁడనైతిని. నామిత్రుఁడగు ద్వాపరమునుబంపి పాచికలలో నుండునట్లుచేసి నలుని నోడించితిని. ఇంతతోవిడిచితినా? ఎటుచేయ నెంచియున్నానో యటుచేయుదును. ఇదిగో, ఆనలదమయంతు లిక్కడికే వచ్చుచున్నారు. ఇప్పుడుగదా నిశ్చయమయిన దమయంతీ స్వయంవరము. (నిష్క్రమించును).

[ప్రవేశము : నలుఁడు - దమయంతి].

† సురానంద వృత్తములు.

దమ— మనోనాథ యిటులైన మనఁజాలనీ
ఘనాయాస మడఁగించి కరుణింపవే.

నళ— జనావాసములఁబాసి చపలాక్షియీ
ఘనారణ్యమునఁ జిక్కుగతిగల్గెఁగా.—

దమ— ధరాధీశ యెటుతాళఁదగు నెండకు
న్శరీరంబు దహియింప నడుకానలో.

నళ— సరోజాక్షి ఫలవృక్షసముదాయమీ
యరణ్యంబునను జూచుటరుదాయెఁగా.

---

† అపూర్వవృత్తము - త్రయోదశఛందమున 3002 వ సమవృత్తము - లక్షణము త-న భ జ-గ ౯ దింట యతి ఇది హిందూస్థానీరాగము - ఆటతాళము ఛాపుగలయొక పాటగా రచియింపఁబడియె. ఛందోబద్ధమగు వృత్తముగా నయితమున్నందున సురానందమును నపూర్వవృత్తముగా నిందువ్రాయఁబడియె.

దమ— అహో క్షుత్తృడతిబాధకయి జీవిత
స్పృహల్దీఱెను పాలి వెలిఁబాఱెడుర్.

నళ— మహారణ్యమునఁదూలి మడియంగ మా
కహో ధాతయిటు వ్రాయనగుఁగామినీ.—

దమ—హానాథా! ఈయాఁకలిదప్పుల కేనోర్వజాలను. మాటలాడుటకుసైతము శక్తిలేక యున్నాను.

నళ—జీవితేశ్వరీ! కాలవశమున దారిదప్పి యీఘోరారణ్యముంబ్రవేశించితిమి. ఇందుఁ గందమూలములైనను గనరావుకదా?

దమ—ప్రాణేశా! కన్నులుమూసికొనివచ్చుచున్నవి. నేనొక్కడుగైనను బెట్టఁజాలను.

(కూరుచుండును).

నళ—దమయంతీ! నావెంటరావలదని నినువేడికొనలేదా? నీవుపుట్టినింటనున్న నీకీదుఃఖము లేదుగా?

దమ—(లేచి) ప్రాణకాంతా! ఏమోయంటిఁగాని నాకేమియు నాయాసములేదు నడచి వత్తును.

నళ—నావెంట నేలవచ్చితివన్నందునకా యిట్లుమాటలాడెదవు? నీదుఃఖము చూడఁజాల కట్లంటిఁగాని పౌర్ణిమాపూర్ణ చంద్రునిఁబోలి శృంగారామృతము గుఱియుచున్న నీముద్దుముఖము చూచియున్న యాపదలన్నియు మఱచుచున్న నేను నిన్నువిడిచి యుండఁగలనా? అదవ్వున నేమో వృక్షమగపడుచున్నది. పోయి దానినీడ నింత విశ్రమింత మిట్లయినరమ్ము.

(ఇరువురునుబోయి యొకమామిడిచెట్టునీడం గూరుచుండుదురు.)

దమ—హా! ఈ యాఁకలిబాధ నిప్పుడుగదా తెలిసితి?

నళ—సత్యము, మనవలెనేకదా యాఁకలిఁగొన్న వారుందురు? అశక్యమశక్యము?

తే, గీ. ఏనరాధీశు సీమలోఁగాని యిట్లు
కడుపుమండించు నాఁకట మడియుచుండు
వారలుందు రేమండనే వానివైభ
వంబు ప్రోయినిడికాల్పనే వానిపదవి.

(పైనుండి యొకఫలము పడును).

దమ—ప్రాణేశా! ఈపండు పైనుండి పడియెను.

నళ—నీపుణ్యవశమున నిదిచిక్కె - భక్షింపుము.

దమ—ఆర్యా! నీవు భుజింపక నే భుజింపఁగలనా? నీవె భక్షింపుము.



నళ—తే,గీ. ఆఁకటఁ గృశించి యెంతయు నలసితీవు
లేమ నాకంతయాఁకలిలేదు పూర్ణ
భావమున దీని నేనిచ్చువాఁడ నిందుఁ
బూర్వభోజన దోషంబు వొడమఁగలదె.

దమ— క. ధీశాంతి నిట్టులాడెదు
నీక్షుధ నే నెఱుఁగఁజాల నే నగమైనన్
భక్షించి నాకొసంగిన
భక్షించెదఁగాని పూర్ణఫల మేనొల్లన్.

నళ—తరుణీ! ఏల యిట్లుసంకోచించెదు? ఇది మిక్కిలి చిన్నది. సగమన్న నెంత?

దమ—అట్లయిన నీవేయంతయుభుజింపుము. తరువాతనీచెట్టునింకొకపండున్నఁజూతము.

నళ—(చెట్టువైపునఁబైనఁజూచి) జలజాక్షీ! ఈచెట్టుననొక్కపండైనలేదే యిదియెట్లువచ్చె?

మ. సుదతీ యీవిటపంబు శూన్యఫలమై చూపట్టె నిచ్చోటని
య్యది యేమాయయొ ప్రాణభిద్విషఫలం బౌనేమొ—

దమ— అట్లైన న
య్యది నాకిమ్ము భుజించి చూచెదను—

నళ— చానా నన్ను బాధించెనం
గద నేనేభుజియింతు—

దమ— వల్లదు మనఃకాంతా నినున్వేడెదన్.

ఆర్యా! ఇందువలన నీకేమైన నాపదగలిగిన నేనోర్వఁగలనా? నాకేయుండనిమ్ము.

(అని ఫలము నిరువురు గ్రహింపఁజూచెదరు).

[ప్రవేశము: (వస్తున్న యొక్కబ్రాహ్మణుఁడు)].

బ్రా—ఎవరయ్యామీరు? బాటసారులుగానున్నారు. (కూలఁబడును).

నళ—అయ్యా! లేవఁజాలము.

ఉ. సారధరామరేంద్ర కులసంభవ యిక్కడినుండి యే నమ
స్కారము లాచరించెదము కైకొను—

బ్రా— నాలుగునాళ్ళనుండి య
య్యా రుచిచూడ నొక్కకడియున్న మెఱుంగని వానికి న్నమ
స్కారములేల వట్టియుపచారములేటికిఁ గుక్షినిండునే—

నళ—బ్రాహ్మణోత్తమా ! మాయవస్థయే నీకుఁగలిగెనా ?

బ్రాహ్మ—అయ్యో ! దారివెంటఁ బ్రాణములువిడుచు బ్రాహ్మణున కాహార మివ్వఁజాలక యీమాటలాడెదరా ?

దమ—అగ్రజన్మా ! అబద్ధముకాదు.

క. విమలాత్మ యెట్టికాలము
హీమమయో తలపోయనరిది యీపాటు యశం
బమరారఁగ సప్తద్వీ
పము లేలినయట్టి సార్వభౌమునకును మీ.—

బ్రాహ్మ—అట్లనా ! అతనిచేతియందుండునదియేమి ?

నళ—భూదేవశిరోమణీ ! ఇదియిచ్చటనే యాకస్మికముగాఁ బడినపండు మామిడిపండు పోలికయున్నది.

క. భూదేవశిరోమణి యీ
పాదపమునఁ గలుగదొక్క పండును నిది యిం
దే దిగువఁబడియెఁ గన నీ
మాదిరి విషఫలమొ కాక మాయాఫలమో.—

బ్రాహ్మ—ఏదీ ! చూత మిట్లిమ్ము.

(నలుఁడుపండివ్వ బ్రాహ్మణుఁడు తినఁదొడఁగును).

నళ—హా ! హా ! భూసురా ! మాకు బ్రహ్మహత్య తెచ్చెదవుసుమా !

బ్రా—(తినుచు) బ్రహ్మహత్యయా ! ఉండనీ ! ఏమివిషఫలమిది ! ఏమిబొంకుబొంకితివి ! ఎంతతియ్యఁగనున్నది. ఇట్టివింకరెండున్న నివ్వరాదా ! మామిడిపండు విషఫలమా ! "పిల్లికిజ్వరమువచ్చె" ననుమాటలెక్కడ నేర్చుకొంటివి ! ఆహా ! కడుపు నిండుచువచ్చె ఏలదుఃఖపడెదవు ! నీవు చక్రవర్తివయినఁగానీ, ఇట్టి యబద్ధము లింక నాడకుము. ఇట్టివాఁడవుగనుకనే యీవనమున నిప్పుడు బిడాలచక్రవర్తివయితివి.

నళ—బ్రాహ్మణోత్తమా ! ఎట్లయినను నీవు తృప్తిపొందనదియే నాకుసంతోషము.

బ్రా—కాక దుఃఖపడితివి-పండేమయినను వెనుకకువచ్చునా !

నళ—అయ్యా ! పండెవరికిఁగావలయు ?

బ్రా—మఱేమికావలయు ?

నళ—ఈయరణ్యము నిర్గమించుదారి ?

బ్రా—ఆహా ! దారియా ? నీకా ? ఆకలితోఁ బ్రాణమాత్రావశిష్టుఁడయి తపియించు బ్రాహ్మణున కొక్కపండివ్వనేరక బొంకులుబొంకి విషపు మామిడిపండును సృష్టిచేసిన చండాలుఁడవు—



ఉ. చాల బుభుక్ష డస్సిన ద్విజన్ముని యాఁకటి కొక్కపండిడ
జ్జాలక "బ్రాహ్మణార్ణభర" యనం దగువాక్యము వీటిఁబోవఁగా
నాలరివై సృజించితి విషామ్రఫలం బని రాజరూప చం
డాలుఁడ వీవు నిన్ను గనిన న్గలుషం బగు మానవాధమా.

ఛీ—(నిష్క్రమించును.)

నళ—హా! జీవితేశ్వరీ! చూచితివా ?

క. ఉపకారమునకుఁ గలిగెడు
నపకారము లేనినింద లగునుడు లనఁగా
నపరాధము లగుఁ గాలము
విపరీతం బైనఁ గర్మవిధిబల మతివా.

ఆహా ! ఏది యెట్లున్నను నీయాఁకలికేమిచేయుదుము ?

ఉ. భూరితరోప తాపమునఁ బొక్కఁగఁ గాల్చుచు దేహమెల్ల నం
గారకయోగమైనగతిఁ గన్నులుగానమి ప్రజ్ఞలేమి ని
స్సారత మాటరామియు నెసంగఁగఁ బ్రాణముఁ బావఁజాలునో
రౌర దురంతదుఃఖకర మాఁకలిబాధ భరింపశక్యమే.

(రెండుపక్షులు పైనుండివచ్చును).

తరళాక్షీ ! ఈపక్షులీచెట్టుక్రిందికి వచ్చుచున్నవి. వీనిఁబట్టి పచ్చిమాంసమునైన భుజించి క్షుద్బాధఁ దీర్చికొందము.

(పక్షులఁబట్టఁబోవ నవిచిక్కకున్న తనవసనము వానిపైవైచును. అవి వసనముహరించును.)

ఆ, వె. అకటకట దహించు నాఁకలిచేఁ బ్రాణ
భంగమునకు నోడి పక్షిఁబట్టఁ
బోవ మీఁదివలువ పోవుచందముగల్గె
నింతపాపకాల మెందుఁగలదు.—

దమ—ప్రాణకాంతా ! దుష్కాలమున కేమిచేయవచ్చును ! ఈదాహబాధకుఁ దాళఁజాలకున్నాము. ఎందైన నొకజలాశయము వెదకుదము. వస్త్రమునకై చింతింపనేల! నాయంబరమున్నదిగదా ? (నిష్క్రమించును నలునితో).

[పునః ప్రవేశము : కలి].

కలి—ఔరా ! ఈదేవేంద్రుఁ డెంతటిదుర్మార్గుఁడు ! ఇట్లొనర్పవచ్చునా ? ఇది వీరు భుజించియుండిరా నాప్రయాసమంతయు వ్యర్థమయియుండును. ఇంక నింద్రునిపని తీర్చెదను. నాతెరవున కేలరావలయు?

క. నామహిమంబున నాపౌ
లోమీసతితోడ నాకలోకచ్యుతుఁడై
భూమీధరముల డాఁగిన
యామఘవానుండు మఱునగునేనన్నుర్.

(నిష్క్రమించును).

---

## ద్వితీయరంగము - అదేయరణ్యము.

---

[ప్రవేశము : నళదమయంతులు (ఏకవసనముధరించి)]

నళ— తే, గీ. ఎండమావుల వెనువెంట నెల్లకడలఁ
బాఱువిధమయ్యెఁ గన్నులు పచ్చనయ్యె
నోటఁ దడియారె నడయాడు పాటిదీఱెఁ
బానమునకైన సలిల మికఁ గానలేదె—

దమ— తే, గీ. అక్కటా దప్పిగలిగె ధైర్యంబువదలెఁ
బ్రాణములు దమస్థానము ల్వాయఁదొడఁగెఁ
దరమె యోర్వంగ నాథ ముందరికినింక
నొక్కయడుగైన నిడనోపనోపనోప.—

నళ—ఆహా! కాంతామణీ ఈ సమీపముననే జలాశయమున్నట్లున్నది. ఎట్లైనఁబోదము రమ్ము.

దమ—అయ్యో! లేవఁజాలఁగదా? జలాశయములని యిట్లే యెన్ని చోట్లకో తిరిగి తిరిగి వేసరితిమి. నా ప్రాణములున్నవో లేవో నేనే యెఱుంగను.

నళ—ప్రాణసఖీ! విస్మృత్తికొనియైనఁబోయెదరమ్ము.

దమ—(లేచి) నాథా! ఎట్లయిననేనేవచ్చెద (ఇరువురునుబోయి సమీపమునఁగాన్పించు చున్న కాసారమున నీరుద్రావి కూరుచుండుదురు).

నళ—జీవితేశ్వరీ! మనకు నేఁడీక్షారజలమే యమృతమాయెఁగదా?

దమ—ప్రాణేశా! నాకు శోషవొడముచున్నది.

నళ—అయిన నించెకొంచెము విశ్రమింపుము,



దమ—(నలునితొడలపై తలనిడి నిద్రించును).

నళ—హా! దైవమా! నే ఘోరపాపుఁడఁగదా? నాకీదురవస్థరాఁదగినదే. నాతోఁగూడి యీయబల యీ ఘోరాటవులలో మ్రగ్గుచున్నదే. పుట్టినింటికిఁ బొమ్మని యెంత చెప్పినను వినదయ్యె. ఆమాటయు నన్నాడనివ్వదు. నాప్రాప్తికి దుఃఖింతునా? నన్నుగూడి యీ యబలపడుపాటునకు దుఃఖింతునా? ఆహా! చతుస్సముద్ర ముద్రితా ఖండమహీమండలమేలెడు చక్రవర్తి యొకనాడు తనభార్య యాఁకలిఁ దీర్పఁజాల కున్నాఁడుకదా! ఔరా! కాలమహిమ!

దమయంతీ! నానావిధ భక్ష్యభోజ్యములు రుచిచూచి చూడక పాఱవైచుచున్న నీకు నేఁడీక్షారోదకము లభించుటయే కఱవయ్యెనే? నేనెంతయని దుఃఖింతును—

సీ. కడఁ జూడరాని యీ కానన సంతతు
లుద్యాన వనములే యువిద నీకుఁ
గడు భయంకరము లీ గహన మృగావళు
లాళీ జనంబులే యతివ నీకు
నోరారఁ జేయు నీ ఘోరజలంబులు
ఘన రసాయనములే కాంత నీకుఁ
గదియంగరాని యీ కఠినంపు రానేల
హంసతూలిక పాన్పె యబల నీకు

ఆ, వె. నింత దుఃఖమింక నేఁజూడఁగలనె యో
భీమరాజపుత్రి హేమగాత్రి
జలజపాణికీర కలవాణి నామెచ్చు
లాడి ముద్దులాడి యక్కటకట.—

ఈదుఃఖమునకెట్లోర్తును? నేటికీజలాహారమాయె నింక నెన్నాళ్ళో యీయరణ్యరోదనము. నేనెందులకైనఁ బోయెదను.

ఆహా! నాకెట్టిబుద్ధిపుట్టెను! ఎంతబాధలకైనఁ దాళుకొని చిన్నకుమారునిసైతము పుట్టినింటికిఁబంపి నావెంటవచ్చిన యీరాకాశశాంకవదన నీకీకారణ్యమున నిటుడించి పోవనెంచితినే. ఈపంకజాక్షిని జూచినప్పుడంతయు మనసునఁబట్టుచాలక నిండి యుబికి పొంగి పొరలి వెల్లివిరిచి తెరలుతెరలై దుఃఖపరంపరలు జనింపఁగా నేనేమి చేయఁగలను? ఆహా! చూడఁజాల-చూడఁజాల (సగము చీర [illegible] పాడుచేతులీనాఁడెంతసాహసము చేయనొగ్గెను? దమ[illegible] విడువకయుండి నీదుఃఖము చూడనుజాల. ఏమిసే[illegible] [illegible]ట్లును దగుతహింపనె వలయు.

(పూర్తిగాఁ జీరఁ జించి కదలకుండ దమయంతి శిరమును దనతొడనుండి వదలించి ముందరికి రెండడుగులుపోయి) హా కఠినకర్మ! నీ లావణ్యవతి నీబంగారుబొమ్మ నీమనోహారిణి నీ దమయంతిని విడిచిపోవ నీకు మనసెట్లువుట్టెను! (వచ్చి దమయంతియొద్దఁ గూరుచుండి).

సీ. చెలి నీదు మోముఁగాంచి ముదంబుఁ జెందుదుఁ
 గాని చూడఁగ రోయుటే నెఱుంగ
నిమిషంబు కనకున్నఁ దమిఁ బెగ్గిలుదుఁగాని
 నారి నిన్నడబాయఁ గోరుటెఱుఁగఁ
దిలకించి హర్షాశ్రువుల వహింపుదుఁగాని
 యిట్టిదుఃఖాస్రులే నెఱుదు నెఱుఁగ
మది ధన్యతకు రంజిలుదుఁగాని క్రూరక
 ర్ముఁడ నాదునంచు నెన్నఁడు నెఱుంగఁ
తే, గీ. జంచలాక్షిరో నీవు నిద్రించువేళ
 నీ వెఱుఁగకుండ నెలమిమై నెన్నియేని
ముద్దు లిడుచుంటిఁగాని నీయొద్ద నిలిచి
 వేడి కన్నీరునించుటే నాఁడు నెఱుఁగ.

(అనుబంధము-21. A.)

దమ—(ఇంచుక కదలును).

నళ-అయ్యో! కదలుచున్నది ఏమొనర్చిన నీతరుణి మేలుకొనుటకుముందే యొనర్పవలయు. అయ్యో! నేఁబోయిన నీదమయంతి లేచి నన్నెంత క్రూరకర్ముఁడని నిందింపదో! అకటా! ఉండి యీదుఃఖము చూడఁజాల నిక్కముగాఁ జూడఁజాల, పోవకతీఱదు.

(సుందరికివచ్చి)

అకటా! కలిబాధచే దుర్బలములై, ఆఁకలిబాధచే దుర్బలతరములై, ఆకులవియోగ బాధచే దుర్బలతమములై బట్టపేలికలవలెఁ దూఁగాడుచుండు నీకాళ్ళతో నా యర్ధాంగలక్ష్మి నీమహాగహనమునడించి నేనెట్లుపోవుదును! ఈతన్వి, ఈబంగారు బొమ్మ, ఈరమణీలలామ, కడముద్దైన నొకటి కైకొనిపోయెదఁగాక.

(మరలవచ్చి)

[illegible]వాణి వాణి కోకిలవాణి నిరసింపఁ
 [illegible]హమున మెచ్చి యిడినముద్దు
నెనబో[illegible]జాణతనంబున కెలర్చి
 [illegible] ట్టిన మురిపెంపుముద్దు





కమలాక్షి ప్రణయకోపమునఁ జూడని వేళఁ
 గడ కేగి బలిమిమై నిడినముద్దు
ఘనవేణి మరులేచి ననుముద్దులాడంగ
 మదిఁబొంగి యిడిన యమ్మామ్రముద్దు
తే, గీ. ఎల్లముద్దుల రుచుల నే నెఱిఁగినాఁడఁ
 గాని యీనారి నిదురింపఁ గనులునీట
మునుఁగ నెడఁబాయు వగనిడు ముద్దు నందుఁ
 దనరు రుచిఁగాన దాని నింతనుభవింతు. (ముద్దిడి)

ఆహా! సత్యసంధసజ్జనుని మానసమువలె స్వచ్ఛమై, హిమానీసమయ రాకాశీతకరశీతల కిరణసలిలీభూత చంద్రకాంతోపలతుషారవారిపూర సంక్షాళితకరకాసముదయము పోలెఁ జల్లనై, ద్రాక్షామరందేక్షురస ఖండశర్కరాదులమించి తియ్యనై యీముద్దు నా కిప్పు డింత హృద్యమగునే?

(దమయంతి మరలఁగదలును.)

దైవమా! నేనేమిచేయుదును? దుష్కర్ముఁడనగు నన్నుఁగూడినకతన నీలతాంగికింత దుఃఖముద్భవిల్లె. నాదుఃఖము నెంతయైన భరింతుఁగాని యీ రమణి సంతాపము చూడఁజాల. నేఁ బాసిపోయిన నీబిడకు క్షేమము గలుగఁగలదు. పోయెదఁగాక.

సీ. విమలోజ్జ్వలాంగి నీ దమయంతిఁ బ్రోవరే
 శరణీదప్పని సూర్యచంద్రులార
భీమతనూజ నీ వెలఁది రక్షింపరే
 కరుణాతివేల దిక్పాలురార
వీరసేనునికోడ లీరామఁ గావరే
 వనదేవతా సార్వభౌములార
నలురాణి నీదీన లలనఁబోషింపరే
 వనవాన తాపసవర్యులార
ఆ, వె. జగము లీలమోచు నగములార యరణ్య
 మృగములార భూరి ఖగములార
యురగులార భిల్లవరులార తరులార
 యీఁడులేని కరుణఁ జూడరయ్య.

(నిష్క్రమించును).

దమ—(లేచి-ప్రక్కలఁజూచి "నాథా!" యని పలుమాఱుపిలచి, సంభ్రమమునలేచి చీరఁజూచుకొని, దిక్కులువెదకి, కన్నీరునించి "ప్రాణేశా" యని—మూర్ఛిల్లి, లేచి) హా! ప్రాణకాంతా! ఈనట్టడవిని నను డించిపోవ నేనేమితప్పుచేసితిని? ఈ వియోగబాధ నేనెట్లుసహింతును? ధూరమణా! "నన్నువిడువలేదని యీకాంత వలదన్నను వెంటవచ్చె, విడిచిన నేమిచేయునోచూతమని" నను బరీక్షించుటకిందే యెందైనను డాఁగియున్నావా? ప్రాణేశా! ఈవిషమపరీక్షమాని నీసుందరముఖార విందదర్శన మీకున్న నేనెట్లు జీవింతును? ఇదేమి నామొఱాలింపవు? ఏల పలుక కున్నావు? ఏల రాకయున్నావు?

(అనుబంధము-22.)

సీ. విడనాడ నంచు బల్విడి బాసచేసి న
న్నెడఁబాయుబుద్ధి నీకేల కలిగె
నిను నెందుఁ బాయకుండిన యొక్క చెలిఁబ్రోవ
బరువయ్యెనే నీకుఁ బ్రాణనాథ
వలదన్న వెంటవచ్చె లతాంగి యని నీకు
వినుకు జనించెనే వసుమతీంద్ర
నీబాధ లరయక నిదురించినందునఁ
గోపమా నీకు నో భూపవంద్య

తే, గీ. నేరమా నాయెడల నీకు వైరమా వి
చారమా యిది నేనెంత భారమాయు
దారమానసబీరమా దారమాన
ధీరమాధార యీకాన ఘోరమాయె.

అక్కటా! మనోనాథా? నను నిక్కముగాఁ బాసితివే? అయ్యో! మదిమది నీవు నన్నెడఁబాసిపోవఁగలవే? పోవునప్పుడు నన్నొక్కమాట పలుకరించకుందువా? నాకేల మెలఁకువకాదయ్యె? ఈపాపినిద్ర నాకేలవచ్చె? అక్కటా! ఎంతతెంపు వహించితివి? ఒక్కనాఁడైన నీవు నట్టడివిని నను మానిపోవఁగలవని యూహింపఁగా? అటుపోవునపు డెంత యలసితివో? ఎంత దుఃఖించితివో! ఆదుఃఖమున నాకుఁ బాలియక యీవియోగదుఃఖము ఘటించితివే? నను మేలుకొలపి నీదండనుండనన్న నేనేమొనర్చియుందును? అంత వలవనిదాననైన నన్నెందైన జనావాసమునకుఁ బోఁదోలియుండరాదా? అక్కటా! తప్పాడితి. కారణములేక నీవీకార్యమొనర్చి యుందువా? అనవరతము కంటిఱెప్పవలెఁ బోషించుచున్నవాఁడవు నిష్కారణముగ నను దిగడుదువా? నే మహాపరాధమొనర్చినదానను. ఆయపరాధము దెలియఁజాలక



యిట్లాడెనఁగాని నీకుఁ బరాకుకలదా! అయ్యయో? మోహావేశమున నినుఁబాయఁ జాలనంటిఁగాని నావలన నీకుఁ గలుగఁగలదుఃఖము లారయనైతి నే. ఎంతయునిక్కచ్చి చేసి నిన్నింతపఱచితి నే. హా! దైవమా నన్నేల యింక జీవింపఁ జేసెదవు?

ఓ వటవృక్షమా! నేనును నాథుఁడును నొక్కచీరఁగట్టి నీనీడయందు విశ్రమించి యుండినందునకు నీవే సాక్షివికదా? నాచీరఁజించి నాజీవితేశు వేఱుపఱచినది నీవో నీలోనుండు నేదైన భూతమో యుండవలయు. మానవుఁడు తనచేతులార నిట్టికార్య మొనర్చునా? ఇప్పుడావిభుఁడెచ్చటనున్నాఁడో చూపుమా. ఓ తటాకమా! నీలో నేమైన నలుని డాఁచియున్నఁ జూపి పుణ్యము గట్టుకోరాదా? నన్నైన మ్రింగరాదా? నాథా! ఇఁక నేనెందుబోవుదును? ఏదిమార్గము? అయ్యో! ఇట్టిపాటు నాకుఁ గలుగునని యొకనాఁడుండలంప.

(అనుబంధము-23.)

సీ. నను వీడిపోవంగ నా నేరమేమి నా
కీప్రాప్తి గలుగునం చెఱుఁగనైతి
నా నాథ నీవుండ నా కేకొఱఁత యంటి
నీవిధి విపరీత మెఱుఁగనైతి
నీదండ విడకుండ నీసేవ లొనరించు
కడిఁది భాగ్యము నాకుఁ గలుగదయ్యె
నింక నీ నెమ్మోము వీక్షించు భాగ్యంబు
నాకున్నదో లేదొ నాథ యెఱుఁగ

తే.గీ. నామనోనాథ నాప్రాణనాథ నాయ
నంగసుందర నాకూర్మి సంగడీఁడ
నాయనుఁగుతోడ నానిధానంబ నాగ
ణించు దైవంబ నన్ను మన్నించు ప్రోడ.——

(మూర్ఛిల్లును).

(యవనికజాఱును).

## తృతీయరంగము - అదేయడవి.

---

ప్రవేశము : నలుఁడు.

నళ— సీ. పొడగాన కడలూన నడుకానఁ గడుదీన
గతిమీఱి నెంత బల్వెతలఁ బడితొ
వినుపింప ననుకంప జనియింప కనలంప
నను నెంతదూఱితో వనటఁ దూలి
వనసీమ నినులేమ కనఁ బ్రామ ఘనభీమ
మృగపాళిఁ గని యెంత బెగడువడితొ
బెగడొందినఁ గడింది వగఁ జెంది సెగఁ గుంది
యలివేణి యెంత యాయాసపడితొ
తే,గీ. అకట దమయంతి రతిచేతి యలరుబంతి
మురిపెములదొంతి వెలలేని మరునిదంతి
నెలకొనుకడాని బలుకాంతి కలుగునింతి
బాల యీలీలఁ దలపోసి తాళఁజాల.—

(అనుబంధము-24.)

హా! కాంతామణీ! నిన్ను మరల నేనెన్నఁడు చూడఁగలను! అయ్యో! పిట్టపిడుగున నిన్నుబాయు దుర్బుద్ధి నాకుఁబుట్టి వెడలివచ్చితిని. అకటా! ఒకనూఱడుగులు వచ్చినాఘోరకృత్యమునకు దుఃఖించి వెనుకఁదిరిగి నినుఁజూడవలయునన్న నెందెందు వెదకినను జిక్కకున్నావుగదా! నాప్రాప్తికేమందును? వరించిననాఁటనుండి ననుఁ బాయఁజాలని కారణమునఁ జిన్నికుమారునిసైతము పుట్టినింటికిఁబంపి యడవులకు వెంటవచ్చిన మనోహారిణి నిద్రపోవుచుండఁగాఁ జీరఁజించుకొని యొంటిగా నట్టడవి విడిచివచ్చిన క్రూరకర్ముఁడు కృతఘ్నుఁ డెందైనఁగలఁడా? దమయంతీ! దమయంతీ! అయ్యో! ఇంకెక్కడదమయంతి నాకు?

(లోపల నగ్ని కనుపించును).

ఆహా! ఈదావాగ్ని యీ యరణ్యమునంతయు దహింపఁజొచ్చె. నేనిందేయుండెదను. దమయంతీ వియోగజ్వరార్తిఁబడుచున్న కడఁగాననిని నాయిడుమలఁగడఁజేయ నీ దావాగ్నియే బీజమంత్ర మగుఁగాక.

(లోపలధ్వని).

హా! దీనబంధో! మాంపాహి - మాంపాహి - మాంరక్ష-మాంరక్ష. (అని)



నళ—ఆహా! ఎక్కడిదీయార్తధ్వని? నన్నుబోలిన నిర్భాగ్యుఁడెవఁడిందుఁ బ్రవేశించెనో! "మాంరక్ష-మాంరక్ష" యని యాక్రందనముచేసెడునో దేహీ! భయపడకుము. ఎంత దీనుఁడనైయున్నను, ఈ నలుఁడు తనచేతనైన సాహాయ్య మొసరఁ బ్రయత్నించును.

ధ్వని—విజయీభవ-నళరాజా! విజయీభవ-నేనొకవృద్ధసర్పమును - వేయేండ్లు మనినందున మానవభాషసయితము నేర్చి మాననీయుఁడనైతి. నేఁడీయగ్నిలో దహింపఁబడుచున్నాను రక్షింపుము.

నళ—(పోయి యగ్ని నున్న సర్పమును వెలికిఁదెచ్చి) సర్పరాజా! ఇఁక నిర్భయుఁడవై యుండుము (అని పామును విడువ నదికఱచును.) హా! హా! హతోస్మి. (అనును- వివర్ణుఁడగును) తుదను నాయవస్థ యింతకువచ్చెనా! అయ్యో! ఈసర్పము నన్నింతగాఁ గఱచె. సర్పదష్టుఁడనై యంతరింపవలసి వచ్చె. హా! జీవితేశ్వరీ! దమయంతీ!

ఉ. చండవిలుతాశకీలకును సాటి యనందగు క్ష్వేళవహ్ని యీ
కుండలి నన్నుదాఁగఱచెఁ గ్రూరత నింక మనంగఁజాల నో
యండజయాన యిట్టియెడ నాదట నూఱడఁబల్క నీవు నా
దండ వసించుభాగ్యము విధంబలరారఁగ నోఁచ నైతినే.

(అనుబంధము-25)

హా! కుమారా! ఇంద్రసేనా! నీవెట్టివేళ మాతృగర్భమున జనించితివి?

చ. మనసిజరూప చారు సుకుమార తనూభవ యింద్రసేన నీ
జననము తండ్రికి న్మగుల సౌఖ్యదమంచని రింతెకాని యో
తనయ యొకందుగాని యలదైవవిదు ల్గడుదిక్కులేక యీ
వనమున నంతమొందు పరిపాటియొసంగఁగఁ బల్కరైరిగా.

అయ్యో! విధిబలమైనప్పు డెక్కడిజ్యోతిషము? ఎక్కడిగ్రహబలము?

ఆహా! ఇప్పుడు నాకాఁకలి యెక్కడికోపోయినది. ఇంకెక్కడి యాఁకలి! అన్ని విషయములఁ గడుపు నిండియే యున్నది. పెక్కు చింతలతో నేమి? ఇట్టికాలమున హరి భజనమే తారకము.

కవిరాజవిరాజితము.

వనజవిలోచన పాపవిమోచన భక్తవిసేచన వైభవదా
వనధినివేశన భవ్యసుధాశన వైరివినాశన భద్రయుతా
దినపతివిక్రమ దివ్యపదక్రమ ధీర పరాక్రమ దేవనుతా
మునివిసరావన ముఖ్యవిభావన మూర్తిసుపావన మోక్షపదా.

(అనుబంధము-26)

వృద్ధసర్పమా! నిన్నేమందును! కాలముకానియప్పు డుపకారమొనరించిన నపకారము వెంటవచ్చును. అదిగాక క్రూరకర్ముఁడనై యాయాసమున క్రాంతిఁజెంది నన్నే దైవముగా నమ్మియుండిన మానవతీమణిని నట్టడివిం గట్టుచీరఁజించి గుట్టలఁబట్టించిన నాయట్టి కట్టిడి కిట్టిపాటుగా కిం కెట్టిపాటు రాఁగలదు.

[ప్రవేశము : కర్కోటకుఁడు].

కర్కో—మ. నళభూమీధవ యూరడిల్లు మతిదీనభ్రాంతి నీ కేటికి
న్చలమై యచ్యుతమై ప్రయతితివిధానంబై యనుల్లంఘ్యమై
వెలయుంగాదె విధిక్రమంబు సుఖమే వీక్షించు భూమీజను
ల్గలరే యెప్పటి కేదిరావలయు వాలాయంబు వచ్చుంగదా.

(అనుబంధము-27.)

నేను కర్కోటకుఁడను నాగరాజును. కలిప్రేరణచే నిన్ను గఱవవచ్చితి. అతని యాజ్ఞ నిర్వహింపకున్న విధిలేదు. దారిలో దేవేంద్రుని దర్శించితి. నీవును దమయంతియు నరణ్యమున రసాలవృక్షమునీడ నాఁకలిచే దుఃఖింపుచున్నపుడొక ఫలము మీయొద్దఁ బడవైచెనఁట. దానిభుజించియున్న మీకళనాయోదన్యలబాధలు దీఱుచుండెను. దానినెఱింగి కలిరాజు బ్రాహ్మణవేషమున హరించెనఁట. అయినను దేవేంద్రుఁడు నీపైననుగ్రహమున నావిషమున నమృతగుణమించుక కలిగించియున్నాఁడు. విషయోగమున నీవు రూపము మాఱియున్నను నీకాఁకలిదప్పులిచ్ఛాధీనములైయుండు. నీకు శుభమగును. పోయివచ్చెద.

నళ—కర్కోటకా! కలిరాజునకే నేమపకారము చేసియున్నాను?

కర్కో—చెప్పఁదగిన విషయములఁ జెప్పితి. ఇతరములు నన్నడుగకుము.

నళ—అయ్యా! నాదమయంతి యిప్పుడెచ్చటనున్నదో చెప్పఁగలవా?

కర్కో—అది నేను జెప్పరాదు.

నళ—పోనీ! నాదమయంతి మంగళాంగము నేనీజన్మమున మరలఁ జూడఁగలనా?

కర్కో—నన్నేలడిగెదవు. నాకుఁ దడవయ్యె-పోయివచ్చెద. (నిష్క్రమించి)

నళ—అహా! ఈ కర్కోటకుఁ డుపకారివలె వచ్చి తుద్బాధచే నిన్నఁడోసమయనున్న నాకాఁకలిదప్పులడఁగించి దుఃఖభాజనమగు నాజన్మము మఱింత దీర్ఘముగానొనరించె.

(కర్కోటకుఁడు మరల ప్రవేశించి).

కర్కో—నళరాజా! మఱియొకమాట. నీరూపము కావలసినపుడు నన్నుదలఁపుము. ఈయంబరము నీకుఁబంపెద. దీనిధరించిన నెప్పటిరూపముకలుగు. పోయివచ్చెద.

(నిష్క్రమించును).

నళ—అయ్యో! నారూపము నాకేల? ఏవిభవము నాకేల? దమయంతీ! నిన్నింకెన్నఁడు చూడఁగలను? ఏయడవిమృగములు నిన్నేమిచేసెనోకదా? తరులారా! మృగాదులారా! మా దమయంతిం జూపరాదా?



సీ. అరయరే తరుణి నిర్ఝరిణులార ప్రమత్త
కరిణులార విభీత హరిణులార
వగలాడిఁ గనరె పన్నగములార సువర్ణ
ఖగములార యరణ్య మృగములార
భామఁగానరె సరోవరములార లతావి
సరములార మహోర్వీ ధరములార
చూడరే కలికిఁ గింశుకములార విమత్త
పికములార సువర్ణ శుకములార
తే. గీ. బకములార రథాంగ డింభకములార
భిల్లులార వనతరుమతల్లులార
మానులార మహోటవిస్థానులార
కానరే మందయాన నిక్కానలోన.—

(నిష్క్రమించును).

---

## తురీయరంగము - అరణ్యము.

---

[ప్రవేశము : వీరనాయకుఁడు మొదలగు నెఱుకువారు].

(అనుబంధము - 28.)

ఎఱుకు—పాలమునకెల్ల నేలికయగు గండరగండా! వీరనాయకా! జోహారులు.

వీర—ఓరీ! ఎఱుకులారా! మీరు నేఁడేమిచేసితిరి?

1 ఎఱు—ఏలికా! అందందుఁ జిందులు ద్రొక్కుచు సందడి సేయుచుండిన పందిగున్నను నేఁడు క్రిందఁగెడపి వ్రందించియున్నాను.

2 ఎఱు—సామీ! అత్తమిల్లు సత్తువగల కత్తిమెకము వత్తికత్తిఁ గత్తరించియున్నాను.

3 ఎఱు—ఱేఁడా! గోమువిూఱిన యామునేసుఁగుతో సామచేసి మోముఁభంచి గీఱునకుం దెచ్చియున్నాను.

4 ఎఱు—ఒడయఁడా! సంగడికార్లతోఁ బొంగిపోవంగని చాంగవలె డొంగియుండిన సింగముమోముపై గొంగడిఁగప్పి చెంగించియున్నాను.

5 ఎఱు—ఎకిమీఁడా! త్రుళ్లిపడుదుఁ గ్రేళ్లుఱుకు తెల్లగమి కాళ్లువట్టి త్రెళ్లువతిపఁ త్రాళ్లఁగట్టియున్నాను.

(అనుబంధము-29.)

వీర—సెబాస్-లెంకలారా! మీరు నేఁడు దక్కినఁపుఁజిక్కిన చిక్కులఁగైకొని యొక్కడగు నుక్కున వేఁటకు నిక్కవలయు. నేనిచ్చట నే కాఁచియుందును.

ఎఱుకులు— (నిష్క్రమింతురు).

[ప్రవేశము: దమయంతి].

దమ— సీ. మఱచితే నాథ నీతెఱవప్పై నేవేళఁ
జెన్నారనించుచు నున్నకూర్మి
విడిచితే ప్రాణేశ యెడపక నీకుర్వి
నురుకీర్తిఁ గలిగించి యున్నకరుణ
యడచితే కాంత నీయెడద నెల్లందులఁ
బాయకుండిన మోహబంధనంబు
నిరసించితే మనోహర యెన్నఁడైన మా
నని నీదు దీనావనప్రతిజ్ఞ

తే. గీ. సొంపు మాటాడవేల తలంపవేల
పెంపలరఁ జూడవేల మన్నింపవేల
తెంపుఁ దలఁగింపవేల యాలింపవేల
పెంపవేల నీచానఁ బాలింపవేల.—

(అనుబంధము-30.)

హా! నాథా! ఇంకను నీకుఁ గరుణగలుగదా? నిత్యసత్యవ్రతుఁడవైన నీవే సత్య భంగమునకోర్చుకొన్న నేనేమనుదానను?

భూదేవీ! నీవైన నను మ్రింగి నాదుఃఖమున కంతమొనర్పరాదా? గహనమృగములారా! నను దెగఁజూడరాదా? ఇంద్రాదిదేవతలారా! స్వయంవరమునాఁడు కరుణించి నాకు వరములొసంగితిరే-మీరైన మానలుని జూపరాదా?

(ఒకపాము దమయంతింబట్టును).

హా! ప్రాణేశా! ఆహారాశచే నన్నీసర్పము మ్రింగఁజొచ్చెను. నీకు రక్షించుట కిది గదా సమయము?

వీరనా—(ఇంతవఱకుఁ బ్రక్కనుండి దమయంతిఁ జూచి మెచ్చుకొనుచుండి) ఆహా! ఈ కలికిని బాము పట్టియున్నది దీనియుక్కడంచెదను. (అని ఖడ్గమునఁ బామును జంపును).

దమ—అయ్యా! నాపాలి దైవమువలెవచ్చి నన్నురక్షించిన నీవెవ్వరు?

వీర—అమ్మ మిన్నా! ఈపొలమునకెల్లయేలికను. నాపేరు వీరనాయకుఁడు.



దమ—వీరనాయకా! నేను నలునిభార్యను. దమయంతియనుదానను. నానాథుఁడీయడవి నెందో పోయి కానరాకున్నాఁడు. పాముచేఁ బట్టువడి ప్రాణములు విడువనున్న నన్నురక్షించి పుణ్యము గట్టుకొంటివి. నీకు నేనే ముపకారము చేయఁగలను?

వీర—దమయంతీ! నేనేమిచేసియున్నాను? నన్నంతియేల యగ్గించెదవు? నాయింటికిఁ బోదము రమ్ము.

దమ—అయ్యా? నాప్రాణవిభుని యిక్కువ తెలియువఱకు నేనొకచోటనిలుచుదానఁ గాను. నన్ను క్షమింపుము.

వీర—కలికీ! కనికరమింతైనలేక నడిపొలాన నినువెలార్చిన కటికివాఁడేటిమగఁడు? వానివెదకుచు నెందుఁబోయెదవు?

దమ—అయ్యా! నీవజ్ఞుఁడవైనందున నెఱుకలేనితనమున నాడినమాటల నే సెగ్గుగాఁ గొనను. ఇట్టిమాట లికనాడకుము.

వీర—చిలుకలకొలికీ! నీవెంతన్నను గాదనను-దాఁపనేటికి? నీయందు నాకుఁ జెఱకువింటివజీరు మరులు వొడమినది.

దమ—(చెవులుమూసికొని "హరిహరి" ! యని) తండ్రీ! ఈమాటలు నీకుఁదగునా? ప్రాణదాతవైనందున నోర్చితిఁగాక యింకొకఁడిట్లాడి బ్రదికిపోఁగలఁడా?

ఉ. కొండలపాటుఁదెచ్చు కడుకొంటెతనంబుగదన్న యన్న యెం
దెందుఁ దలంపఁగూడునొకొ యిట్టిదె కోరిక ప్రాణదాత వై
నందునఁ దండ్రివీవగుదు వారయ నాకటు రాజపత్ని నై
నందున నీకుఁ దల్లినిగదా తలపోయఁగ నింతద్రోహమే.—

నీవు నాకుఁదండ్రివి నే నీకుఁదల్లిని. ఈ దుశ్చరితము చెల్లునా?

వీర—దమయంతీ! నీమాటలు నాకుఁదెలియవు. నీవు నాకుఁదల్లివైన నే నీకుఁదండ్రినిగాఁ జాలను-నేనీకుఁదండ్రినైన నీవునాకుఁదల్లివిగాఁజాలవు. ఇదియెన్నటికిని సరిపడనివావి. తొలుత నీపైమరులు గలిగియే నిన్ను బాముపలనఁదప్పించితి. ఊరక నీకౌఁగిలియిమ్ము.

దమ—తండ్రీ! నిన్ను వేడికొందును చెడక యూరకపొమ్ము.

† రాగము - నవరోజు - తాళము - ఆది.

వీర— మొగంబులనురే - వగల్దిరిగికడు - దిగుల్పడఁగనేలా—
యిటువలె-వగంగుందనేలా—
బలానన్నునిటు-వెలార్చెదవెయా-పొలానకెకిమీఁద—
కైకొను నలాము చెలిప్రోడ.

† పీఠికలోఁ జెప్పఁబడినతెలుఁగున నియ్యెడ నీపాట యుక్లే దయించఁబడిరెు.

కటా త్రోచెదవె-తటాలుమనిన-న్నిఁటేలదయమంతీ—
సొగసుల-మిటారిమేల్బంతీ—
జోహారునినుబొం-దిహాళిఁ దేలక-యహోవిడువఁజాల—
మరుములి-కిహోవడికేఁదాళ.—

(అనిచేయిపట్టఁబోవును).

దమ—(దూరముపోయి) దురాత్మా! నీయుపకారముఁ దలఁచి యెంతక్షమించినను నీ దుర్బుద్ధిమానవా?

వీర—దమయంతీ! ఈపాలాన నన్నుమించిన యొడయఁడుగలుగఁడు-నీకుమదిగలిగింపఁ గోరి యింతతడవు నీకు మ్రొక్కితింగాక కావలెనన్న నిప్పుడే నిన్నెత్తికొనిపోయిన నాకొకఁడడ్డము రాఁగలఁడా? నలుఁడుగిలుఁడు నాతోరూపున సరిరాఁగలఁడా.

ఉ. ఎంచఁగరాని చక్కఁదన మేచిన వేడుకకాఁడటంచు మా
చెంచువలంతి చేడియలు చెచ్చెఱ నాచిఱునవ్వు నొందఁగా
లంచములిచ్చి పైఁబడి నలాములొనర్చెద రట్టివాని మ్రొ
క్కించితె గట్టివాయి కలికీ నిను నేమనువాఁడఁ జెప్పుమా.

నీకొక్కరగడియ తడవిచ్చెదను. నీవైకనికరించి కౌఁగిలింతువో కన్నే పైఁబడునంత పనికిరేఁపుదువో యెఱుఁగగోరెదను. నేనిక్కడనే యుందును.

(కూరుచుండును).

దమ—హరిహరీ! దుష్కర్మా!

ఉ. ఓనలసార్వభౌమ మహిమోన్నత చారుశరీరకామ యీ
కానవసీమ నీకరణిఁ గాఁతీయ వెట్టెడు నీకిరాతుఁ డ
య్యో నడుకానడించిచని యూరక యుండఁగఁ బాడియౌనె రా
వే ననుఁగావవే పరమభీతను దీనఁ దలంచి ప్రోవవే.

సీ. ఇదిగదా సమయ మార్తదశావగాహిత
ప్రాణసతీ పరిత్రాణమునకు
నిదిగదాతటి దురాకృతఘూర్ణిత పతివ్ర
తారక్షణ మహోపకారమునకు
నిదిగదా వేళ ధీరదయాభిరంజిత
శరణాగతత్రాస హరణమునకు
నిదిగదా యదను దుర్మదకంపితకిరాత
పరిపంథినిర్యాణ కరణమునకు



తే. గీ. హా కృపాలోక మామక ప్రాణనాథ
హా సదాధర్మపాలనాత్యంతలోల
హా నిరంతర శరణాగతావనాఢ్య
హా కరకృపాణ ధూపాయితారినిచయ.—

వీర—దమయంతీ! అరగడియలో సగముపొద్దైనది. నేనన్నమాట తప్పువాఁడఁగాను.

దమ—(కోపమున) దురాత్మా! అయిన నీ దుశ్చరితము మానవా? నాయత్నము లేదు. నీకాలము సమీపించినట్లున్నది.

తే. గీ. మానసకేవేళ నాదగు ప్రాణవిభుని
నలుని దైవంబుగా నాత్మఁ దలఁతునేని
యచలభక్తిఁ బతివ్రత నగుదునేని—

వీర—గడియయయినారొ, ఇఁకమానను (అని పైఁబడును).

దమ— యీకిరాతుఁడు దగ్ధుఁడౌఁగాక యిందు.

(వీరనాయకుఁడు దగ్ధుఁడగును - యవనికపడును).

---

## పంచమరంగము: అయోధ్యలో ఋతుపర్ణునాస్థానము.

---

[ప్రవేశము: ఋతుపర్ణుఁడు, మంత్రి, వార్ష్ణేయుఁడు].

ఋతు—మంత్రీ! ఏఁపురానున్నయతులకుఁ జక్కని విడిది చేయించియున్నావా?

మంత్రి—ఆజ్ఞప్రకారము చేయించియున్నాను.

ఋతు—బ్రాహ్మణసంతర్పణమున కెట్టియేర్పాటు లొనర్పఁబడినవి?

మంత్రి—నిన్నటికే పదివేలబ్రాహ్మణ్యమయినది. నేఁడింకను నెక్కువగారావచ్చును. అన్ని యేర్పాటులును జేసియున్నాను.

ఋతు—వార్ష్ణేయా! నీ ముఖమున నింకను దీనభావము వదలలేదు. ఎన్నాళ్లు దుఃఖించిన నేమిఫలము? నళరాజునకు నీవంతరంగమిత్రుఁడవై సారథివై యుండిన వాఁడవగుట నాకులపడుట స్వాభావికమే-కాని నలునియొద్ద నెట్లో నీ కిక్కడను నట్లే యని యెఱుంగుము.

వార్ష్ణే—అయ్యో! ఆనళరాజువేఱె యీ ఋతుపర్ణరాజు వేఱె యని యెంచినవాఁడఁ గాను-అక్కడికంటె నాకిక్కడనే యాదరణమెక్కువ-అయిన,

శా. ఆ రాజన్యుఁడు జూదమాడి తనరాజ్యంబోడిపోవంగ, నా
న్నారీరత్నము పుట్టినింటికి సుతు న్నావెంటఁ బంపంగ ని
ష్కారాకారుఁడు దారినంతయు నయోమాయమ్మ రాదంచుఁ దాఁ
గారుణ్యం బొదవంగ నేడ్చువగ యింక న్మానసం బేర్చెడున్.—

ఇది నే నెట్లు మఱవఁగలను?

ఋతు—వార్ష్ణేయా! ఊరడిల్లుము-ఇది యంతయు దైవకృతము.

మ. అతిమాత్రంబుగ దుఃఖము న్సుఖము దైవాధీనతం గర్మసం
గతిమై బ్రాణికిఁ గల్గుగా యిపుడు దుఃఖప్రాప్తిమల్లాడె శ్రీ
యుతుఁ డాభూరమణుండు వెండియును నేడో తేఁపో యా కాలదు
స్థితిదీఱంగను సర్వసౌఖ్యముల నిశ్చింతాత్మతం జెందఁడే.

(అనుబంధము-31.)

దీనికై చింతింపఁదొడఁగిన మేరగలదా!

[ప్రవేశము : సేవకుఁడు].

సేవ—ప్రభుచంద్రమా! ద్వారమున నెవరో వచ్చి కాచియున్నారు.
ఋతు—రానిమ్ము.

[ప్రవేశము : నలుఁడు, (వికృతవేషమున)].

నళ—ఋతుపర్ణరాజర్షి కంఠీరవా! అభివాదనము.
ఋతు—(స్వ)

క. భూరియశుండుగ నాకీ
వీరుఁడు కనిపించెనెందు వెలయునెయిటులా
కారము ఘోరము తేజ మ
పారమితం డెవ్వఁడౌనొ పరికింపంగన్.—

(ప్ర:) మానవశ్రేష్ఠా! నీవెవ్వరవు?

నళ—రాజమార్తాండా! నేను బాచకవిద్యలో నైపుణ్యము గలవాఁడను, అశ్వశిక్ష సయితము కొంతయెఱుఁగుదును. ఏరాజునొద్దనున్నను మనసునకిక్కునట్లు వంట చేయనేర్తును.
ఋతు—అయ్యా! నీవేరాజునొద్దనుండినాఁడవు? నిక్కము వచింపుము.
నళ—రాజేంద్రా! నిక్కమే వచించు మానవుఁ డెవ్వఁడుగలఁడు? అదికాక కాలము చాలని వేళ సత్యమాడినను విపరీతమైతోఁచును-నలరాజునొద్ద—



ఋతు—ఆహా! నలరాజునొద్దనున్నవారందఱు నాకుఁ బరమాప్తులు. అయ్యా! నీపేరేమి!
నళ—దేవా! నాయిప్పటిపేరు బాహుకుఁడందురు.
ఋతు—"ఇప్పటిపేర" నెదవేల ?
బాహు—ఆ రాజన్యుఁడు నాయెడ నభేదప్రతిపత్తిగలవాఁడై తనకోరినపేరు నాకిచ్చియుండెను. ఇప్పుడు దానిఁ దలంపనేటికి!

ఋతు—బాహుకా! నీవాతనియూడిగ మెప్పుడువిడిచితివి?
బాహు—ఆరాజునకు రాజ్యచ్యుతియగు దుష్ప్రాప్తికలిమి నాకు నట్టిప్రాప్తియే లభించుటఁ జేసివచ్చితి. నేబహుదినములుండువాఁడఁగాను. కొన్నినాళ్ళలోనే దాస్యము క్షుఁడనైనను దేహము క్షుఁడనైనను గావలయును.

ఉ. సంతతసత్కృపాగుణవిశాలుఁడు శ్రీఋతుపర్ణమేదినీ
కాంతుఁడు వాశ్రితవ్రజవికారవిదూరుఁడు నాదిగంతవి
శ్రాంతముగాఁ గనీయశము చాలమిగల్గినయిట్టివేళనీ
చెంతవసించియూడిగము సేయఁగవచ్చితినాదరింపవే.

ఋతు—బాహుకా! ఇంత ప్రార్థింపవలెనా? అవశ్యము నీకిష్టమువచ్చిన కార్యమున నుండుము. వార్ష్ణేయా, నీకితఁడొకసహచరుఁడౌదవె నీవితని నెఱుఁగుదువా? (బాహుకుఁడు వార్ష్ణేయుని సంభ్రమమున వార్ష్ణేయుఁడు బాహుకుని సంశయసూచకంబుగను జూచెదరు.)
బాహు—వార్ష్ణేయా! నన్నెఱుఁగవా? నీతోదమయంతిదేవి యింద్రసేనుని విదర్భకుఁ బంపునపుడు నేనందుండలేదా? నీవు నలరాజుతో నొకనాఁడు విదేహదేశపు బ్రాహ్మణునివృత్తాంతము మిక్కిలి వినోదముగాఁ జెప్పునపుడు నవ్వుచుండినవారలలో నేనొకఁడఁగదా?

మ. అమలస్వాంతుఁడు నీదు తమ్ముఁడు జయంతాఖ్యుండు నామిత్రుఁడౌఁ
గమలోల్లాసినిగాదె నీసతి కడుంగా రాముచే నాబిడ్డన్
దమయంతీసతి గూర్చెఁగాదె యెపుడున్నన్నున్నీవాలోకింపవో
భ్రమచేకూడెనొ కాక నన్మఱచితో వార్ష్ణేయ చోద్యంబగున్.—

వార్ష్ణే—రాజేంద్రా! నేనీబాహుకునిజూచినజ్ఞాపకములేదు. అయిన ధ్వనిమాత్ర మెక్కడనో విన్నట్లున్నది. ఆరాజునొద్ద నెందఱో సేవకులు, అందులో వంటలవారినేల యంతగాఁ జూచియుందును?

బాహు—ఇదేలవార్ష్ణేయా? ఆదమయంతియు నప్పుడప్పుడు నావృత్తాంతము చెప్పుచుండలేదా?

వార్ష్ణే—బాహుకా! కొంచెము యోచించిమాటలాడుము. ఇన్నిదినములు రాజనివాసము నీవుఁగలిగియున్నను నాగరికములబడినట్లుతోఁపదు. పతివ్రతాతిలకమై రాజాదేవేరియైయున్న యాసతీమణి "దమయంతి" యనిపిలిచెదవు. దమయంతీదేవి యనవలయు.

బాహు—వార్ష్ణేయా! క్షమింపుము. వంటలవానికి నాకేటినాగరికము? అదిగాక యానళరాజునకు నాయెడనున్న యభేదగుణమున నాతనియెదుటను నాతనిదేవిని నేనట్లనే పిలుచుచుంటి. కావున నట్లేజ్ఞాపకము.

ఋతు—బాహుకా! నీవు నళరాజునొద్ద నెన్నాళ్ళుంటివి?

బాహు—రాజేంద్రా! పుట్టినది మొదలొక్కని యారాజున్న నెడఁబాయకుంటి. అది యిప్పుడు తలపోయనేల?

కం. అనృతంబుగాని దంతయు
వినుపించితి నాదుసేవ ప్రియమైనను న
న్ననిచికొనుము నీడెందం
బున ననుమానించితేని పోయెద నధిపా.

ఋతు—అయ్యో! బాహుకా! వేడుకమైనడిగితిఁగాక నాకనుమానమా? నళరాజు పేరుచెప్పినఁజాలునే. ఆనళరాజే నాయెదుట సాక్షాత్కరించిన ట్లెంచెదను.

సేవ—రాజేంద్రా! దేవపూజవేళ యయినది.

ఋతు—మంత్రీ! మనమింకఁబోదము. (నిష్క్రమింతురు.)

తృతీయాంకము సమాప్తము.

---

శ్రీ

# చిత్రనళీయనాటకము.

## తురీయాంకము.



ప్రథమరంగము - అడవిలో మునులయాశ్రమము.

[ప్రవేశము: బృహదశ్వుఁడనుఋషియు మఱికొందఱును.]

ఋషులు (మంత్రపఠనముచేయుచు, ఆహుతులవ్రేల్చుచుండ.)

తరువాత - ప్రవేశము: దమయంతి-(దూరమున.)

వసుధావృత్తములు.

(అనుబంధము - 32.)

దమ—† కరుణా భరణా ధరణీరమణా
తరమేవిధమం బరమాదరణన్.
మృగపాళులలో దిగులొందఁగనీ
వగఁజేయఁగనీ కగునేసుగుణా.
అటవీస్థలిలో నిటుపాసినసం
కటమొందుచునే నెటకేగుదునో.

(ఋషులనుజూచి ఆహా! ఇందెవ్వరో పూజనీయులగుఋషిసత్తము లున్నట్టున్నది. పోయి దర్శించుకొనియెదను. (పోయి)

క. ఓఋషిచంద్రపతంసము
లారా సదయాంతరంగులారా నియమో
దారులరగుమీకు నమ
స్కారము లొనరించెదం దగం గైకొనుఁడీ.

---

† ఇది తోలుత, తోడిరాగము, అటతాళముగల పాటగారచియింపఁబడిరి.

ఋషులు—"దీర్ఘసుమంగలీభవ" (అనియాశీర్వదింతురు.)

౧ ఋ—అవ్వా! నీ వెవ్వర విక్కడి కేలవచ్చితివి?

౨ ఋ—అమ్మా! నీవురాజుదేవేరివిగానున్నావే—నీకీదురవస్థయేలవచ్చె?

౩ ఋ—అమ్మాయీ? నిర్మానుష్యమయిన యీయరణ్యము నెట్లు ప్రవేశించితివి?

బృహ—క. లలనామణి నీచరితము
తెలియంబడె మాకుదివ్యదృష్టి న్నీవా
నలురాణివి దమయంతివి
పొలుపారఁగ భీమరాజ పుత్త్రివి కావే.

క. ఘనవేణి కలి ప్రేరణ
మనుజవిభుఁడు జ్ఞాతిరచిత మాయాద్యూతం
బున రాజ్యమోడి కానల
నినుబాసి చనంగ నతని నెమకెదు కాదే.

దమ—(నమస్కరించి)

చ. గురుకరుణావిలాస మునికుంజరమీకుఁ దపోబలంబున
న్గరబదరాభమై తనరుఁ గానఁగ భూతభవిష్య దర్థముల్
ధరణిని మీ కెఱుంగని యుదంతములున్నవె మిమ్ముఁ జూడను
స్తరకలుషంబు లాఱెఁ గడు ధన్యత మీఱె నభీష్టసిద్ధిగా.—

అనుగ్రహించి నావిన్నపమాలకింప వేడుదానను.

మ. ఒకనాఁడు న్ననుబాయఁడెన్నఁడును గోపోద్యోగముం గానఁడ
త్యకలంకంబగు కూరిమిస్మనుచు నా ప్రాణేశుఁ డేమాయయో
వృకశార్దూల ఘనాటవిన్విడిచి తానెచ్చోటికిం బోయెనో
యకటా నావిభు నిక్కవద్దెలిపి యత్యంతంబు రక్షింపరే.—

బృహ—క. దైవాజ్ఞ యనుల్లంఘ్యము
యోవార్తలనెంత తెలిసి యున్ననొరులకా
భావము వివరింపఁగరా
దీవిధిమా సమయమొనరు నెఱుఁగవె తనయా.—

దమ—తాపసోత్తమా! నేనావిషయము నెఱుఁగనిదానఁగాను. వియోగదుఃఖము సహింపఁజాలక యడిగితిని. అయిన మఱియొక్కటి వేడవచ్చునా?



బృహ—అదియేమి?

దమ—

ఉ. ఆఁకటఁజావనుంటిని ఘనాటవినయ్యెడనన్ను బట్టిన
ర్వీకరమంతినుండియును వింతవిధంబుగనంత మొందె నా
యాఁకలియింకఁజచ్చు తెఱఁ గారయమీర లెఱుంగుమందుల౯
ప్రాకులలోఁజావ నొకమందు రహించిననాకొసంగరే.—

బృహ—పంచపాది.

చ. హరిహరి! (చెవులుమూసికొని.)
యెంతమాటతనయా కనుఁగొంటిమినీచరిత్రము
య్యురగవిషంబులో నమృతయోగముగల్గి సురేంద్రునాజ్ఞనీ
నిరవధికక్షుధ౯ దృషను నీకునధీనముగా నొనర్చెనీ
వరుఁడును నిట్లు పాముగఁ బవ న్దనరూపము మాఱె.—.

దమ— అయ్యయో

(అని మూర్ఛిల్లును.)

౧ ఋషి—పరువడిఁ జెప్పసాగితివి భ్రాంతివహించితివే బృహద్వ్రతా.—

బృహ—ఈయబలచావ నొక్కమందిమ్మన్నఁ గరుణజనింప విస్మృతుఁడనై వచించితి.

(దమయంతియొద్దకువచ్చి అమ్మాయీ యని పిలుచును.)

దమ—(లేచి) హానాథా!—

ఋషులు—'దీర్ఘసుమంగలీభవ' (అని యంతర్ధానము నొందెదరు.)

(ముందు యవనికపడును).

—•—

## ద్వితీయరంగము - అడవి.

---

[ప్రవేశము : కొందఱు - సార్థవాహులు.]

(అనుబంధము - 33.)

౧ సార్థ—భాశేసురా? సాయంకాలమయినది-బిడారముదించి పండుకొందమా?
భాశే—అవును శుచియేమనునో.
౧ సార్థ—శుచీ-ముందుపోయిన బాగుకాదు ఇక్కడనే చెఱువున్నది - నీళ్ళున్నవి.
శుచి—ఇంకను ప్రొద్దున్నదే?
౧ సార్థ—ముందు నీళ్ళులేవే-ఆమడవఱకు?
శుచి—అట్లనేకాని-విడువుఁడు.

[ప్రవేశము : దమయంతి - (దూరమున.)]

దమ— సీ. నలువారు నంచ తొయ్యలులార యలులార
పులులార చూడరే నలమహీశుఁ
దతిగాత్ర శబర సుందరులార దరులార
తరులార చూడరే ధరణివిభుని
దనరారుచిలుక జవ్వనులార వనులార
మునులార కానరే దినపతేజు
ఘనబలోద్దామసూకరులార కరులార
హరులార కానరే యవనిధవుని
ఆ, వె. సురచిరాంగునెందుఁ జూడరేయలఘుభృం
గారులార దారులార శారు
లార కీరులార భీరులార చలచ్చ
మూరులార వనమయూరులార.

(అనుబంధము - 34.)

సార్థవాహులు (అందఱు దమయంతింజూచి భయమందెదరు.)

* (పాట - నాథనామక్రియ, రాగము - అటతాళము)

అందఱు— అబ్బబ్బాయిదియేమోరూపు - మమ్ము
తబ్బిబ్బుపడఁజేసి ధైర్యముఁ బాపు.

---

* ఇది యీనాటకమున నట్లనేనిలిపిన మఱియొక్క పాట.



౧ సార్థ—పగలేచీఁకటి జేయుబూచి-గుండె
దిగులుపుట్టించెడుగొప్పపిశాచి.

౨ సార్థ—అడవిదయ్యమైయుండవచ్చు-దీని
బడియచేఁగొట్టనఁబలుకరచచ్చు.

౩ సార్థ—చాలురమీయిల్లుగాల-ఇది
పోలేరమ్మకుఁబుట్టినబాల.

౪ సార్థ—కాదురమీపసికూల-వట్టి
వాదులేటికినిదివనలక్ష్మిచాల.

అందఱు—అక్కా! అవ్వా! తల్లీ! అమ్మా! - మా
దిక్కురాకుము నీకుమ్రొక్కుమాయమ్మా.

శుచి—ఏటికిరామీరిట్లుచేసెదరు? అవ్వా! నీ వెవ్వరవు! ఈయరణ్యమునఁ నొంటిరిగా నేల యున్నావు!
దమ—అయ్యా! నేను నలునిభార్యను. దమయంతి యనుదానను, పతి నన్నుబాసి పోయిన నీయరణ్యమున గత్యంతరముగానక తిరుగుచున్నాను.
శుచి—అమ్మా! నలుఁడెవరు? నిషధదేశమురాజా?
దమ—అతఁడే.
శుచి—అయ్యో! అతఁడురాజ్యచ్యుతుఁడైనాఁడని విని మిక్కిలిదుఃఖపడితిని. నేను వ్యాపారార్థినై నిషధకువచ్చియున్నపు డాతని గుణగణములు వినియుంటిని. నీవు మాతల్లివిసుమా.
దమ—మీరెక్కడికిఁ బోయెదరు?
శుచి—ఈ రాత్రియిందేయుండి యుదయమునఁ జేదిపురమునకుఁ బోయెదము.
దమ—నేనును మీతోరావచ్చునా?
శుచి—అడుగవలెనా? భాశేసురా! ఈయమ్మకొకప్రదేశమునఁ బడకవేసియిమ్ము.
దమ—అయ్యా! నాకుఁ బడకయేమియువలదు - ఈ నేలపైననే శయనించెదను.
శుచి—నీ యిష్టము.

(సార్థవాహులు శయనింతురు.)

దమ—హా! దైవమా! నేనేమిచేయుదును. ఎంతమనసునకుధైర్యము తెచ్చుకొన్నను నూఱటకలుగదు.

మ. యతిచూడామణినాశ్రొగిం దెలిపె ఘోరారణ్యమందుండమ
త్పతికాశోవరదష్టుఁడై తొలఁగె రూపంబంచునావార్తకు
ద్ధతిమూర్ఛిల్లితినంతలోనఋషి యంతర్ధానముంజెందెనం
గతియామీఁదమ తేమటంచు నడుగంగా లేదెహా దైవమా.—

శా. మన్నాథుండు భుజంగమంబడవిలో మాకొన్న కాలంబున
న్నన్నేలాగునఁ జీఱెనో విసికెనో నట్టాడెనో దూరెనో
యెన్నాళ్ళాయెనొ యేమిపాటుపడెనో యేమాయెనో యాతఁడెం
దున్నాఁడో యటుకాకయియ్యవని లేఁడో ప్రాప్తియెట్లున్నదో.—

తే, గీ. ఐననూఱటగలిగె నమ్మౌనులనిన
పలుకుచందముదలఁప "రూపంబుమాత్ర
నహిగఱవ" నంచువచియించిరంతె కాదె
యొందువిధమైననది చెప్పకుందువారె.

ఆ, వె. తెలియనదియుఁగాక "దీర్ఘసుమంగలీ
భవ" యటంచు నన్ను బలుకలేదె
ఋషులపలుకుదప్పునే ప్రాణవంతుఁడై
యున్నవాఁడటంచు నెన్ను దాన.

ఉ. ఎక్కడనున్నవాఁడొ హృదయేశుఁడు దాననయంబుఁదాల్చునా
నిక్కపురూపమున్న నవనీస్థలినంతటఁ గ్రుమ్మరింపఁగా
నిక్కువచిక్కుఁగానియిటు లెవ్వరుగాననిరూపమున్ననే
దిక్కుననావిభున్నెమకఁ దీఱెడునో గుఱుతింపఁగూడునో.

తే, గీ. మాయురేనాడు పూర్వజన్మమున నెట్టి
దంపతులఁ బాపి వారు దుఃఖంపుచుండ
నవ్వుచుంటినొ యాపాప మివ్విధమున
నడరిపొక్కింపఁజాలదే విడువఁగలదె.
(ఏనుఁగులు ప్రవేశించి సార్థవాహులఁద్రొక్కును.
వారఱచి ఈల్గుదురు. కొందరు పఱువెత్తుదురు.)

దమ—(ఏనుఁగుల కెదురు పోయి.)



ఉ. వావిరిమందభాగ్యులకుఁ బ్రాపగువారికిఁ జేటుదప్పదర
భావముదప్పకుండఁగఁ గృపాగుణమెంచక సార్థవాహులం
బావనభంగినన్ను గరిమంబునఁ గావఁగనున్నవారినే
లావధియింపఁ గుంజరములార ననుంగరుణించిచంపరే.

(పునః ప్రవేశము : శుచి.]

శుచి—అమ్మా! నీవు బ్రదికియున్నావా?

దమ— కం. మానకవిధి సంకటములఁ
బూనియనుభవింప బ్రదుకుపొమ్మంచురహిన్
నానొసట వ్రాసియుండఁగ
నేనెట్లుఁ జావఁగలవణిగ్వరవింటే.

శుచి—అమ్మా! దుఃఖపడకుము. జలాపేక్షచే నీయేనుఁగులేతెంచి వీరిఁ ద్రొక్కిచంపె నానయత్నమేమున్నది? కొంచెముదూరముపోయియుండి తెల్లవాఱినపిదపఁ జేదిపురమునకుఁ బోదము. (నిష్క్రమింతురు.)

---

తృతీయరంగము - చేదిపురమున విపులాదేవియంతిపురము.

---

[ప్రవేశము : విపుల - దాసి (గవాక్షమునొద్ద)].

విపుల—దాసీ! ఇదేమే! మనపౌరులందఱు మిద్దెలెక్కి మేడలెక్కి యిట్లుగుంపులై చూచుచున్నారు.

దాసి—అమ్మా! మనవ్యాగశాలలోనున్న గండకము తప్పించుకొని మదమెత్తి కట్టువడకున్నది. దాని జూచుచున్నారు.

విపుల—అవునే-ఎట్లు పోవుచున్నది యావ్యాగముంజూచితివా?

దాసి—అయ్యో! చచ్చె! చచ్చె! చచ్చె!

విపుల—ఎవ్వరిపనితియో యెందఱిచినను వినక ఇష్టమృగమున కెదురుగాఁ బోవుచున్నది. అయ్యో ! అయ్యో !

దాసి—ఆమెకుఁ జెవుడేమో ?

విపుల—ఆహా ? ఏ మాశ్చర్యము ! ఆమెనుజూచి యామృగమే తొలఁగిపోయెను. ఇది దేవవనిత కాఁబోలు-ఆమె నిక్కడికిఁ బిలిచికొనిరమ్ము.

(కిటికీ మూయఁబడి యవనికయెత్తఁబడును.) విపుల కూర్చుండియుండును.

ప్రవేశము : దాసి - దమయంతి.

దాసి—విపులాదేవీ ! నీయాజ్ఞ నీమెను బిలుచుకొనివచ్చితి.

విపుల—తరుణీ ! నీ వెవ్వతెవు ? మదమెత్తి యెట్టివారి నైనఁ జీల్చివైచు నాఖడ్గి నిన్నుగని తొలఁగిపోవుట చిత్రముకదా ?

దమ— తే, గీ. అమ్మరో దైవవిధియలంఘ్యమ్ము సుమ్ము
కాలముదరింపరాదు నిక్కంబు సుమ్ము
చావువలెనన్న వచ్చునే రావలదన
విడుచునే కాలగతిఁ జేసి పొడముచుండు.

విపుల— ఆ, వె. మగువ యిట్టు లేల మాటలాడెదవు నీ
చరిత మేమి మాకు వెఱఁగు నించె
మనుసపేక్షమాని మరణమైనను నీవు
కడఁగి కోరునంత కార్యమేమి.

దమ—ఆ, వె. భాగధేయమగుచుఁ బ్రాణమై దైవమై
పరఁగియున్న విభుఁడు వాసిపోవ
పగలమిగులఁ బొగిలి మగనిఁ గానకయున్న
పడఁతికు నికి యేల ప్రాణ మేల.—

విపుల—అయ్యో! అట్లనా ? వనితా ! నీయెడ నాకు మిక్కిలి కరుణగలిగినది. నీ విచ్చటనే యుండుము-నీపతిని నేవెదకింతును.

దమ— చ. ఇరవుగగట్టువాలు పనియింతయెఱుంగుదుఁ జిందనాదులం
బరఁగనలందఁ జాలుదు సుమంబులఁ గట్టుదుఁ గాని యెందు నేఁ
బురుషులఁ జూడనోప వెలిఁ బోవఁగఁ జాల వ్రతంబు సల్పుదు
న్నిరతమునమ్మ యేకరణి నీమది కెక్కమెలంగఁ జాలుదున్.—

విపుల—తెలివా! నీయిష్టమునకువచ్చినపని చేయుదువఁటలెమ్ము. నీవు పనిచేయకున్నను మానె. నాయొద్దనే యుండుము. (నిష్క్రమింతురు.)



## తురీయరంగము - అడవిలోనొక సత్రము.

పర్ణాదుఁడను బ్రాహ్మణుఁ డందు శయనించియుండును.

[ప్రవేశము : సుదేవుఁడు.]

సుదే—ఉ. క్రమ్మరి పల్లెటిల్లి తిని బ్రొద్దున నుండియు భోజనంబు లే
కిమ్మహిఁ తాటవిన్వొలికి నేఁగెడు దారియెఱుంగఁ గందమూ
లమ్ములు గానియుంచిత ఫలమ్ములు గానితుదన్ విశుద్ధనీ
రమ్ములు గాని లేవతిమిరమ్ములు నిండఁగఁ బాతె నెల్లెడన్.—

(అనుబంధము-3౫.)

ఇది యేమొ గృహమున్నట్లున్నది. పోయి చూచెదఁ గాక - (వచ్చి) అయ్యా ! చీఁకటియయినందువఁ గన్నులు తెలియవు. ఎవ్వరిచ్చటఁ బండుకొని యుండునది ?

పర్ణా—ఇక్కడఁ జోటుదొరకదు.

సుదే—అయ్యో ! దినమంతయు నాహారములేక నడువఁజాలకున్నాను. పండుకొనను జోటుమాత్ర మిచ్చినఁ జాలును.

పర్ణా—లేదు - లేదు - ఇంకొకచోటికిఁ బొమ్ము.

సుదే—శ్రాంతుఁడైన బ్రాహ్మణున కింతజోటిచ్చినఁ బాపము వచ్చునా ?

పర్ణా—పాపమురానీ-పుణ్యమురానీ-చోటులేదు.

సుదే—ఇంతచోటున్నట్టున్నదే-వెంటఁగట్టుకొని పోయెదవా ?

పర్ణా—అవును-వెంటనే కట్టుకొనిపోయెదను.

సుదే—అయ్యో ! బ్రాహ్మణుఁడ నే.

పర్ణా—ఇక్కడ బ్రాహ్మణుఁడు కానివాఁ డెవఁడు ?

సుదే—నీవును బ్రాహ్మణుఁడవా ? అట్లుండి యాఁకలిచేఁ బడియున్న బ్రాహ్మణున కీమాట చెప్పెదువా ?

పర్ణా—ఇక్కడ నాఁకలిచేఁ జావనివాఁ డెవఁడు ; నీకుదయమునుండి బువ్వకులేకున్న నాకు నిన్నరాత్రినుండిలేదు.

సుదే—అయ్యో ! నీకేటికి భోజనములేదు ? నీవెవరవు ?

పర్ణా—ఈ కథ నీకేటికి ? నాతో సంబంధము చేసెదవా ? పో పొమ్ము.

సుదే—అయ్యో ! ఈ యంధకారమున నెచ్చటికిఁ బోవఁగలను ? నా ప్రాణములు నిలుచు నట్టులేదే.

పర్ణా—ఆ ! హా ! నిలువనుండఁ నిచ్చటమాత్రము వానివిడువవను - పనివారెవ్వరులేరు.

సుదే— ఉ. కూళవుదుర్మదాంధుఁడవు క్రూరుఁడవజ్ఞుఁడ వార్తకర్మచం
డాలుఁడవీవుపాపుఁడవె డక్కితివిందునలాఁతి చోటనో
బాలిశ నేఁడు భీమనరపాలకుఁ డేలువిదర్భమైననీ
నాలుకవ్రీలకున్న పరిణామముగల్గెనె పేరునిల్పెనే.

పర్ణా—(స్వ) భీమరాజు! విదర్భ! (లేచి) (ప్ర) అయ్యా! రమ్ము - కూర్చుండుము. నాదియు విదర్భయే.

సుదే—కల్ల. మావిదర్భలో నీయట్టి బ్రాహ్మణ చండాలుఁడుండునా?

పర్ణా—(స్వ) ధ్వనియట్లేయున్నది. సుదేవా!

సుదే—(యోచించును).

పర్ణా—సుదేవా!

సుదే—పర్ణాదా!

పర్ణా—అయ్యో! ఎంతతప్పుచేసితిని - (ఆలింగన మొనర్చుకొనును.)

పంచచామరము.

ప్రదారుణక్షుధామహోగ్రభావమేచిసారథీ
విదారణంబొనర్పఁగా వివేకమెంచలేకని
న్నుదేవనిష్ఠురోక్తులాడి నొవ్వఁజేయుటెంతయు
న్మదిందలంపకోర్చియుందు నన్నునాదరింపవే.—

సుదే—పర్ణాదా! నీవిట్లడుగుకొనవలెనా? నిన్నుచూచినంత నేనాయాయాసమంతయుఁ దీఱె. క్షమాపణములట్లుండనీ-నీకథయేమి? నళదమయంతులలో నెవరైనఁ జిక్కిరా?

పర్ణా—సుదేవా? దక్షిణదేశమంతయుఁ జుట్టివచ్చితి-ఎందును గాననైతి.

సుదే—అయ్యో! ఇంక భీమరాజెట్లుబ్రదుకఁగలఁడు?

పర్ణా—అయిన నీయన్వేషణకార్యమును నిష్ఫలమేయాయెనా? ఇంక మనమెట్లు భీమరాజునకు మోముఁజూపఁగలము.

సుదే—పర్ణాదా! పశ్చిమదేశమంతయు నేవెదకివచ్చితి - రేపు చేదిపురమునకుఁ బోవలెనని యున్నాను. మనమిపురముంబోవుదము ఇందెందైనఁ బానీయము దొరకునా?

పర్ణా—సమీపముననే తటాకమున్నది - పోదమురమ్ము. (నిష్క్రాం.)

---



పంచమరంగము - విపులాంతఃపురము.

---

(అనుబంధము - 36.)

[ప్రవేశము : సైరంధ్రి - (గంధముతీయుచు )]

సీ. ఎన్నఁడునాదండఁగన్నులారముదంబు
తోడనాప్రాణేశుఁ జూడఁగలుగు
నెన్నఁడునాముద్దుచిన్నారి సుతుఁగాంచి
యింపుమీఱఁగఁ గౌఁగిలింపఁగలుగు
నెన్నఁడునాకూర్మి మన్నించుపితరుల
నిండారుమదిఁజేరి యుండఁగలుగు
నెన్నఁడునామది నెరియించిపోఁగిలించు
నీనీచతరసేవ మానఁగలుగు
తే, గీ. నెన్నఁడింకదైవంబు నన్నేచుటుడిగి
ప్రాపుగనుపించిబలుదయ చూపఁగలుగు
నన్నియునుతీత్తకోరిక లాయెఁగాక
ఫలితమగునంచు ధైర్యంబెగలుగదకట.—

అక్కటా? ఎందఱితోడనో యూడిగముసేయించి యెఱుగుదుఁగాని యొకరి కూడిగముచేసియెఱుఁగ - నాచేతులు బలుకాయలుగాచె - ఇదిచూచిన నానాథుఁడెట్లు సైరించుకొనును.

ఉ. నెక్కొనుమోహమోహమున నేనిటునాథుఁడునాథుఁడంచు నే
దిక్కునఁగల్పరించెదను దీఱెబుణంబిఁక నేటియాసనా
కెక్కడినాథుఁడేటిసురు లెన్నడువచ్చునదెట్లుచూచువాఁ
డక్కటబానిసంబెడయునావిధితప్పక వ్రాసియుండఁగన్.

[ప్రవేశము : దాసి].

దాసి—సైరంధ్రీ! రాజమాత విపులాదేవియెక్కడ? నీవేమిచేయుచున్నావు? ఇంతే నీవు గంధముతీసినది?

సైరం—చేతనైనంత దీసియున్నాను.

దాసి—పనివేళలోఁ జేతనయినంతయనఁగా నర్థమేమి! ఈ దినము నూర్గురు ముత్తైదువలకు గంధముకావలయునే - నీమగఁడెవ్వఁడు తీయవలయు?

సైరం—దాసీ! యజమానురాలైన నన్ను నదు-నీవీనిష్ఠురోక్తు లేమిటికాడెదవు? ఉదయము నుండి పుష్పమాలికలు గట్టియున్నాను. నాదుఃఖమున నేనుండఁగా నీవిట్లేలచేసెదవు?

దాసి—"దుఃఖమా"? విపులాదేవి కుమారునికి సుబాహునకుఁ బుత్త్రోదయమై యింటిలోఁ బచ్చతోరణమైయుండ "దుఃఖమా" నీకు!

[ప్రవేశము : విపుల].

విపు—దాసీ! ఏమిచేసెదవు?

దాసి—విపులాదేవీ! ఈసైరంధ్రికిఁ గావరమెచ్చెనది నీవేమైనననుము. నీవభయమిచ్చియున్నావు - దీనికిఁబొగరెక్కినది.

విపుల—ఏమిచేసినది?

దాసి—నూర్గురుపేరటాండ్రకు గంధముకావలెనన్న నిదిగోతీసియున్నదిచూడు. "తిండికి దిమ్మరాజు - పనికిఁ బోతురాజు" - నీకుమారునికిఁ బుత్త్రోదయమైయుండ దీనికి దుఃఖమఁట!

విపుల—దాసీ! నీవిక్కడి కేలవచ్చితివి.

దాసి—నీవెంతతాళుకొన్నను నేనోర్వను - ఈనాఁడీది గంధమంతయుఁ దీయకపోయిన నీయింటనుండఁబనిలేదు - దీనివెడలఁగొట్టకున్న నేనీయొద్దనుండను.

విపుల—పోనీ! నీవిక్కడికేలవచ్చితివి? తొలుతఁజెప్పుము.

దాసి—మఱచితి - మనయింట నేఁడుజరిగినపుణ్యాహవాచనమునకు, సర్వవేత్తలయిన యిద్దఱు వృద్ధబ్రాహ్మణులు వచ్చియుండిరి, మీయక్కగారి యూరివారఁట. భీమరాజునొద్దనుండియే వచ్చియున్నారఁట. నీతోమాటలాడను సెలవొందియున్నారు. వెలుపలనున్నారు.

విపుల—అయినఁ బోవుదము.

(దాసితో నిష్క్రమించును.)

సైరం—తే, గీ మొలఁగి దేవులకెంతయు మెప్పుగలుగు
పగిదినూడిగ మొనరింపవచ్చుఁగాని
దొమ్మదాసుల మంచితనమ్ము వడయు
టెంతయు నసాధ్యమనుట నాకిపుడు తెలిసె.

ఆ, వె. వృజినభాషణముల నీదాసినన్నెందుఁ
బలుకుచుండుఁ దిరుగఁబడితినేని
యొకట నెట్లుతోఁచునో దేపికసియింత
తలఁకుదాన నోర్వలయుదాన.—



ఇదియట్లుండ నీదాసి "భీమరాజ" నియెఁ. ఏభీమరాజో? "అక్కగారియూర" నియె. ఈదేశ యక్కగారియూరేది? నాకు మాతృష్వసగలవని విందుఁగాని యాయామ నెఱుఁగను - ఊరుపేరున్న మఱచితి. భీమరాజు మాతండ్రియేయుండునా? అయ్యో! నాకేలయీవట్టియాశ? —ఆహా— నాయెడమకన్నేటికదరుచున్నది? వామనేత్రమదరిన శుభమగునని యు, నొక్కొకసారి ప్రయాణముకలుగునని యుఁ బెద్దలుచెప్పుదురు - శుభముమాట దూరమాయెఁగదా? ఇఁకఁ బ్రయాణమా—

తే,గీ. "దేవిపలసినగంధంబు దీయకున్నఁ
బురము వెడలింపుము" నిపల్కె నరసిదాసి
కోరికలఁబొంగిపని సేయకూరకున్నఁ
గలుగునియ్యెడనె ప్రయాణకారణంబు.—

(అని గంధముతీయుచుండ.)

(యవనికపడును)

---

షష్ఠరంగము - విపులాంతఃపురమున మఱియొకప్రదేశము.

విపుల - సుదేవుఁడు - పర్ణాదుఁడు - కూరుచుండియుందురు.
ప్రక్కన దాసియుండును.

విపు—ఇట్లైన నింకేమిచేయవచ్చును? మాయక్కయు బావయు నెట్లుజీవింపఁగలరు? అంచితభాగ్యలక్షణధన్యయగు దమయంతికిట్టిపాటువచ్చెను! అకన్నియను నేనాఱు నెలలయీఁడుగల చిన్ననాఁడుచూచియుంటిని. వివాహకాలమందైనను వచ్చుటకు నాపతి మిక్కిలి జాడ్యస్థుఁడై యుండి తరువాత నొకమాసమున నే—

సుదే—అట్లుగాకున్న నీపెనిమిటి వీరబాహుఁడు రాకుండునా? నీవు రాకయుందువా?

విపు—ఇప్పుడేమిసార్థకము! వారివృత్తాంత మించుకైనఁ దెలియదా?

సుదే—భీమరాజుచేఁ బంపఁబడి నేఁ బశ్చిమసీమయంతయు వెదకివచ్చితి. ఈపర్ణాదుఁడు దక్షిణమంతయుఁ జుట్టివచ్చెను. ఎందును వారుచూడఁబడరు.

విపు—అయ్యో!

[ప్రవేశము - దూరమున సైరంధ్రి గంధవుగిన్నెతో].

విపు—(సైరంధ్రి వెనుకకు జరుగుచున్నదిచూచి) సైరంధ్రీ! సంశయింపకుము. వీరు మాయక్కగారియూరి వృద్ధబ్రాహ్మణులు—రమ్ము.

సైరం—(సమీపించి) అమ్మా! చందనము సిద్ధముచేసియున్నాను. ముత్తైదువలు వచ్చుచున్నారు. (బ్రాహ్మణులఁజూచి) వా—రం—ద—ఱు.—

సుదే—(చక్కఁగ సైరంధ్రిఁజూచి) ఆహా! దమయంతి! దమయంతి! ఏమి మాపుణ్యము!

దమ—(తలవంచి కన్నీరునించును).

విపుల—దమయంతీ! సుదేవా! ఈబిడ దమయంతియా! మాయమ్మా! (అని కౌఁగిలించి దుఃఖించును.)

పర్ణా—సుదేవా! నీవెట్లు గుఱుతించితివి?

సుదే—ఆయమనొసటనున్న చిహ్నము నెఱుఁగనా? ఆహా! ఎంత సంతోషమాయె.

(అనుబంధము - 37.)

క. పురములలోనడవులలోఁ
దిరుగాడినబాధలెల్లఁదీఱెఁబ్రమోదం
బరుదారెనేఁడుకంటిమి
సురుచిరగతినబలనిదియె సుదినంబుగదా.

ఆమెను మాటలాడింతము. (దమయంతితో.)

సీ. నిషధపురంబుమానినదాదిగా నెట్టి
పడరాని యిడుమలఁబడితివమ్మ
నిరతంబుబాయని నీమనోహరుఁబాసి
యిటులొంటిమైనుండనేటికమ్మ
నళినాయతాక్షి నీనాథుండు నళరాజ
పురుహూతుఁ డతఁ డెందుఁబోయెనమ్మ
చక్రవర్తిలతాంగి సైరంధ్రివై యొల్ల
కడనూడిగము సేయఁగంటివమ్మ
తే. గీ. ఉవిదయెచ్చోట నిన్నినాళ్ళుంటివమ్మ
చేదినగరంబు నీవెట్లు చేరితమ్మ
నీచరితమొక్కటియు మాకు దాఁచకమ్మ
యెలమిమైఁబూర్ణముగ వచియింపుమమ్మ.

విపుల—(కౌఁగిటనున్న దమయంతిఁజూచి) అయ్యో! మూర్ఛిల్లియున్నది. దాసీ! రావే?

సైరంధ్రి—కాదు దమయంతి—మూర్ఛిల్లియున్నది.

(అనుబంధము - 38.)

(దాసియు విపులయు దమయంతి నెత్తుకొనిపోవుదురు.)

(సుదేవుఁడు, పర్ణాదుఁడు నిష్క్రమింతురు.)



## సప్తమరంగము-ఋతుపర్ణాస్థానము.

ఋతుపర్ణుఁడు - మంత్రి - వార్ష్ణేయుఁడు - సుదేవుఁడు.
కూర్చుండియుందురు—ప్రక్కన సేవకుఁడు.

మంత్రి—రాజచంద్రా! ఈ వార్ష్ణేయుఁడడిగిన ప్రశ్నమునకు సకలతత్వనీతికోవిదుఁడగు బాహుకుఁడే ప్రత్యుత్తరమీనలయు.

ఋతు—ఔను. మఱచితి. బాహుకుఁడేఁడీ?

మంత్రి—సేవకా! బాహుకుని బిలుచుకొనిరమ్ము. (సేవకుఁడు నిష్క్రమించును.)

సుదే—బాహుకుఁ డెవరు?

ఋతు—సుదేవా! నీవాతనిఁజూడలేదు. నాయొద్ద బానసీఁడుగానున్నాఁడు. గుణమునందు యోగ్యతయందు నసమానుఁడు. అదేమివ్యక్తియో.

వార్ష్ణే—సుదేవా! దమయంతిదేవి యిప్పు డెచ్చటనున్న దంటివి?

సుదే—చేదిపురమునుండి పర్ణాదునివెంట నామెను భీమపురికిఁ బంపితిని. ఇప్పటికిఁ జేరియుండును.

[ప్రవేశము: బాహుకుఁడు.]

బాహు—రాజర్షిచంద్రా! నమస్కరించెదను.

ఋతు—బాహుకా! కూర్చుండుము. ఇచ్చట నొక ప్రశ్నకలిగె. బంధువియోగము గలిగినపుడు, ఏయూఱటచే జీవులు దుఃఖము వాయవలయునని. నీవేమందువు?

ఉత్సాహావృత్తము.

బాహు—ఎనసిసుఖమెయనుభవించు నేనరుండుదుఃఖమే
యనుభవించువాఁడుగలఁడె యవనినేదివచ్చినన్
మనసులోనఁబ్రాప్తమనియు మఱియుదైవకృతమటం
చునుదలంచిశాంతిఁబొందఁ జూడవలయుభూవరా.—

(సుదేవుఁడు బాహుకు నూరక చూచును - బాహుకుఁడు సుదేవుని నప్పుడప్పుడు చూచును).

† మత్తకోకిల వృత్తములు.

ఋతు—పోలఁజూడఁగనిట్టియుత్తమ బుద్ధికల్గునెయేరికిన్
మేలుమేలగుసంతసించితి మెచ్చితిన్నిను బాహుకా.

† ఇది హిందూస్థానీ కాపిరాగము ఛాపుతాళముగలపాటగాఁ దొలుతరచియింపఁబడియె.

సుదే— ఏలమెచ్చెదవిట్టినిశ్చయ మేరికైనఁజనించునే
కాల వేదినలావనీశుఁడె కామినీమణిఁబాయుఁడే.

బాహు—సద్రసజ్ఞుఁడటంచుఁబల్కితి చాలునింతతలంపుమా
భద్రకారణముండకుండిన భామనాగతిఁబాయునే.

సుదే— క్షుద్రబుద్ధియెకాకయారసి చూడఁగారణముండునే
నిద్రవోయెడుకాంతఁగానల నీఁగెనెంతటిద్రోహియో.

వార్ష్ణే— కానకీగతినానలావని కాంతునేటికిదూఱెదో
యానరేంద్రునెఱుంగువాఁడదయావిలాసుఁడు భూసురా.

సుదే— ఆనితంబినియాసతీమణి యక్కటావివరింపఁగా
వీనులారఁగనామెబాధల విన్న నేమనుచుంటివో.—

బాహు—అలకింపుమునాథుఁడెంత మహాపరాధమొనర్చినన్
నీలవేణికిఁగాంతుచర్య గణించిదూఱుట చెల్లునే.

సుదే— చాలుఁజాలునిఁకేమికావలె శాస్త్రమిట్టిదికల్గునే
యాలినిర్దయఁబాసిపోయిన యాతనిన్మతిమెత్తురే.

ఋతు—మిన్నకేటికిఁగోపమొందఁగ మేదినీసురపుంగవా
సన్నుతంబగుధర్మసూక్ష్మము జాడనీతఁడు చెప్పెఁగా.

సుదే— ఎన్నఁగోపములేదుభూవర యింతయుండినమాటయే
(బాహుకుఁజూచి.)
కన్నుగానకజూదమాడి యఖండరాజ్యమునోడిపోఁ
దన్నుబాయక వెంటవచ్చిన తన్విగానలమానివేఁ
జన్నవానిసెబాసటంచుఁ బ్రశంసనేయుదెబాహుకా.

బాహు—చన్నవాఁడగునున్న వాఁడగుఁజాలనాకుఁబ్రశంసయే
మున్నదూరకధర్మభంగుల నుగ్గడించితిభూసురా.—
రాజచంద్రా ! ప్రొద్దువోయె - నాపనికిఁబోవలయు - సెలవా ?

మం—మనకును వేళయైనది.

ఋతు—పోవుదము - (మంత్రితో బాహుకునితో నిష్క్రమించును.)



సుదే—వార్ష్ణేయా ! ఈబాహుకుఁ డెవరు ?

వార్ష్ణే—నలునియొద్ద వంటలవాఁడై యుండెనఁట నేనేమో చూచియెఱుఁగను.

సుదే—ఇతఁ డెచ్చటఁ బండుకొనును ?

వార్ష్ణే—అచోట - ఇదేలడిగెదవు ?

సుదే—ఇతఁడు మిక్కిలి విద్వాంసుఁడుగానున్నాఁడు. సంభాషింపఁగోరెదను.

(లోపల "వార్ష్ణేయా" అని ధ్వని)

వార్ష్ణే—ఎవరో నన్ను బిలుచుచున్నారు - పోయెద. (నిష్క్రమించును.)

సుదే—ఇతఁడే నలుఁడు కానోపునని తోఁచుచున్నది. అతఁడు విరూపుఁడైయున్నాఁడని ఋషులుచెప్పినట్లు దమయంతివచించె. నలుఁడుకాకున్న నామాటల కితరుఁ డిట్లు నలునిపక్షమున మాటలాడునా ! ధ్వనిసవ్వడియు నలునిదేయయియున్నది. ఇంకను బరీక్షించి చూచెదను. (నిష్క్రమించును.)

---

## అష్టమరంగము - మహానసగృహము.

—:o:—

బాహుకుఁడు - జీవలుఁడు - పండు పండియుందురు.

బాహు—జీవలా ! నిద్రరాలేదా ?

జీవ—(నిద్రతో) వచ్చుచున్నది, ప్రొద్దెంతైనది ?

బాహు—అర్ధరాత్రము మీఱియుండలేదా?—జీవలా !

జీవ—(గుఱకవెట్టి నిద్రించును.)

[ప్రవేశము : సుదేవుఁడు దూరమున.]

సుదే—(స్వ) అయ్యెడనే పండుకొనియున్నట్లున్నది. నేనిందే యుండెదను. (పండుకొనును.)

బాహు—ఈ జీవలున కెంతవేగముగ నిద్రవచ్చెను ? వానికేమి నాయట్టి వియోగబాధ గలదా ? సౌఖ్యముగ నిద్రించె. నాకు రాకున్నదికదా ?

చంద్రోదయము కాకుండియు నీశరద్రాత్రి యెట్లు రాజిల్లుచున్నది.
అదే యాకాశమునందెల్లెడ ముత్తియములు చెక్కినట్లు నక్షత్రము లలరుచున్నవి.

సీ. సమయత్రివిక్రమా శాహారవరికలి
తాకాశపదకహీరాళులనఁగఁ
బ్రహ్మాదిదుర్జ్ఞేయ పరమేశమాహాత్మ్య
సానూచివిస్ఫుటాక్షరములనఁగఁ
బ్రచలదన్నాతుర వనజారి వరసుధా
దానాగతామరసేనలనఁగ
ఘనరాజదర్శనాగతనిర్జరీకరో
చ్ఛలితముక్తామయాంక్షతలనంగ

తే, గీ. యామినీశీతకిరణోప యామమునకె
నంగఁజేకూఱిచిన బాణసంచునందుఁ
గాల్పుబిరుసుల యంగారకణములనఁగ
గగనభాగంబునను దారకలురహించె.—

సీ. మీపేరులడుగదే మెలఁతతారకలార
ఘనమధుమాస యామినులయందు
మిముఁగాంచిపొగడదే రమణిఋక్షములార
బ్రబలనిదాఘ శర్వరులయందు
మిముఁజూడఁగోరదే కొమచుక్కలార మే
లరసి ప్రావృడ్విభావరులయందు
మిముఁగాంచియలరదే కమలాక్షి యుడులా
విమలశరత్తమస్వినులయందు

తే, గీ. సుదతినీగోళ్ళకెనయె యీచుక్కలంచుఁ
బలుకమాచెలి నవ్వుఁగాభంబులార
యిన్నియును నాతలంపున కెగిచితెచ్చి
తాపమడిరింపఁగతమేమి తారలార.—



క. ఇన్నక్షత్రంబులెలా
పోన్నతిఁగలిగించెనన్నోవుదునే "ముం
దున్నది ముసళ్ళపండుగ"
యన్నట్లదెపూర్వశిఖరి నబ్జుఁడుదోఁచెన్.

సీ. అతనువిలాసరామానంతయోగవి
హ్వాలులైన విప్రయోగులుదలంకఁ
దవిలియథాశక్తిఁ దమమువారించుస
త్సంతతుల్జలియించి కాంతిఁదోలఁగఁ
జటులారి నామనిశ్చల విభాకరమాన్య
చక్రనంతతులు తేజంబుడింద
దినమమృతాసక్తి నినుసేవ రాజిల్లు
కమలాళి విమలభావముఁదొరంగఁ

ఆ, గీ. కుజనసంతానకులకును కుముదతతికిఁ
బంకజాతమార్గణాక ప్రభంజనులకు
మధుప పరపుష్టచయములమనుచు మధున
కురుముదమునిండ నీనిశాచరుఁడు వెడలె.

ఆ, గీ. నేను మిత్త్రుఁడననివచ్చి పూనియొకఁడు
పగలుఘుటియించి మిమ్ముఁజేడ్పఱచునొకఁడు
రాజనని తారలార పోరాయుఁగళలఁ
దనరదెందును సుఖము సత్సంతతులకు.—

ఉ. అద్దిరచందమామ బహుళాష్టమినాఁడె సగంబు మేనసే
యుద్ధవిడింగలంచితివియోగులసత్తతి కాంతిబ్రుంగఁగా
నద్దితినై జదుర్గుణమయారె యడంగునె యెంతచిక్కిన
న్గద్దత్రాఁచు చావనయినన్విషభావము మాననేర్చునే.—

చ. ప్రవిమలశీతలత్వమది పైననె లోన ననన్దవానల
చ్ఛవిఁగని కాల్చుక్రూరుఁడవు చక్కెరపూఁతవిసంబ వెంతయు
న్నివురునడాఁగు వేడిగలనిప్పుకవబ్రమె చక్రవైరివౌ
కువలయమిత్ర నీకుఁదడిగుడ్డల గొంతులుగోయు చందముల్.

ఉ. క్రించుఁదనంబునన్గలుమరీతి వియోగులకెల్ల పాట్లుగ
ల్పించితి వెంద ఱెందఱో శపించిరి చావవదేమిచిత్రమో
ప్రాంచితనిర్జరాళికమృతాన్న మొసంగెడు నింతపుణ్యమా
ర్జించుటఁ జేసికాదె తెలిసెన్గడిగండముఁగాచు చందముల్.

మ. నిరతంబున్గృశులై వియోగిజనము ల్నిందింపఁగాఁ గల్మష
స్థిరతన్దిట్టఁగఁ జత్తురే మనుదురే దీవింపఁగానన్నధై
ర్యరతింబాంథులొనర్చు శాపవితతిన్వ్యాస్యంబుగావించె దే
మిర నేనింతయెఱుంగఁజాలనొకొ నీమీసాలలోనవ్వులన్.

తే, గీ. ఏలగంతులువైచెద వేఘనుండు
కలుగునో నినుముంచి నీకాంతియడఁప
నెట్టిపెనుబాము మ్రింగునో యెవ్వఁడెఱుఁగుఁ
గడచిబ్రదికినవారలు పుడమిఁగలరె.—

తే, గీ. వేఁడుకొనఁగఁతుమించిన విధముఁజూపి
మదనుఁజేసన్నలను బిలిచెదవెక్రూర
దొంగలకుఁదల్పులనుదీసి దొరను లేపు
చందములునీవె కావె యోచందమామ.

క. పోరాములు తగవేరా
వేరావలదిటకు నేచవిధునుకుమారా
మారామముమననీరా
నీరాయిడిమానికరుణ నొక్కొనిపోరా,

క. వరమానుతయాదరమా
దరమారఁ జెలంగివచ్చెదవు పోతరమా
తరమా యిది సుఖకరమా
కరమాఱడియడర నేపఁగాఁ గావరమా,



సీ. పలుగాకిరై వెన్నెలలుగాచి నీతల్లి
యిలుఁగాల్చి బలుకంపనిడఁగలేదె
కనుగాలి నెచ్చెలి నినుగాల్చినవిరోధి
కనుఁగోచుఁదలనెక్కి యాడలేదె
లలిఁబాదముల వేఁడి వెలిఁబారఁగానీదు
తొలిబాణమును మంటఁగలుపలేదె
తలదిమ్మఘటియింప బలుదొమ్మినీనారి
వెలిదమ్మి చెఱసాల నిలుపలేదె

తే, గీ. యేమిచుట్టముశశినీకు మామయంచు
సంతసించెదు నీవైరిసద్దకుండు
ప్రేవుచుట్టమె కాకున్నఁ బెట్టుచుట్ట
మో మనంబార నారసితే మనోజ.—

శా. వీరశ్రీలయకాలభీముఁడు హరాభిఖ్యుండు నీవైరి బల్
క్రూరుండాతఁడొనర్పవచ్చుఁగరుణాకుంఠుండువిశ్వంభరుం
డై రాజిల్లెడు తండ్రికిన్సుతుఁడవై యాత్మైకజాతుండవౌ
మారా నీకగునే వియోగిజనసంహారంబు గావింపఁగన్.

తే, గీ. హరుఁడెనీదాడిజడిసి ఫాలాగ్నిఁగాల్చి
తెగువనీసతి మెడత్రాడు త్రెంపఁజూచెఁ
జిత్రమా రతి మంగళసూత్రమహిమ
తెగియుఁ దెగదయ్యె మాదురదృష్టమకట.—

తే, గీ. నీవు నీమేనమామయుఁ గావరమున
నిచ్చు బాధలు చాలవేయేల నీదు
మలయభూధర పవమాను మఱియునీదు
బలఁగమును దాడివిడిచితి పంచబాణ.—

క. చలమూని ప్రభంజనగతిఁ
గలకాలము కమలనెందుఁ గనఁబడకుండన్
మలయానిల పాంథుల నా
వియోగానలు గలిదహించి విడిచెదవకటా

తే, గీ. ఆశ్రయాశుండు నెచ్చెలియగును మొదట
నాశుగుఁడవు సదాగతివబ్బిరింక
మారుఁడు కృపీటజాతుండు ధీరహితులు
కడగి పాంథుల మొదలంటఁ గాల్పలేవె.

ఆ, వె. సాధనములులేవ చంచలగతిలేదు
దృశ్యరూపమెఱుఁగ విట్టులయ్యు
భువన హింసచేసెదవు నీకెతగుఁగోల
లేనిపెట్టు త్రాడులేనికట్టు.—

చ. అనయములోనివాఁడవని ప్రాణపదంబుగ నెంచియుండుటం
జెనుపడనేచ రాకుమని వేడితినిన్ను సమీర నీప్రకం
పనగుణమేలమానెదవు పైపయి నేఁచఁగ సాగితక్కటా
మునుకొనియింటిదీపమని ముద్దిడ మీసలుగాలకుండునే.

ఉ. కాముఁడు కామరూపుఁడు పికంబులు క్రోధగుణారుణాక్షము
లోస్సముఁడుహల్లకప్రచయలోభుఁడు మోహకరుండువాయువు
ద్దామ మదంబులంచలితండము మత్పర భావమిట్టిచో
క్షేమమె విప్రయోగులువసింపఁగ భంగము గల్గకుండునే.—

సీ. ముదమార నావిధుంతుద వేణిలేకున్న
నీ చంద్రపరితాప మెట్టులడఁగు
సకలంకనాగిరీశకుచఁ గానక యున్న
నీయనంగవిదాహ మెట్టులడఁగు
దేవి నాభుజగరోమావళిఁ గనకున్న
నీపవనునిడాక యెట్టు లడఁగు
సకట నామృదులచంపక నాసరాకున్న
నియ్యళివిభ్రమం బెట్టులడఁగు

తే, గీ. బ్రావృడంబుదకచ సాంకవప్రభూత
గంధి రామాంగి శరదిందుకాంతవదన
యెలమినాదండ లేకున్న నీమరాళ
శుకపికమయూరముల బాధ స్రుక్కఁగలదె.



శా. నీరంధ్రద్రుమజాల భీకరమృగోన్నిద్రారవ ప్రస్ఫుర
ద్ఘోరారణ్యమునన్గలంగి తననాథుంగానలే కెంతయున్
గ్రూరాత్ముండనిదూఱెనో సొలసెనో రోదించెనో స్రుక్కెనో
యేరీతి న్భరియించువాఁడ మదిలో నీతాపమేనక్కటా.—

తే, గీ. అక్కటా మందభాగ్యుఁడనై వియోగ
దీనదుఃఖమునకు మేరఁగాననైతి
నెల్లజీవులకును నిదె తెల్లవాఱెఁ
దెలివినాకింక నెన్నఁడు తెల్లవాఱు.

(అనుబంధము - 39)

జీవల—(ఇంతవఱకే లేచియుండి) బాహుకా!—
బాహు—ఆహా! జీవలా! ఎప్పుడులేచితివి?
జీవల—కొంతసేపయినది. కాని. నీభార్య యెవరు? నీవియోగమునకుఁ గారణమేమి?
బాహు—అయ్యో! ఇట్టిసురూపునకు భార్యయొకటియే తక్కువ.
జీవల—మఱి యీదుఃఖమేమి?
బాహు—ఇది వియోగవర్ణనము. ఇట్టిది గ్రంథములలో నుండదా?
జీవల—అట్లనా? ఇప్పు డెంతప్రొద్దయినది?
బాహు—తూర్పుదెసఁజూడుము.

సీ. కమలాప్తధాతృవేషము రాఁగఁబట్టిన
సురనాటకులతోఁపు తెరయనంగ
నినురాకనమ్మదమ్మునఁ బూర్వదిక్కాంత
కైసేయుసింధూర కాంతియనఁగ
మందేహులుదురుభయం బొందఁజూచినచండ
కిరణునికోపంపుఁ గొంపనంగఁ
బుష్కరదర్పణంబున బింబితంబైన
బహుళశోకనదవిభా పటలియనఁగఁ

తే, గీ. బూనిముచ్చేలువుల యిక్కఁబూజసేయ
సురలుగూర్చిన బంధూకసుమములందుఁ
బొదలునెఱ్ఱనికాంతి నానుదయశిఖరి
నంబరంబున సాంధ్యరాగంబుఁగంటె—

మ. హరిణాంకుండిదె వల్లెబాతె దరఫుల్లాంభోజపద్గంధబం
ధురుఁడై మందగతిం జరించెఁ బవమానుండొయ్యఁ దోఁచెఁ విభా
వరిలో నేబదియేడు నాడికలుపోవం బూర్వశైలంబునం
దరుణుండల్లదెయుద్భవించునిఁకఁ జండాంశుండు మార్తాండుఁడై.

జీవల—అయ్యో! అయినఁబోవలయును.

బాహు—అవును - పోదము.

సుదేవ—(ముందటికివచ్చి.)

(అనుబంధము - 40.)

మ. భళిరే కంటిని గంటి సప్తజలధి ప్రావేష్టితాఖండభూ
లలనాధీశకిరీటవారిరుహ లోలంబాయమానప్రభో
జ్జ్వలితారిందమనూపురాత్తపద సేవాప్రీతగోత్రాధవున్
నళభూమీధవు నాశ్రితౌఘకరుణా నవ్యప్రభామాధవున్.

సీ. సార్వభౌమపదంబు సరణిమీఱినభోగి
వంటలవాఁడౌచుఁ బరఁగె నేఁడు
పెక్కురాజులచేత మ్రొక్కులందినఘనుం
డొక్కరాజునకుఁ దా మ్రొక్కె నేఁడు
విమలాతపత్రము ల్వేలయుఁ గల్గినతేఁడు
వర్షాతపములకు బడలె నేఁడు
కనుసన్న దొరలచేఁ దనయాజ్ఞ గొనువిభుం
డలయ నొక్కనియాజ్ఞ మెలఁగె నేఁడు

తే, గీ. భయదకోదండ ఖడ్గముల్వట్టువీరు
డట్టె గరిటెయుఁ గ్రోవియుఁ బట్టె నేఁడు
విపుల కేసరి నక్కటా పిల్లిఁ జేసె
నధమవిధమున నిట్టిదే విధికృతంబు.—

సీ. పలుకుదునా నీవ నళుఁడంచుఁ గాదని
చెప్ప నావయి నేమిచేయవలయు
రమ్మందునా విదర్భకును నీవిభుచిత్త
మేమొ నామాటపై నెట్లువచ్చు
వ్రాయింతునా కమ్మఁ బరఁగ భీమునిచేత
నేయుక్తి నేమని వ్రాయవలయు
రప్పింతునా నళు రాణి నిచ్చటికివ
చ్చిన కార్యమే భంగిఁ దనరఁగలదొ

తే, గీ. యక్కటా యిది సంకటమాయె నాకుఁ
దెలిసియుండియు వ్యర్థమై తెలియకున్న
విధము తనరారె విధిలేమి వెలయనిందు
కేయుపాయము పరికింతు నింకమీఁద.—

ఆయిన నొక్కటి తోఁచుచున్నది. అది వినిన భీమరాజుగాని దమయంతిగాని పాపబుద్ధియందురు. మార్గాంతరము తోఁచదయ్యె, దైవమున్నాఁడు. వారితోడనే యాలోచింతుఁగాక.

(నిష్క్రమించును.)

చతుర్థాంకము సమాప్తము.

——

శ్రీ

# చిత్రనళీయ నాటకము.

## పంచమాంకము.

---

### ప్రథమరంగము - విదర్భలో భీమరాజునగరు.

---

[ప్రవేశము : భీముఁడు - దమయంతి - సుదేవుఁడు.]

దమ — సుదేవా ఇది యెట్టిపాపము? ఇందుకు నన్నొడఁబడుమంటివా!

(అనుబంధము - 41.)

ఉ. పర్వ మహోపతాపము విపత్ప్రదమైనది విన్నమాత్ర నా
పూర్వభవార్జితంబు లఘుపుంజము లెల్లఘటించె నాకునీ
దుర్విధినేఁడు దానికిని దోడుగ నీకలుషంబు వోలునే
సర్వవిధంబుల న్విబుధసత్తమ చాలను వేయునేటికిన్.

సీ. తనరు పతివ్రతా ధర్మమంతయు వీటిఁ
బోవనీతలఁ పెందుఁబోలునోకొ-
దైవంబుగా నెంచుధవునెడ మదిమదిఁ
జేడియకీ ద్రోహచింత తగునె.
ధర్మంబు నశియించుఁ దలఁగు బుణ్యము పరి
తాప ముద్భవమొందుఁ బాపమడరు
నగుబాటు వాడము మానకయుండు నపకీర్తి
మఱిమఱి జనియించు మానహాని

తే, గీ. పోవనిమ్ముండనిమ్ము నాజీవనమి
వచ్చె రాకుండె నామనో వల్లభుండు
ఉండె లేకుండె నానాథు నొనరఁజూచు
భాగ్యము సుదేవ యీ భంగివలదు నాకు.—



సుదే—

శా. అమ్మా యేటికి నింతపాటు జనలోకాధీశు రప్పించు చం
దమ్మాహించితిఁగాక యట్లుపలుక న్నాకేమిసంతోషమే
యిమ్మార్గంబునఁగాక మేదినివిభుం డిచ్చోటికేల రాను పా
యమ్మొండుండినఁ జెప్పరాదె యిటులేలా భ్రాంతిఁజింతింపఁగన్.—

దమ—చ. పనివడియొక్కకమ్మ బుతువర్ణున కంపిన ?

సుదే— నిక్కమమ్మయే.

పనియని పేరువెట్టి యటువ్రాసెదు ?

దమ— అదేటికి మేమెసమ్ముఖం.

బునజననాథుఁడు న్నెడకుఁబోయిన నెట్లగు?

సుదే— పోయి!—

దమ— పోయియే.

మొనరుపవచ్చునో యెఱుఁగ.

సుదే— నూరకయాడెదు పాయమద్దియే.

భీమ—

(అనుబంధము - 42.)

సీ. నీవెంతయాడిన నీయుపాయమునాకు
భాసురంబుగఁ దోఁపదోసు దేవ
పిదపనేమైన నీవృజినభాషణమునఁ
బ్రాకటదుష్కీర్తి రాకయున్నె
భూమీశవరులలో భీముఁడుత్తమపుణ్యుఁ
డన్నయశంబెల్ల మన్నగలయుఁ
దలఁకక నాతోడి ధరణీశులందఱు
నను నుల్లసములాడి నవ్విపోరె

తే, గీ. అకటయేటి ద్వితీయ స్వయంవరంబు
కొడుకుగల సార్వభౌముని పడఁతికరయ
ధరణినెందైన వింటిమే తలఁచినంత
రోఁతపుట్టదె యీపనిచేతఁగాదు.

సుదే—మూడుదినములు యోచించినను మతియొక్క యుపాయము కలుగదు.

భీమ—సుదేవా! దీని నెవ్వరైన నమ్ముదురా?

సుదే—నీ చేవ్రాలున జాబున్న నేల నమ్మరు?

భీమ—ఆశ్చర్యమని యెంచరా?

సుదే—అందుకే చూడవత్తురు.

భీమ—శాస్త్రవిహితమని యెంతురా?

సుదే—అందునకు నన్ను విడువుము. నేనింకను గారణముల జెప్పెదఁ బోదమురమ్ము.

(నిష్క్రమింతురు).

---

## ద్వితీయరంగము - ఋతుపర్ణకొలువు.

---

[ప్రవేశము: ఋతుపర్ణుఁడు-మంత్రి-వార్ష్ణేయుఁడు-బాహుకుఁడు.]

ఋతు—బాహుకా! నిన్న నీవుచెప్పిన సాంఖ్యమతము మిక్కిలి శ్రావ్యము. సాంఖ్యులకు యోగులకు భేదమేమంటివి?

బాహు—ప్రత్యక్షహేతువాదులు యోగులు, శాస్త్రనైపుణులు సాంఖ్యులు. అయిన వారిద్దఱికి ఫలమొక్కటియే.

ఋతు—అదియెట్లు?

[ప్రవేశము: సేవకుఁడు.]

సేవ—రాజేంద్రా! భీమరాజునగరినుండి సుదేవుఁడు వచ్చియున్నాఁడు.

ఋతు—బాహుకా! మొన్నవచ్చిపోయిన యతఁడేకదా సుదేవుఁడు! నీ వెందుకిట్లున్నావు?

బాహు—కడుపున నేమో సంకటమువున్నది.

ఋతు—పోయి పండుకొనుము.

బాహు—అంతయేమియులేదు.

ఋతు—సేవకా! సుదేవుని రమ్మనుము.



[ప్రవేశము: సుదేవుఁడు.]

సుదేవా! నమస్కరించెద - కూర్చుండు. భీమరాజు మొదలగువారికి క్షేమమా? నలునివిషయ మేమైనఁ దెలిసెనా?

సుదే—అది తెలిపియున్న నే నేలవచ్చుచుంటిని?—

ఋతు—అతనికేమైన నాపదకలిగెనా?

సుదే—ఈజాబుఁ గాంచిన విశదమగును. (జాబిచ్చును.)

ఋతు—బాహుకా! ఇందేమున్నది చదువుము.

బాహు—(జాబువిచ్చి.)

“ శ్రీమద్రమానాథ చరణసేవాసమాసాదిత శమదమాద్యనంతగుణపూర్ణులై, బహుమానిత సత్కర్మనిరతులై, వివిధవిశేషరాజనీతివిదులై, బహుళాధ్వరవితాన కరణదక్షులై, ఇక్ష్వాకుకులకలశ వారాంనిధిపూర్ణిమాహిమాంశులై, అయోధ్యాపురీసింహాసనాసీనులై యుండు, శ్రీఋతుపర్ణ రాజర్షి చంద్రులకు.—

విదర్భయందలి భీమనాముఁడు నమస్కారః పురస్సరముగ నొనరించు విజ్ఞాపనము.

రాజర్షితిలకా!

నేను జిరకాలము సంతానరహితుఁడనై యుండి మహాత్ముఁడగు దమనమునీశ్వరు నాశ్రయించి యతని యప్రతిమానుగ్రహమునఁ బుత్త్రులతోఁ బాటు దమయంతియను పుత్త్రికం గనియుండుటయు, గురుకటాక్షము కలిమి నాకన్నియను, సత్యవచోనిధి యనియు నీర్ధకీర్తియనియుఁ బ్రసిద్ధుఁడైన శ్రీనళచక్రవర్తికి వివాహితఁ గాఁ జేసియుండుటయు, ఆ దమయంతికి సుతోదయమైనపిదపఁ గొన్నిదినముల కాచక్రవర్తి విధాతృవశంబున జ్ఞాతిప్రేరిత మాయాద్యూతమున రాజ్యసర్వస్వమునోడి కట్టు బట్టలతో భార్యాసహితుఁ[illegible]రము వెలువడిపోవుటయు, ఆ మహారాజు విధిప్రేరితుఁడై మహాగహనమున దమ[illegible] నెడఁబాసి యెందోచనుటయు, దమయంతి దురంతచింతతో నడవిని బడరానిపాట్లుపడి తుదకు దైవవశమునఁ దనమాతృష్వసగృహమున సుబాహుపురమున సైరంధ్రిగాఁ గొలువుండి తదన్వేషకులగు బ్రాహ్మణులవలన గుర్తింపఁబడి నాయొద్దఁ జేరుటయు నీవిషయములన్నియు లోకవిదితములై యుండి నందున మీరును దెలిసియుండవచ్చును.

[illegible]మాతయగు నళరాజును వెదకివచ్చుటకు నావలనఁ బంపఁబడిన బ్రాహ్మణులు [illegible] సేతు హిమాచలస్థ బృహద్భూమండలంబునఁగల దేశ నగర పట్టణ గ్రామ [illegible]ద తటవితట ధరాధర కాంతారాశ్రమాదులన్నియు వెదకి కానకవచ్చిరి. నాదుఃఖము, నాపుట్టిదుఃఖము ననుభవించినవారికిని, ఈశోకమిట్టిదని యూహింప సమర్థులగు భవాదృశులకును దెలియుఁ గాని యితరులకుఁ దెలియఁజాలదు. ఈసంకటమపారమగుటచే ధర్మశాస్త్రాధ్యయన సంపన్నులై యఖిలవిమలైన భూసురశ్రేష్ఠ

లతో నాలోచించి, తత్పరస్పరముగ రాఁగలశుద్ధపంచమీ కుజవారమునరాత్రి పదు నాలుగడియలకు మేషలగ్నమున—"

ఋతు—బాహుకా ! ఏమట్లూరకున్నావు ! ముందేమున్నది ? చిత్రముగానున్నదిగదా!

బాహు—రాజేంద్రా ! నాకుఁగన్నులు పచ్చనై కానరావు.

ఋతు—అయ్యో ! నీకు నేఁడేల యిట్లయ్యె ? వైద్యులఁబిలిపింతునా ?

బాహు—వలదు - కొంతసేపున కదియేనిలుచును.

ఋతు—మంత్రీ ! ఆజాబునీవుచదువుము.

మంత్రి—(తీసికొని)—"మేషలగ్నమున దమయంతికి ద్వితీయస్వయంవరము జరుపు నట్లు నిష్కర్షచేసి యున్నాను."

బాహు— (నిష్క్రమించును.)

ఋతు—సుదేవా ! ఇదేమివార్త ?

సుదే—ఏమి ?

ఋతు—ఇదేమి ద్వితీయస్వయంవరము ?

సుదే— ఏల? "నష్టేమృతేప్రవ్రజితే క్లీబేచపతితేపతౌ,
పంచస్వాపత్సునారీణాం పతిరన్యోవిధీయతే."—

ఋతు—మంత్రీ ! మనపురోహితులు రాలేదు.

సుదే—శాస్త్రవిచారమున నేను గావలసినంత వాదింపఁగలను.

(అనుబంధము - 43.)

ఋతు—సీ. ఘనసతీగుణము పెంపునమున్నె తానళ
ధారుణీశునిఁ మదిఁగోరుకతన
ననఘుఁ డింద్రుఁడెవచ్చి తనపాణి వేడినఁ
గనకాంగి వినదయ్యె ననుచువింటి
మలఘుపతివ్రతా తిలకంబు దమయంతి
యనుకీర్తి జగమెల్ల నల్లుకొనియెఁ
గడునబ్బురపు వింతగాఁ దోఁచెభూదేవ
తిలక నేఁడీవార్త వెలసెననినఁ

ఆ, వె. దనరఁగొంకులేక దమయంతి మనసార
దీనికిపుడు సమ్మతించినదియె
యవనినాథ కోటికనువార నాభీమ
రాజెయిట్టి కమ్మవ్రాసినాఁడె.



సుదే—పూర్ణముగాఁ జదువుకొనుఁడు.

మంత్రి—"—ద్వితీయస్వయంవరము జరుపునట్లు నిష్కర్ష చేసియున్నాను. కాఁబట్టి భవాదృశులగు రాజన్యవరేణ్యు లీస్వయంవరమున కాహూయమానులు కాఁబడు చున్నారు.

విదర్భ
మార్గశీర్ష బ॥ ౧౧
భానువారము.

ఇట్లు విన్నవించు
"భీముఁడు"

ఋతు—(జాబు చేతఁదీసికొని) భీమరాజుచేవ్రాలును ముద్రయునున్నది. "రాఁగల శుద్ధ పంచమి.—" ఎల్లుండియే స్వయంవరమా ? ఇదెట్లుపోవచ్చును ?

సుదే—మీబాహుకున కశ్వహృదయము తెలియునని యు నూఱుయోజనములైన నొక్క దినమునకుఁ బోవునట్లు రథముగడపఁగలఁడనియు నీవె నాఁడుగ్గడించితివే.

ఋతు—ఔను - బాహుకుఁడేఁడీ ?

మంత్రి—పిలిపింతునా !

ఋతు—వలదు - రేపు తొలిజామునఁ బ్రయాణమున కాయితము కమ్మనుము. తన యశ్వహృదయము మాహాత్మ్యముఁ బ్రకటించుట కిది తఱియయ్యెనుము. ఈవింత చూడవలయు. సుదేవా ! భోజనమువేళయయినది - లెమ్ము.

(నిష్క్రమింతురు.)

---

తృతీయరంగము - ఋతుపర్ణునిల్లు.

---

[ప్రవేశము: బాహుకుఁడు. (జాబుతో)].

బాహు—హా ! హా ! దమయంతీ !

(అనుబంధము - 14.)

సీ. నాథనామక్రియా నవ్యమై ఖరిభామ
నన్ను బాయవటంచు నమ్మియుంటిఁ
గల్యాణియిటు క్రూరకార్యంబు గావింపఁ
గలవంచుఁ గలనైన దలఁపనైతి

లతో నాలోచించి, తత్పూర్వస్సరముగ రాఁగలశుద్ధపంచమీ శుభవారమునరాత్రి పదు
నాలుగడియలకు మేషలగ్నమున—"

ఋతు—బాహుకా! ఏమట్లూరకున్నావు! ముందేమున్నది? చిత్రముగానున్నదిగదా!

బాహు—రాజేంద్రా! నాకుఁగన్నులు పచ్చనై కానరావు.

ఋతు—అయ్యో! నీకు నేఁడేల యిట్లయ్యె? వైద్యులఁబిలిపింతునా?

బాహు—వలదు - కొంతసేపున కదియేనిలుచును.

ఋతు—మంత్రీ! ఆజాబునీవుచదువుము.

మంత్రి—(తీసికొని)—"మేషలగ్నమున దమయంతికి ద్వితీయస్వయంవరము జరుగు
నట్లు నిష్కర్షచేసి యున్నాను."

బాహు— (నిష్క్రమించును.)

ఋతు—సుదేవా! ఇదేమివార్త?

సుదే—ఏమి?

ఋతు—ఇదేమి ద్వితీయస్వయంవరము?

సుదే— ఏల? "నష్టే మృతే ప్రవ్రజితే క్లీబే చ పతితే పతౌ,
పంచస్వాపత్సు నారీణాం పతిరన్యో విధీయతే."—

ఋతు—మంత్రీ! మనపురోహితులు రాలేదు.

సుదే—శాస్త్రవిచారమున నేను గావలసినంత వాదింపఁగలను.

(అనుబంధము - 43.)

ఋతు—సీ. ఘనసతీగుణము పెంపునమున్నె తానళ
ధారుణీశునిఁ మదిఁగోరుకతన
ననఘుఁ డింద్రుఁడెవచ్చి తనపాణి వేడినఁ
గనకాంగి వినదయ్యె ననుచువింటి
మలఘుపతివ్రతా తిలకంబు దమయంతి
యనుకీర్తి జగమెల్ల నల్లుకొనియెఁ
గడునబ్బురపు వింతగాఁ దోఁచెభూదేవ
తిలక నేఁడీవార్త వెలసెననినఁ

ఆ, వె. దనరఁగొంకులేక దమయంతి మనసార
దీనికిప్డు సమ్మతించినదియె
యవనినాథ కోటికనువార నాభీమ
రాజెయిట్టి కమ్మవ్రాసినాఁడె.



సుదే—పూర్ణముగాఁ జదువుకొనుఁడు.

మంత్రి—"—ద్వితీయస్వయంవరము జరుగునట్లు నిష్కర్ష చేసియున్నాను. కాఁబట్టి
భవాదృశులగు రాజన్యవరేణ్యులీస్వయంవరమున కాహూయమానులు కాఁబడు
చున్నారు.

| | |
|---|---|
| విదర్భ<br>మార్గశీర్ష బ॥ ౧౧<br>భానువారము. | ఇట్లు విన్నవించు<br>"భీముఁడు" |

ఋతు—(జాబు చేతఁదీసికొని) భీమరాజుచేవ్రాలును ముద్రయునున్నది. "రాఁగల శుద్ధ
పంచమి.—" ఎల్లుండియే స్వయంవరమా? ఇదెట్లుపోవచ్చును?

సుదే—మీబాహుకున కశ్వహృదయము తెలియునని యు నూఱుయోజనములైన నొక్క
దినమునకుఁ బోవునట్లు రథముగడపఁగలఁడనియు నీవే నాఁడుగ్గడించితివే.

ఋతు—ఔను - బాహుకుఁడేఁడీ?

మంత్రి—పిలిపింతునా!

ఋతు—వలదు - రేపు తొలిజామునఁ బ్రయాణమున కాయితము కమ్మనుము. ఈన
యశ్వహృదయము మాహాత్మ్యముఁ బ్రకటించుట కిది తఱియయ్యెననుము. ఈవింత
చూడవలయు. సుదేవా! భోజనమువేళయయినది - లెమ్ము.

(నిష్క్రమింతురు.)

---

తృతీయరంగము - ఋతుపర్ణునిల్లు.

---

[ప్రవేశము: బాహుకుఁడు. (జాబుతో)].

బాహు—హా! హా! దమయంతీ!

(అనుబంధము - 14.)

సీ. నాథనామక్రియా నవ్యనై ఖరిభామ
నన్ను బాయవటంచు నమ్మియుంటిఁ
గల్యాణియిటు క్రూరకార్యంబు గావింపఁ
గలవంచుఁ గలనైనఁ దలఁపనైతి

ఆరభిదురపాణి యావాసమునసుండి
నరకసీమను ద్రోయుకరణియయ్యె
మోహనాకారు నీముద్దు కుమారుని
నైన విచారింప వైతివకట

తే. గీ. కావఁడా యమృగావళిఁ గనకపాయు
క్రించుదనమున కది ప్రతిక్రియయె నాకు
భూవరాళిఁ గడుదలవంపులు ఘటించి
గుట్టలకు నన్నుఁ దోలితే కువలయాక్షి.—

అహా! ఇదికలయో కల్లయో తెలియఁజాల. నాసంతాపమున కెన్నఁటికైన మేర గలుగునని యెంచియుంటిఁగాని యిట్లౌనని యొకనాఁడుందలంపను. నాదమయంతి యిట్లొనర్చునని కలనైన నెంచి యుంటినే! ఆహా! స్త్రీజనము నెందైనవిశ్వసింపవచ్చునా! ఎంతసాహసము! ఎంతమాయదారితనము! సార్వభౌముని భార్యయనిపించుకొని యొక కుమారునిగని యిన్నాళ్లకిపుడు స్వయంవరమా? నాపై నెంతప్రేమయున్నట్లు నటింపుచు వచ్చె. ఆహా! ఒక్కరి నేలయనవలె? నట్టడవిలోఁ గట్టిడినై త్రోసివచ్చిన నన్నే యనుకొనవలయు. ఈ సుదేవుఁడు మొన్నఁగదా దమయంతి విదర్భపురిఁ జేరెనని చెప్పెను. సంతసించితినే. పదవిఁబాసి నీచస్థితినున్న నేను విదర్భకెట్లు పోవఁగలనని సంకోచించుచున్నవాఁడ యోచించి యోచించి యెట్లయినను మానమయంతియొద్దకుఁ బోయెదనని నిన్నఁగదా నిశ్చయించితి! ఇంతలో నీయుట్టిపాటు కలుగునే? అయ్యో! ఈస్వయంవరమునకు నన్ను రమ్మనుచున్నాఁడే యీ ఋతుపర్ణుఁడు - నే నెవరితోఁ జెప్పికొందును.

హా! దమయంతీ! నీనలునినిట్లు పరిభవింతువే? ఆపాపపు జూదమాడుటకు ముందటినాఁ డుద్యానవనమున విహరించుచో నాడినమాటలంతలో మఱచితివా? నీవు మఱి యొక్కని జెట్టవట్టి నాముద్దుకుమారు నేమిచేయ నెంచితివి? కుమారా! ఇంద్రసేనా! నీపై మోహముసహితము దమయంతికిఁ దీఱెనా?

అక్కటా! నేఁడెట్టిదుర్దినము. ఎంతమాటవింటిని! దమయంతీ! స్వయంవరకాలమున దేవేంద్రునంతటివాఁడు వేడినను వలదని నన్నుఁజేపట్టలేదా! నిషధపురము చేరినదిమొదలొక నిమిషమయిన నన్నుబాయఁజాలని కారణమునఁ దలిదండ్రు లెంతవేడికొన్నను బుట్టినింటికైనఁ బోవకయుండలేదా? దుర్ద్యూతమున రాజ్య సర్వస్వము నోడినను "నీవొకఁడవు నాకుగట్టిగానున్నవాఁడ వింతయేచాలు" నని ధైర్యము వహింపలేదా! పురమువాసినే వచ్చునపుడు పుట్టినింటికిఁ బొమ్మని నేనెంతచెప్పినను మానక చిన్నికుమారుని సైతమువిడిచి నావెంట రాలేదా? పక్షులు నావసనము హరించి



నపుడు తనవస్త్రములోని భాగము నాకుఁగట్టనిచ్చి యాగతికి నేను దుఃఖింపఁగా "నాథా! ఎట్టియాపదలువచ్చినను మన మెడఁబాయకుండుటకు మోహబంధమునకుఁ దోడుగా మనకు వసనబంధ మొక్కటి కలిగినందుకు సంతోషించెద" నని పల్కి నాదుఃఖముపనయింపలేదా? అక్కటా! అట్టి దమయంతి కిట్టిబుద్ధియా? నమ్మఁజాల నమ్మఁజాల.

నమ్మకున్న నీజాబున కేమనవలయు? (చదువుచు) "రాఁగలశుద్ధపంచమీ కుజవారమున—" ఈజాబు మార్గశీర్షమాసమున వ్రాయఁబడినది. ఏమిది? పుష్యమాసమునఁ బెండ్లిచేయుదురా? అదిగాక యంగారకవారమున - అందునఁ బంచమీకుజవారము - దగ్ధయోగమున - చిత్రముగానున్నది. "రాత్రిపదునాలుగడియలకు—" నిశీథమున లగ్నమా? "మేషలగ్నమున—" ఏమిలగ్నము? అది యట్లుండ నిది మకరమాసముకదా? రాత్రిపదునాలుగడియలకు మేషలగ్న మెక్కడ రావలయు? ఏమి చోద్యము!

ఈ సుదేవుఁడు తొలుతవచ్చినపుడు నన్నుచూచి నలునినని యూరకదూషింపుచు వచ్చె. నేను దానికిఁదగిన ప్రత్యుత్తరములనొసంగితి. ననుగుఱుతించియుండునా? ఆనాఁడు వార్ష్ణేయుని నాపండుకొనుచోటడిగి నన్ను మాటలాడింపవచ్చెదనని చెప్పినట్లు మఱునాఁడు వార్ష్ణేయుఁడు నాతోఁ జెప్పెను. ఆరాత్రి నాకు నిద్రరాక దమయంతీవియోగమువలని పరితాపమున నేమేమియనుచుంటి - ఈ సుదేవుఁ డచ్చటికివచ్చివినియుండునా? విని యుండెనా నన్ను నిక్కముగఁ దెలిసికొనియుండును - అతఁడుపోయి కొన్నాళ్లైనను గాలేదు. నేఁడీజాబుతెచ్చియున్నాఁడు. ఇవియన్నియు యోచింపఁగా సుదేవుఁడు నన్నుఁ గుఱుతించిపోయి భీమరాజుతో నాలోచించి దమయంతి విదర్భచేరిన వృత్తాంతము తెలిసిన పిదపనైన నావిషయమున సుదేవుని నేమందలింపమి నీఋతుపర్ణుని యూడిగమువిడిచి వెలికిఁబోవుటకు నేనుద్దేశింపలేదని తలఁచి ఋతుపర్ణు నన్ను విదర్భకురప్పింప నీయుక్తి వెదకినట్లున్నది.

అయ్యో! నాకెట్టిమరులు! మోహవశమునఁ గారణములన్నియు సమకూర్చుకొని నాముక్కనకు సరిచూచుకొని లేనిసంతోషము దెచ్చుకొనుచున్నాను. ఇదియెక్కడనైన సరియయిన యోజనయా? తొలుతనే రూపముమాఱిన సంగతి యితరులకెట్లు తెలియవలయు? వెదకవచ్చువారు స్వభావరూపమున్ననలుని వెదకెదరుకాక నన్నెట్లువెదకెదరు? ఎట్లు గుర్తింపఁగలరు? గుర్తించియుండిన సుదేవుఁడప్పుడే నాతో మాటలాడియుండఁడా? నన్నురప్పింపఁగోరుదురేని యేదేని కారణము కల్పింపక చెప్పరాని యిట్టిస్వయంవరము కల్పింతురా? రాజర్షితిలకుఁడై మాన్యుఁడగు ఋతుపర్ణునంతటివానికిట్టియుపోహమైన జాబు భీమరాజు వ్రాయునా? స్వయంవరమే నిశ్చయము - పగలు పదునాలుగడియ లనుటకుఁ బొరపాటున రాత్రి పదునాలుగడియలని వ్రాయఁబడియుండెఁగాఁబోలు. ఇట్టిస్వయంవరమున కిట్టివేళలగ్నములుండ వలయుఁగాఁబోలు.

హా! హా! నిర్భరము! దైవమునన్ను సంకటపెట్టవలెనన్న నెన్నిమార్గము లుండ లేదు. ఆఁకలి దప్పులచే శుష్కింపఁజేసియున్న నోర్చుకొనుచుంటిని. తాళఁగూడని బాధలఁగలిగించు నెన్నివ్యాధులు నాకుఁ గలుగఁజేసియున్నను దాళుకొనుచుంటిని- పరులకు నన్నాజన్మదాసునిఁగాఁజేసి కూడులేనికష్టము కలిగించియున్నను దాళుకొనుచుంటిని - సజీవునిగా నన్నుదహించిన నోర్చుకొనుచుంటిని - పంచాగ్నులమధ్యమున వేడిపెనముపైనను వేయించి చలచలక్రాఁగు తైలమునముంచియున్న దుఃఖించియుండను- ప్రాణములన్నియుఁ గొంచెము కొంచెముగానూడ్చి యుసురుగొనియున్నఁ జింతించి యుండను.

ఆక్కటా! ఇప్పుడా? నామనోబుద్ధుల నెవరిపై నెలకొల్పియుంటినో; నాప్రాణమే యిది యని యెవరిననవరతము తలంచుచుంటినో; ఎవరికిఁ గొంచెము చీమగఱచినంత బాధగలిగిన లోకమేమునిఁగి నట్లెంచుచుంటినో; ఎట్టిదుఃఖము లెట్టియాపద లెట్టిసంకటములువచ్చినను, ఎవరిఁదలఁచుటవలన మఱచి, చూచుటవలన శ్రాంతిఁజెంది, కౌఁగిలించుటవలనఁ జింతఁబాసి సమ్మదిఁగనుచుంటినో; అట్టినామోహంపుటన్న; నాముద్దులగుమ్మ; నావలపులబరణి, నాచిలుకలకొలికి; నాప్రాణంపు బంగారుబొమ్మ; నాదమయంతి;— హా! నాదమయంతి—నాకన్నులయెదుట మఱియొకని వరించినదిగేఁజూచియోర్చి ప్రాణములభరియింపఁగలనా? దమయంతీ! కనికరించ కడవిలోనిను బాసివచ్చిన కృతఘ్నుఁడనే యగుదుగాక నీకుఁ బగదీర్చుకొనుట కిట్టిదియా యుపాయము?—

హా! సౌఖ్యమా! నీవు నాతలఁపున కింకరాకుము—సంతోషమా! నీకునాకుఁగడు దూరము— మోహమా! స్థలాంతరమునకుఁ బొమ్ము— లోకమా! నీవు నాకింక వాడు—ప్రాణమా! ననువెడలిపొమ్ము—ఇంద్రసేనా! నీకిఁకఁ దండ్రి యెవఁడు?— గిరులారా! నాతలపైఁబడుఁడు— మారుతములారా! నన్నెందైనఁ గొనిపొండు— అగ్నులారా! నన్నుదహింపుఁడు—భూమ్యాకాశములారా! మీరేకమైనన్ను నలఁచి వేయుఁడు—హా—దమయంతి—దమయంతి—మోహము—పాపము— ప్రాణము— పుణ్యము—స్వయంవరము—దమయంతీ—ద్వితీయ స్వయంవరము.—

(మూర్ఛిల్లును).

## తురీయరంగము - దమయంతియంతఃపురము.

దమయంతియు - సుదేవుఁడు నుందురు.

సుదే—నాలుగు జాములలో నయోధ్యనుండి యిచ్చటికిఁ దెచ్చిన యశ్వహృదయవిద్య యింకెవరికిఁగలదు?

దమ—సుదేవా! అట్లయినింకేమియు సందేహము గలుగదుగదా?

సుదే—ఇంకేమి సందేహము? కావలసియున్న నీవును బరీక్షింపుము. మననగరున నే వారికి విడిదిచేయించి యున్నాను.

దమ—నేనేమి పరీక్షింతును?

సుదే—అంతఃపురసేవకులఁబంపి మర్మములారయుము - నీవును మఱుఁగుననుండి ధ్వని చందము వినుము - నీగుమారునయ్యెడకుఁబంపుము - ఇట్లనేలేదా?

దమ—మాతండ్రిజాబువలన నానాథుఁడు నన్నేమనియెంచి యుండును?

మ. నగుబాటుప్పతిలంగ సాహసముననన్నాతండ్రి యాలేఖవ్రా
యఁగఁ గానిమ్మని నేనొడంబడితినా యత్యంతపాపంబు పెం
పుగదావానలుఁడేచి శుష్కవిపినంబుంగాల్చు చందంబుదోఁ
చఁగనామానసవీధి నేర్చుఁగదయుశ్రాంతంబు భూమీసురా.

సుదే—అవును - చేయవలసినదేమి? సందర్భములమీఁద నిక్కము తెలియదా? ఋతుపర్ణుఁడుసయితము రాజులొక్కరును రాకుండుటఁజూచి భ్రాంతుఁడై యున్నాఁడు. ఏమేమొ విచారించుచున్నాఁడు. నేఁబోవలయు.

(నిష్క్రమింతురు.)



## పంచమరంగము - భీమరాజునగరున నొకవంటయిల్లు.

[ ప్రవేశము : బాహుకుఁడు - (వంటచేయుచుండును.)].

బా— ఉ. కేరడమయ్యెఁ గమ్మఁబరికింపఁగ జేఁపెక దాస్వయంవరం
బారయధారుణీశుఁ డొకఁడైనను రాఁడు పురంబులోన శృం
గారముగల్గదింటను వికాసములేదు ప్రయత్నమింకనే
దారియొ నిద్రఁగాంచినవిధంబుననున్న దిదేమిచిత్రమో.

ఆ. వె. ఏఁదలంచినట్లుగాఁ దోఁచినమ్మృషాస్వ
యంవరంబె యగునొ యకట నేను
రూపుమాఱియుండ రూపింపనెట్లగు
నింతదైనఁ దోఁపదిపుడునాకు.—

[ ప్రవేశము : భారతి.]

బాహు—నీవెవరు ?

భార—కం. కూరిమిగలయంతఃపుర
చారిణినీభీమరాజజంభారికినేఁ
గూరుచుసఖదమయంతికి
భారతియనుదానసరసపాకనిధానా.

బాహు—ఇక్కడి కేలవచ్చితివి ?

భారతి—రాఁగూడదా !

బాహు—మగవారున్నచోట నీకేమిపని ?

భారతి—నీవు ఋతుపర్ణుని వంటవాఁడవుగదా ?

బాహు—అవును - అయిన ?

భారతి—వంటలవారిమేము పురుషులలోగణింపము - కాఁబట్టి యవశ్యము రావచ్చును. (కూర్చుండును).

బాహు—నీవు సమర్థురాలవే.

భారతి—నీ సామర్థ్యము వంటసెట్లో నాసామర్థ్యము మాటలయందట్లు.

బాహు—నీకు స్వయంవర కార్యము లులేవా ? ఇట్లేలవచ్చితివి ?

భారతి—స్వయంవరకార్యమునకే వచ్చియున్నాను.



బాహు—నాకర్థముకాలేదు.

భారతి—అర్థముకాలేదా ? నేఁజెప్పెదను. స్వయంవరమనఁగాఁ బెండ్లి, కార్యమనఁగాఁ బని, వచ్చియున్నాననఁగా వచ్చియున్నాను.

బాహు—ఈచమత్కారము లింకఁజాలును. మీయజమానురాలియొద్దకుఁబొమ్ము.

భారతి—నాకు నేనే యజమానురాలను - వేఱెవ్వరున్నారు ?

బాహు—మీదమయంతి యుండలేదా ?

భారతి—అయ్యో ! ఆమెజీవించునట్టు లుండినఁగదా ?

బాహు—(ఆతురతతో) ఆమెకేమైనది ?

భారతి—ఆమెసుమారుని కింద్రసేనునికి మి—క్క—లి—ఆహా ! నీవుచేయు పదార్థము లెంతమంచివాసన వచ్చుచున్నవి ?

భాహు—భారతీ ! ఇంద్రసేనున కేమి ?

భారతి—ఈసంభారముల నీవప్పుడప్పుడు చేసెదవా ! లేక యొకటేసారి చేసిపెట్టుకొందువా !

బాహు—భారతీ ! ఇంద్రసేనునకేమి ? దయచేసిచెప్పుమా.

భారతి—ఇంద్రసేనుఁ డెవరు ?

బాహు—దమయంతికొడుకని నీవంటివే.

భారతి—ఊఁ—ఋతుపర్ణుని వంటలవానికి నీకు దమయంతికొడుకుపై నేమిదింత ?

బాహు—మారాజును స్వయంవరమునకు వచ్చియున్నందున నడిగితిని.

నేపథ్యమున "భారతీ" యని ధ్వని

భారతి—ఇంద్రసేనా ! ఇదిగోవచ్చితి. ఈచిన్నవాఁడు నలునికిఁ దగినట్లే పుట్టియున్నాఁడు.

బాహు—అదేమి ?

భారతి—అయ్యో ! నీపేరేమి ?

బాహు—వ—బాహుకుఁడు.

భారతి—వ బాహుకుఁడా ?

బాహు—కాదు - బాహుకుఁడు.

భారతి—కాదు బాహుకుఁడు. కాదు బాహుకుఁడన్నను వబాహుకుఁడన్నను నొకటియేకదా !

బాహు—అటుకాదు - నాపేరు బాహుకుఁడందురు.

భారతి—ఎవరు ? నిను తెలియనివారా ?

బాహు—ఏమిమాటలివి ? అదియుండనీ - ఇంద్రసేనుఁడు నలునికిఁదగినట్లు పుట్టినాఁడంటివే అదేల ?

భారతి—నలుఁడెంత క్రూరకర్ముఁడో వీఁడిప్పటినుండి యంతదుడుకువాఁడు.

మరలధ్వని " భారతీ " యని.

ఇంద్రసేనా! ఇదె వచ్చితిని. (ప్రక్కకు నిష్క్రమించును).

[ప్రవేశము : ఇంద్రసేనుఁడు.]

ఇంద్ర—మాభారతియెక్కడ?

బాహు—(దిక్కులుపరికించి) ఇక్కడనే పోయియున్నది. ఇప్పుడు వచ్చును. కూరుచుండుము.

ఇంద్ర— (కూరుచుండును).

బాహు—కుమారా! నీవెవరవు!

ఇంద్ర—దమయంతిదేవి కొడుకును.

బాహు—మీయయ్యయెవరు?

ఇంద్ర—నళరాజు.

ఆ, వె. నాకుమార రార నాతండ్రి రార నా
కూనరార ముద్దుకుఱ్ఱరార
నాయనుంగరార నాబాలరార నా
చిన్నిచిలుకరార యన్నరార.—

(అనుబంధము-45.)

(ముద్దులాడును).

ఇంద్ర—నీ వెవరవు? నన్ను విడువుము. మాయమ్మకొట్టును.

[పునఃప్రవేశము - భారతి].

భారతి—అయ్యో! ఇంద్రసేనా! ఇక్కడికేవచ్చితివా? ఇదేమిబాహుకా? (బాలుని విడిపించి) నలునికిఁగాక యింకొకరి కీకుమారు నెత్తికొనఁదరమా?

బాహు—నాకొడుకిట్లే యున్నఁడున నెత్తికొంటినిందేమితప్పు.

భారతి—నీరూపమున కిట్టికొడుకొకఁడుండెనా? మంచిమాటయ్యో. ఓహొ నాభార్య యిట్లేయుండెనని దమయంతిని గౌఁగిలించికొందువు కాఁబోలు.

బాహు—అయిన క్షమింపుము.

భారతి—క్షమింపవలసినదేమి? నీకుఁ బిచ్చిపట్టియున్నది.

బాహు—(స్వగతము) నిక్కముగా నాకుఁ బిచ్చియేపట్టియున్నది. (ప్రకాశము) భారతీ! స్వయంవరప్రయత్నములు నాకేమియుఁ జెప్పకపోయితివి.

భారతి—స్వయంవరమా? ప్రయత్నమా? నలుఁడువచ్చినఁగదా స్వయంవరము.

బాహు—అదేమి యిట్లంటివి? నలుఁ డెక్కడనున్నాఁడు?

భారతి—పాముకఱచి విరూపుఁడైన నలుఁ డిక్కడనున్నాఁడని నేఁ జెప్పగలనా?

బాహు—(ఔచ్చపడును).



ఇంద్ర—భారతీ! మాయయ్యను పాముగఱచినదా? నేఁడు వచ్చుచున్నాఁడని నిన్నఁ జెప్పితికే.

భారతి—ఔనమ్మా - మఱచితి - నేఁడేవచ్చును.

ఇంద్ర— (అనుబంధము - 46.)

తే, గీ. అమ్మనీమాటలింక నేనమ్మఁజాలఁ
బరఁగమాయయ్య నేఁడిందువచ్చునంటి
వచ్చినంతనె నన్నుదా మెచ్చునంటి
వింతలోనను ఋటులాడితేమనంగ.

తే, గీ. కటకటాపాము మాయయ్యఁ గఱచె నెట్లు
అప్పుడీమాట నాకేల చెప్పవైతి
చెప్పియుండినఁబోయి యాచెనఁటిపాముఁ
జంపియుండనె యయ్యకు నింపుగలుగ

ఆ, వె. ఇన్నినాళ్లుదాఁచి తీసుద్దియింకేల
యెట్లుపాముగఱచె నేమిపుట్టె
నయ్యనేఁడు వచ్చుటది నిక్కమోకాదొ
యిప్పుడైన నిజము చెప్పుమమ్మ.—

బాహు—(భారతియొద్దనున్న యింద్రసేను ముద్దాడును.)

భారతి—మరల నిదియేమి నళరాజా—కాదు మఱచితి—బాహుకా?

బాహు—ఇట్టి ముద్దుమాటలాడు చిన్నపాపఁ డెవ్వరివాఁడైన నేమి ముద్దిడుకొనుట దోసమా!

భారతి—ఇంకఁజాలును - ఇంద్రసేనా! మనమిక్కడనుండరాదు - మీయయ్యవచ్చియే యున్నాఁడు. అతనివృత్తాంతమంతయుఁ జెప్పెదరమ్ము.

(అని నలుఁనిఁజూచి నవ్వి యింద్రసేనునితో నిష్క్రమించును.)

బాహు— తే, గీ. పూర్ణదుఃఖైక హృదయ సంభూతతాప
శోషణములౌరనుతుల యాశ్లేషణములు
విపులసమ్మోదసుఖకరావిరత కర్ణ
భూషణములౌర తనయుల భాషణములు.

(నిష్క్రమించును.)

———

## షష్ఠరంగము - భీమునాస్థానము

[ప్రవేశము : భీముఁడు - మంత్రి - సుదేవుఁడు - ఋతుపర్ణుఁడు - వార్ష్ణేయుఁడు - బాహుకుఁడు - దమనుఁడు.]

ఋతు—భీమరాజేంద్రా! నీవు చెప్పినరీతిగా శాస్త్రార్థవిచారముచేయు బ్రాహ్మణులుగాని స్వయంవరాహుతులైన రాజులుగాని రాలేదు.

సుదే—మనకిప్పుడు శాస్త్రార్థవిచార మెందుకు? ముందు మన ప్రప్రపౌత్రులు జగడములాడి రాద్ధాంతసిద్ధాంతము లొనర్పరి.

ఋతు—భీమరాజా! ఇదేమి సుదేవుఁ డిట్లనుచున్నాఁడు?

భీమ—రాజర్షిచంద్రా! నాయపరాధము క్షమింపవలయునని నమస్కరించి వేఁడెదను.

ఋతు—అదేమి?

భీమ— ఉ. కాంతదిగంతసంచయవికాసితచంద్రవిభావిరాజితా
నంతయశస్సనాథుని నళావనినాథు వరించినట్టి దు
ర్దాంతపతివ్రతా మహిమ ధన్యను వెండియుఁ బెండ్లిసేయఁగా
నంతటి మూర్ఖజాతుఁడనె యంతటివెఱ్ఱినె యంతద్రోహినే.

ఋతు—ఐన నన్నిట్లు నవ్వులు చేయుట నీకుఁదగునా?

సుదే—క్షమింపవలయు - నీయొద్ద నలుఁడుండుట యెఱిఁగి నీవువచ్చిన నతఁడువచ్చుననియు, నిరతకర్మరతుఁడవై యాహితాగ్నివగు నీవిట్టియాశ్చర్యము చెప్పకున్న రావనియు, నీ దుష్టోపాయము నేన చెప్పిచేయించితి.

ఋతు—నాయొద్ద నలుఁ డెక్కడనున్నాఁడు?

సుదే—(పనసచెప్పి ఫలమంత్రాక్షతలఁగైకొని.)

సీ. తనసుప్రతాప మార్తాండున కరిరాజ
సమితి తేజముఁ దిమిరముగఁ జేసెఁ
దనఖడ్గకాలాహికిని వైరిచతురంగ
బలములు గంపితా నిలముఁ జేసెఁ
దనధనుశ్చంద్రున కనువారరిపురాజ
శిరములఁగమల మంజరులఁ జేసెఁ
దనబాణదావానలునకు విపక్షభూ
రమణసేనల నింధనములఁ జేసె



తే, గీ. రాజమాత్రుండె యతఁడు విరాజమాన
రాజగిరిరాజగజరాజరాజరాజ
ఘనసచివపాండురాంభోజ కల్పభూజ
చారుతరకీర్తి శ్రీనళచక్రవర్తి.—

సీ. పృథుమేఘుఁ డెవ్వాని విశ్రాణనంబున
భరమువిూఱఁగ వారివాహుఁ డయ్యె
జలనిధి యెవ్వాని యలఘుగభీరతఁ
బరఁగనాపోశనప్రాయ మయ్యె
భాస్కరుం డెవ్వాని భాస్వత్ప్రతాపధా
మంబున ఖద్యోతమాత్రుఁ డయ్యె
భూతేశుఁ డెవ్వాని యాత్తైశ్వర్యవై
భవమునఁ దాఁగృత్తివాసుఁ డయ్యె

తే, గీ. నతనికతనుప్రతతశుభాకృతికినచల
ధృతికినతులితరిపుజయోన్నతికి వితత
మతికిఁగృతవాసవనుతికివితథదుర్వ్యా
దతికయాహంకృతికిశుభంబడరుఁగాఁత.—

వీరసేన గర్భపారావారరాకాసుధాకరుఁడై సర్వసర్వంసహాభారముఁ దనభుజాయుగముపైఁ దోలుకాడకుండవహించి, భీమరాజపుత్రినిదమయంతిని బాణిగ్రహముఁ గావించి, పుత్త్రీజననసమ్మోదమునహించి, కలిప్రేరణచేష్టాతినిర్మిత మాయాదురోదర వాగురాబద్ధుఁడై రాజ్యమునంతయునోడి, జాయాసహితుఁడై యరణ్యముఁబ్రవేశించి, విధికృతంబున నందు సతీమణినివిడనాడిపోయి, ఘోరారణ్యమున సర్పదష్టుఁడై వికృతరూపముఁగాంచి పాచకాశ్వశిక్షకాధికారముల బాహుకనామంబున ఋతుపర్ణునాశ్రయించియుండి భగవదనుగ్రహమున మాచేవిజ్ఞాతచిహ్నుండైన ధీరగుణస్ఫూర్తి, సజ్జనాధారదిగంతవిదితవిశ్రాణనానువర్తి, దుర్జన దుర్మదనివర్తి, లోకామోదకరశుభమూర్తి, సిద్ధసత్యకీర్తి, శ్రీనళచక్రవర్తికి శుభమగుంగాక (ఫలాక్షతలు బాహుకున కివ్వఁబోవును).

బాహు—(తీసికొనక) అయ్యో! నన్నిట్లేల నవ్వులాడెదరు? లోకమునఁ గురూపులెందరుండరు? ఇంత యెగతాళియేల?

సుదే—నళభూమీశా! నీవేలదాఁచెదవు? నిన్ను వెదకుచు నేనిఋతుపర్ణునికొలువున నలుని మాపించినందుకు నీవునొచ్చుకొని ప్రత్యుత్తరమిచ్చినరీతి యెఱుఁగనా? ఆ

రాత్రిదమయంతీ వియోగమున నీవుదుఃఖించుచుండినది వినలేదా? మొన్నఋతుపర్ణునికి భీమరాజువ్రాసిన జాబు చేనిచ్చినపుడు నిన్నుజదువుమనఁగా నీవుపడిన సంతాపముచూడనా? అయోధ్యనుండి మూడుజాములలో విదర్భకు రథముఁగొనివచ్చిన యశ్వహృదయసామర్థ్యమునఁ దెలిసికొనఁగూడదా? నిన్నదమయంతి చెలికత్తియయగు భారతితో నీవుమాటలాడినజాడ తెలియదా? నీకుమారునిజూచినపుడు నీవొనర్చిన భంగిచాలదా? ఎల్లదృష్టాంతములకంటె నెక్కుడగు నీధ్వనివలన నినుదెలియఁజాలమా? ఇం కెంతకావలయును?

వార్ష్ణే—(స్వ) ఆహా! మా నళరాజుధ్వని యిప్పుడు జ్ఞప్తికలిగె.—

బాహు—రాజర్షిచంద్రా! నీవుండియు నన్నిటుహాస్యము చేయించెదవా?

ఋతు—నీచరితమద్భుతముగానున్నది నాకేమియుఁదోఁచకున్నది.

భీమ—నళరాజా? నీకేలకరుణగలుగదు?

(అనుబంధము - 47.)

చ. నళుఁడవు నీవెకావె జననాథపురందరదాఁచనేలనీ
లలనకు నైన బాధలఁ దలంపక యున్ననుమానెనేమియుఁ
దెలియనిపాపఁడై విమలధీనిరతిఁ జనకావలోకవి
హ్వలుఁడగు నీ కుమారుఁగనినైన ముముంగరుణించికావవే.

(అని యింద్రసేను బాహుకునొద్దకుఁదెచ్చును).

బాహు—భీమరాజన్యా! మీదమయంతి ద్వితీయస్వయంవరము చేయించుపుణ్యకార్యమున కేలయాలస్యము చేసెదవు?

సుదే—నళరాజా!

కం. భ్రమియింపఁగ భీకరవిపి
నములన్విడఁబాసినట్టి నాథునిమరలన్
దమయంతి వడయుటయె భూ
రమణ ద్వితీయస్వయంవరం బగుఁగాదే.

భీమ—భూమీశా! నేఁబాపాత్ముఁడను - విధిలేక యీదుష్కార్యమున కొప్పికొంటిని.

[ప్రవేశము: దమయంతి - (కన్నులనీరునించి.]

(అనుబంధము - 48.)

దమ—సీ. పాపంబునాయది ప్రాణేశ యిందున
కెవరేమి సేయుదు రేమనంగ
రాజ్యహీనత విదర్భకురానటంచునీ
వన్నకతంబున నిన్నుజూచు



పేరానవనిటకురప్పింపనీ నీచపా
పోక్తులవచియింప నొప్పికొంటి
విమలాత్మనీవియోగమునఁ జావఁగలేక
పాపంబునను జావఁబాలుపడితి

తే, గీ. నెట్టులును జావు నిజమాటనెంచినీదు
చరణసన్నిధిఁద్రుప్తిమై మరణమొంద
నాకలుష లేఖకొప్పితి నంతెకాని
పాప మింక నొండెఱుంగ నీపాదమాన.—

(అని పాదములపైఁబడును.)

బాహు—(కన్నీరునించి).

తే, గీ తరుణినను ముట్టకీస్వయంవరమునందు
ననువుమీఱంగ నీకగు నాథుఁడెవఁడో
వానిచరణములంటంగ వలయుఁగాక
యన్యులనుముట్టఁబోలునే యఘముగాదె.

సుదే—నళరాజా! ఈస్వయంవరము నిశ్చయమని నమ్మితివా? ఈఋతుపర్ణుఁదుతప్ప నితరరాజులెవరైన వచ్చియున్నారా? ఎట్టిప్రయత్నములైనఁ గనుపించుచున్నవా? ఆజాబునైనను బరికించిచూచియుండవా? ఇంత యోచింపలేవా?

దమ.— (అనుబంధము - 49.)

సీ. నేమాయిటులేవ వైరమాసదయవి
చారమా సురుచిరాకారమార
శ్రేయమాఘసంప్రదాయమా విడనాడ
నాయమాసంత తామ్నాయమార్గ
యందమాకరుణాత్మ చందమాయకటయా
సందమా పుడమిరాచందమామ
కోపమాసరసల్లాపమా లేకనా
పాపమాచలమూన భూపమాన్య

తే, గీ. యింతమానని యెక్కుడు వంతమాదు
రంతమా యెవియోగాగ్ని యింతమాత్ర
వంతమాయెనె కూర్మియలంతమాని
వంతమాన్పవెయిదియేటి వింతమాద్రి.

ప్రాణేశా! మనోవాక్కాయ కర్మంబుల నిన్నుదప్ప నితరుల నపేక్షించు దానఁ గాను, నామనశ్శుద్ధియరయుటకు నీవేమిచేయుచున్నను జేయుదును. అగ్నినుఱుకు మన్న నుఱుకుదును. భగవంతుఁడును భూమ్యాకాశములు నిందునకు సాక్షులౌదురు గాక.—

(లోపలధ్వని - సత్యము - సత్యము - అని).

ఋతు—(లేచి) రాజేంద్రా! ఇప్పుడుగదా నీమహత్త్వము నెఱిఁగితి? ఇయ్యుపశ్రుతి యియ్యశరీరవాణికంటె నింక సాక్షులెవ్వరు! సంశయింపకార్తయైన యియ్యువతీ శిరోమణిం బరిగ్రహింపుము.

వార్ష్ణే—రాజచంద్రమా! ఆర్తుల మమ్మెల్ల రక్షింపకున్న విధిలేదు. (కాళ్ళపైఁబడును.)

ఇంద్ర-ఉ. నెయ్యమునించు మాజనకునిం గనుఁజూపక మంతలేదుమా
యయ్యవొ కావొ నేనెఱుఁగ నయ్యది దయ్యమొయుంగు నీవుమా
యయ్యవటంచునమ్మపలుపారఁగ వేఁడెనెఁడవైన నో
యయ్యతలంచియమ్మకొఱకయ్యవుగావిఁసిల్లికావవే.—

బాహు—యువతీ! ముందున్న నలుఁడుకాఁడే యిప్పుడు? ఈవికారాకారునిఁ గట్టుకొని నీవేమిచేసెదవు!

దమ—ప్రాణేశా! ఈమాటలేటికి? రూపమెట్లున్న నేమి? ఎట్లున్నను నీవే నాదైవమవు.

బాహు—(లేచి)

మ. వనిలోనన్నొనరన్నిజాయత విషవ్యాప్తిన్మహాభీమరూ
పునిగావించిస్వరూపమెప్పుడయినంబొందంగఁగాఁక్షించిన
న్దనుభావింపుమటంచుఁ బ్రేమ నరదానంబిచ్చి మన్నింపఁగాం
చినపుణ్యున్భుజగాధినాథునినునే సేవింతుఁగర్కోటకా.

(ఒకవస్త్రము బాహుకునిపైఁబడఁగా నతఁడు రూపమమారి నలుఁడయి).

(అనుబంధము - 50.)

సీ. ఎంచవేనన్ను మన్నించవే కరుణఁబా
లించవే యంచిత చంచలాంగి
కానలోనసమాన మీనలోచననిన్ను
మానలోఁ గనియట్టి హీనుఁడనక
మందగామినిచేటు లొందఁగానలనిన్ను
గందఁగాఁజేసిన మందుఁడనక
కాంతరోయటుమానివంతరోదింపఁగ
నింతరోయనియట్టి హంతయనక



తే. గీ. యెంతవ తాపమాయెనో యింతినీకుఁ
దేర్చినమహాపరాధం బోనర్చినాఁడ
నింతభంగంబుగలిగించి యెట్టులింక
నెమ్మినీతోడ మాటాడ నేర్తునబల.—

(దమయంతియు నలుఁడును నానందబాష్పములునిండార నొకరి నొకరు కౌఁగి లించుకొందురు).

(భీముఁడు సుదేవుఁడుతప్ప నందఱును నలునకు నమస్కారమొనర్తురు).

నలుఁడు—(ఇంద్రసేనునెత్తికొని ముద్దాడును)

ఉ. చిన్నికుమారనావలపు చిన్నరిపొన్నరి చిన్నెలాఁడనా
వెన్నెలతేఁడనామరునివిన్నువుపొప్పెడునన్న కాఁడనా
యన్నతలంచియమ్మకొఱకయ్యవు గమ్మనివేడలేదెపే
రెన్నికనట్టులమ్మకొఱకేటికి నీకొఱకైతినయ్యఁగా.

[ప్రవేశము : (శీఘ్రగమనమున) నొకపౌరుఁడు.]

పౌర—(నమస్కరించి) మహాప్రభువా? భీమరాజన్యా? నామొఱయాలకింపుము. నేను నిషధపురిపౌరుఁడ మాదౌర్భాగ్యవశమున నళరాజన్యుఁడు మమ్ముఁబులివాఁతికప్పగించినట్లు పుష్కరున కిచ్చిపోయె.—

భీమ—ఇప్పుడేమి?

పౌర—దుర్మార్గుఁడగు దేవలునిమంత్రిత్వమునఁ బుష్కరుఁడు మాకుఁగలిగించిన సంకటమింతని చెప్పఁజాలము. ఎన్నాళ్ళని ప్రజలోర్వఁగలరు? ఓర్చియోర్చి తుదకునందఱు నుమిగూడి దేవలునిబట్టిరి. తనకెట్టిబాధలగునో యనుభయమున నాబ్రాహ్మణుఁడు నాలుకగుంజుకొనిమడిసె. పుష్కరుని జెఱలోనుంచిరి. ఇప్పుడిరాజకము గానున్నది. మారాజకుమారుఁ డింద్రసేనుఁడు మీయొద్దనున్నాఁడుగదా? అతనికిఁ బట్టముగట్టి మమ్ముఁ బాలింపకుండిన మాకు వేఱు గతిలేదు.

భీమ—పౌరా? పరికించి యారాజ చంద్రుంజూడుము.

పౌర—(మాచి) ఆహా? నళరాజా! నళరాజా? ఏమిమాభాగ్యము? (నమస్కరించును).

నళ—పౌరవర్యా! పుష్కరుఁ డెచ్చట నున్నాఁడంటివి?

పౌర—ఇప్పుడు నిర్బంధముననున్నాఁడు - ముందేమొ.

నళ—వార్ష్ణేయా! నీవీక్షణమున నిషధకుఁబోయి మొదటఁ బుష్కరుబంధముక్తుఁగావించి నాయాగమనము చాటింపఁబంపుము. ఈపౌరుఁడు కోరినట్లే మనయింద్రసేనునకం దే యువరాజ్యాభిషేక మొనర్తము.

వార్ష్ణే— శా. ఆనందంబులభింపమేనఁ బులకల్ హర్షాశ్రువుల్పొంగఁగా
వేనోముల్ఫలియింపఁ గంటిమినళోర్వీనాథచూడామణి
న్నానాభూపకిరీటసంఘటితరత్నవ్రాతనిర్యాతశో
భానీరాజితపాదపంకజుని మాభాగ్యంబు సామాన్యమే.

(అనుబంధము - 51)

(నమస్కరించును.)

రాజచంద్రమా ! ఇదే నీయానతి నెఱవేర్చెదను - పోరా ? పోదమురమ్ము.

(నిష్క్రమించును).

(అనుబంధము - 52.)

ఋతు. శా. భీమాకారతవంటవాఁడనని యావేషంబున న్నేవకై
కై మోదమ్ముల్లటియించి వేడఁగనునిక్కంబంచునూహించితిన్
ధీమంత్రప్రతిభలణింపమది సందేహించితింగానియీ
నీమాహాత్మ్య మెఱుంగలేనయితి క్షోణీనాథమన్నింపవే.

చ. శమదమసారనీపద రజంబునుబోలెడువారె మాదృశుల్
దమకకచేసినాఁడనిను దాస్యమునందిడి నేమహోపచా
రములను బాచితంబెఱుఁగ రామిఁదలంకెదనోండెఱుంగ భూ
రమణ నమస్కరింతు నపరాధము లెల్లభరించి కావవే.

(నమస్కరించును.)

నళ—లేవనెత్తి (కౌఁగిలించి.)

(అనుబంధము - 53.)

చ. అలఘుయశోనిధానయిటులాడఁగఁబోలునె నన్ను మిత్రవ
త్సలతయెసంగఁ బెంచితివి చాలమిగిల్గినవేళనీకృపో
జ్వలమతినీమహాదరము సన్నుతి సేయఁగఁ జాలమోనపు
న్దలఁపువహించినందులకు నన్నుక్షమింపఁగ విన్నవించెదన్.

రాజర్షితిలకా ! "నళరాజుపేరుచెప్పిన నతఁడేనాయెదుటికివచ్చినట్లాదరింతు" ననివాఁడేయనియున్న నీవు నాయున్నగూపెఱింగిన దాస్యమున నిలుపుచుంటివా ? కడుప్రేమ గారవించుచుంటివి. అదియే మెక్కువ ? బాహుకనామక పాచకుఁడ నన్ను నే యెంతోయాదరమునఁ బాలించితివే. ఇదికదాసత్కృప ? నేరాజ్యభ్రష్టుఁడనైన మానెఁగాక నీసద్యోగములభించు పుణ్యముఁగంటిని-కలిరాజుమహిమవలనఁ గష్టము లొందవెఁగాని వానినన్నింటినీవతీర్చితివి.—



[ప్రవేశము: ఆకాశమార్గమున కలి.]

కలి—నిషధాధీశా! నేనేకలిని, దేవేంద్రునితోఁ బలుకుకొన్న పంతమునకై నిన్నింతపరిభవించితి. నీమనశ్శుద్ధికి నీభార్యపాతివ్రత్యమహిమను మెచ్చితి. ఆచంద్రార్కము నీఖ్యాతినిలుప నేవరమొసంగెద.

కం. ఇల నిను ఋతుపర్ణుని ని
ష్కలుష న్దమయంతి దేవిఁ గర్కోటకునిన్
దలఁచిన భూపాలక యీ
కలిబాధలు వారికెందుఁగలుగవుసుమ్మా.—

(నిష్క్రమించును.)

అందఱు—ఆహా! ఏమిభాగ్యము!

నళ—రాజర్షిచంద్రా? నన్నుమన్నించి నావిజ్ఞాపనము నంగీకరించెదనన్న నొకటిప్రార్థించెద.

ఋతు—రాజతిలకా! నీవాజ్ఞప్తియన్నఁ దనరుఁగాక విజ్ఞప్తికి నేనర్హుఁడనా? అదియేమి?

నళ—ఈపాపని యువరాజ్యాభిషేకమునకు నీవు నిషధకు విచ్చేయవలయు.

ఋతు—ఇంతకంటె భాగ్యమున్నదా?

నళ—సుదేవా? నీయుపకారము నెట్లు మఱవఁగలను?

సీ. కోమరారఁదోలుదొ ల్త దమయంతిసతినాకు
ఘటియింప నెలకొన్నఘనుఁడవీవె
దమయంతిననుగూడ నెమకంగనమకట్టి
నరణిపట్టిన దయాశాలివీవె
యలచేదిపురిలోన వెలయంగనలివేణి
గుఱుతుపట్టినప్రౌఢ గుణుఁడవీవె
యతిభీమగతిమీఱ ఋతుపర్ణకడనున్న
నన్నెఱింగినమేటి వెన్ననీవె

తే. గీ. యిపుడుపమయెంచి పరికించికృపవహించి
కాంచి పఱతెంచి సరిమించి కరుణనించి
చంచలాక్షినిగూర్చిన జాణవీవె
బ్రాహ్మణోత్తమ యుపకారభరముమీఱె.

సుదే— శా. ధాత్రీపాలక సేవకించనుఁడనత్యల్పంబునా కార్యమే
మాత్రంబాశ్రితపాలినల్పఁదగుధర్మంబయ్యెఁగా దాసికై
స్తోత్రంబేటికొనర్పఁ గంటినిను నిచ్చో నేఁడునీప్రీతికిం
బాత్రుండంచుఁదలంచినాఁడవిదెనా భాగ్యంబుచాలుంగదా.

(అనుబంధము - 54.)

నన్నుపచరింపవలయునా!

నళ—(భీమరాజుతో).

మంజుభాషిణీవృత్తము— మనసారనీతనయమంజుభాషిణి
న్వనభూమిఁబాసికడుబాధ పెట్టితిం
బ్రణతుల్ఘటింతునపరాధమెంచకే
ననుగావుభీమనరనాథపుంగవా.

(అనుబంధము - 55.)

భీమ— ఉ. ధన్యుఁడనైతిఁ దీఱెఁబరితాపము నిన్నుగనంగ సారసౌ
జన్యఘటింప నేటి కుపచారము లాఁతినె రాజరాజమూ
ర్ధన్యయరాతులైనరిపురాజికిఁ గోరనిపాటునీకొగిన్
హైన్యముఁదెచ్చినందునకహోవిధినెంతయు దూరుచుండితిన్.

సుదే— వేళయయిన దింక మనముపోవుదము.

(అందఱు నిష్క్రమింతురు.)

---



సప్తమరంగము - నిషధలో పట్టాభిషేకమండపము.

---

[ప్రవేశము: నళుఁడు - భీముఁడు - ఋతుపర్ణుఁడు - దమనుఁడు - వార్ష్ణేయుఁడు - సుదేవుఁడు - దమయంతి - ఇంద్రసేనుఁడు - పుష్కరుఁడు - బ్రాహ్మణులు - రాజులులోనగువారు.]

అందఱు—(ఇంద్రసేనుని పీఠముపైఁ గూరుచుండఁబెట్టి)

(అనుబంధము - 56.)

మంగళమహాశ్రీవృత్తము.

మంగళముకృష్ణునకుమంగళము పేంద్రునకుమంగళముమంగళమహాశ్రీ
సంగతునకార్తభవసంగునకుఁదాపసవళంగతనిజాళియునకున్నా
రంగవరదాయికివిహంగమతురంగునకునంగజశుభాంగునకుసారా
భంగకరుణాలసదపాంగునకుఁ గాళియవిభంగునకుమంగళమదెందున్.

(అని యభిషేకమహోత్సవము నడపుదురు.)

సమాప్తము.

---

ఉ. ప్రాకటసంస్కృతాంధ్రకవివర్యులకంజలిజేసితత్కృపా
స్తోకతరామకృష్ణకవిసోముఁడుదంచితసారసంవిధా
నైకతసంపతిల్లరచియించినచిత్రనళీయనాటకం
బాకమలాప్తతారకమృగాంకముగా విలసిల్లుఁగావుతన్.

---

శ్రీ

# చిత్రనళీయనాటకము.

## ఉత్తరరంగము.

## The Epilogue.

ఒకానొకనటుఁడు ప్రవేశించి.

ద్విపద. శ్రీమహనీయంబు చిత్రనళీయ
నామకంబైనయీ నాటకంబునను
ఫలితార్థమరయరే పావనులార
సలలితామలకీర్తిసత్యానువర్తి

వైరిగర్వనివర్తి వరచక్రవర్తి
ధీరగుణస్ఫూర్తి దివ్యసన్మూర్తి
విదితబలోద్దాముఁ బృథు శాంతిధాము
వదననిర్జితసోము వరరూపకాము

నతనిర్జరారాము నళసార్వభౌము
గతదోషశుభనాముఁ గంటిరిగాదె
సర్వసర్వంసహా చక్రంబునేలి
యుర్విపైఁదులలేని యురుశక్తిఁ దేలి

యున్న యీరాజన్యుఁ డొగిఁగాలమహిమ
నెన్నకమిత్రుల హితబుద్ధివినక
మాయజూదంబాడి మహిరాజ్యమోడి
శ్రీయుక్తివిడనాడి చెలిజతఁగూడి

కాననంబున కేగి ఘనరీతి నీఁగి
మానినీమణిఁబాసి మహిమంబువాసి
కాంతరూపముమాసి కడుఁగడుగాసి
వంతలఁబడిరోసి బలుపాటుజేసి

దీనభంగికిస్రుక్కి ధృతిపోవఁ బొక్కి
హీనసేవకుఁజిక్కి యెఱుకపోఁ దక్కి
కుటిలరీతులఁగుంది గురుబాధలొంది
కటకటాకందిబల్కుడగండ్లఁజెంది

సోలిదూలఁడెయంత సుకుమారుఁ డయ్యుఁ
గాలంబుఁ దరియింపఁగా రాదునుండి
యీనరేశున కిన్నియిడుమలఁదెచ్చె
మానని జూదంబు మహిమయల్లాటఁ

గొఱగాదు జూదంబు కొఱగాదుకాదు
కఱటిజూదము హానిఁగలిగించు నుండి
కరభోరులార యోకల్యాణులార
విరిబోణులార సాధ్వీమణులార.

కుదురైన యచ్చంపుగొనములదొంతి
వదననిర్జితపూర్ణవరశీతకాంతి
మగువలమేల్బంతి మదనునిదంతి
యిగురుపూవులబంతి యీదమయంతి.

యనఘవర్తనముల నగ్గింపవశమె
చనవుమై లోకసంశయములనెల్ల
సురుచిరంబుగనేలి సువ్రతమహిమ
నరుదారు దేవేంద్రునంతటివాఁడు.

సరసకేతెంచి యచ్చపుఁ బ్రేమఁదన్ను
వరియింపు మంచు నొప్పఁగ వేడలేదె
తనమనోనాథుని దనప్రాణవిభుని
ఘనుఁడైననళరాజుఁ గాదని యతని.

వరియించె నే యిట్టివనితలుగలరె
ధరణిరాజ్యంబు జూదంబుననోడి
తనపతిపోవంగఁ దనపుత్త్రి వీడి
వెనువెంటనేగదే వెలఁదికానలకు.



నాకానఁ దనుఁబాసి యువనీశుఁడేఁగఁ
దాఁకిన వగలచేఁ దపియించెగాని
యొక్కమారైన నాయుర్వీశవంద్యుఁ
దక్కనాడెనె యిట్టితరుణులుగలరె.

కావునఁ బతిభక్తికంటె సాధ్వులకు
భావించిచూడ సద్వ్రతమొండుగలదె
పురుషునకిలలోనఁ బొలుపారుభక్తిఁ
దిరముగాఁ గొల్చు సతీమణియున్న.

మానసతీశుద్ధమణులారతలఁప
వానిభాగ్యముసాటివచ్చునేయొందు
నినళరాజన్యుఁ డెటుకుందె తనదు
మానిని నేఱొక్క మనుజేశుఁగోరి.

పరిణయం బగునన్నవచనంబు విన్నఁ
బరికింపరే నేఁడు వనజాక్షులార
పటుబుద్ధిరాజ్యంబు వాయుటకోర్చె
నటుకాననముల పాలగుటకు నోర్చెఁ.

బుత్త్రినైనను మాని పోవంగనోర్చెఁ
జిత్రబాధలకెల్లఁ జేడ్పడియోర్చె
మానినీమణిఁబాసి మలయంగనోర్చెఁ
గాననంబునఁ బాము కాటునకోర్చె.

మతిపోవఁ దనరూపు మాఱుటకోర్చెఁ
బ్రతికూలనీచసేవలకెల్ల నోర్చె
నవని సంకటముల కన్నిటికోర్చె
నువిద రెండవపెండ్లి కోర్వలేఁడాయెఁ.

గాన నోసతులార ఘనముగాఁబలికి
మానిని యేభాగ్యమహిమంబునుండి.

# అనుబంధము (APPENDIX).



ఈనాటకమునఁ నక్కడక్కడ ననుబంధమను సంఖ్యయును సూచింపఁబడి యున్నది. ఆసంఖ్యలు వేసినచోటనుండిన పాట లీక్రింద నుదహరింపఁబడియె.

(అనుబంధము - 1.)

విజయుఁడు—భైరవిరాగము - రూపకతాళము.

నగధీర-సుగభీర-నానానామవిహార
ఖగవాహనసంచార-కంసాసురసంహార. ||నగధీర||

తామసగుణభూతమహా-దానవవారబవాలువేషా
సామజపుంగవతోష-రామకృష్ణసుకవిపోష. ||నగధీర||

* జయంతుఁడు—నవరసకన్నడరాగము-రూపకతాళము.

అరుదుగా - దోఁచె నౌర-యనుపమానందమహిమ
మరయఁగనీ-శరదాగమ-మవనినలరి-మిగుల. ||పల్లవి||

సరసీరుహాఘ్రాణసమితి-సంతరింపుచు ।
ఎంతో-సంతరింపుచు
విరహిజనావలిపై నీ-మరుఁడు వెడలఁగా-మిగుల. ౧

రాత్రులనతివిమలకిరణ-రమ్యకాంతితో
ఎంతో-రమ్యకాంతితో
చిత్రవిలా-సముఁజూపి-శీతకరుఁడు వెలయు-మిగుల. ౨

* ఇది శరదృతువర్ణనారూపకమైన గీతము. తొలుత నాటకమునను౦డెను. ఋతువర్ణనము ప్రకృత మీనాటకమున మానినందునఁ బ్రస్తావనలో దీని ప్రశంసయొదవదు.



వివిధదేవపూజలెందు - వెలయుచుండఁగా
ఎంతో-వెలయుచుండఁగా
రవములు సేయుచు నెందు - రాజహంసలలర - మిగుల. ౩

అనుబంధము - 2.

పౌరులు—హిందూస్థానీరాగము - ఆదితాళము.

భూపతిమాపరి-తాపముఁదీఱిచి-కాపాడెదువా రెవరింక
పాపవెయీ-యాపద మే-మోపము తాళఁగనబ్బబ్బా ||పల్లవి||
భూవర యింతని-యేవివరించెద. మావిభుఁడోపఁగెడు బాధలను
కావరమో-నీవరమో-దేవుఁడె యెఱుఁగెడు నాహాహా ||భూపతి|| ౧
క్రోధముఁజెందివి-రోధము సేయఁగ-వీథులఁదలచూపఁగ లేము
భూధవమా-బాధలనా-శ్రీధరుఁడెఱుఁగెడు నయ్యయ్యో-భూపతి.
తడయక యాతని దుడుకుతనము లె-ట్లడఁచి మమ్ము రక్షించెదవో
అడఁగకపై-విడిచిననీ-యెడనుండఁగ లేమబ్బబ్బా ||భూపతి|| ౩

అనుబంధము - 3.

భీమరాజు—బ్యాగ్ రాగము - రూపకతాళము.

ఎంతభ్రాంతిగలిగెనీదమ-యంతికాంతకు. ||పల్లవి||
నలునిపటముకంటఁజూచిన-నాఁటనుండియుఁ
బాలుపు మీఱ నెంతమరులు-పొందియున్నది. ||ఎంత|| ౧
సంతతమానలునిరూప-చింతఁబాయదు
ఎంతచెప్పినమానదింక-నేమిచేయుదు. ||ఎంత|| ౨
పొందఁగఁదనుగోరునె-నల-భూమిపాలుఁడు
అందనిమ్రానిపండ్లకిట్టు-లాశ చెల్లునే. ||ఎంత|| ౩

అనుబంధము - 4.

ఇంద్రుఁడు—బేగడరాగము - ఆదితాళము.

సొగసుఁగంటిరే-విగతదోషులార
యగణితముభీమ-నగరవైభవము. ||పల్లవి||

పొలుచుకోటసొంపు-బలుమేడల పెంపు
చెలువుగానువీథి-వెలయఁగల్గునింపు. ॥సాగ॥ ౧
నిరతపుష్పఫల-భరితమౌచునెంతో
పరమసౌఖ్యకరము-తరులచందమిందు. ॥సాగ॥ ౨
కాలకాలమును-మేలిపూలుగల్గి
పూలతోఁటలమిత-లీలవిఁసిల్లు. ॥సాగ॥ ౩

అనుబంధము - 5.

నలుఁడు—హిందూస్థానీ కాపీరాగము - అటతాళము.

చాలదెనంతోషము-చాలును నాకిఁక
పోలఁగనింతటి-లీలఘటించెను. ॥పల్ల॥
ఊరక మనసునఁ-బారములెఱుఁగక
కోరికలెన్నెన్నియొ-కోరినఫలమిది. ॥చాలదె॥ ౧
పొందుగనేఁగోరిన-సుందరితోడనిఁక
బృందారకులకునయి-సంధానమునెట్లొనర్తు. ॥చాలదె॥ ౨
ఈకమలాక్షియె-నాకగుననిమది
వేకారితినింతేమటి-నాకెక్కుడిదమయంతి. ॥చాలదె॥ ౩

అనుబంధము - 6.

దమయంతి—జంఝూటిరాగము - అటతాళము.

మదనానాపైనింతచలమా
పామరమా-తామసమా-కావరమా-నీమతమా ॥పల్ల॥
అలసిసొలసియున్న-చెలువలపైనింత
చలముసేయుటనీకుఁ-దులువతనముగాదె. ॥మదన॥ ౧
ఏమియునెఱుఁగని-కామినిపైనింత
తామసింపఁగనీకు-ధర్మమెతలపోయ. ॥మదన॥ ౨



నోరెఱుఁగనిముగ్ధ-వారిజముఖిపట్ల
వైరముచూపఁగాఁ-గారణమేమిర. ॥మదన॥ ౩

అనుబంధము - 7.

దమయంతి—హిందూస్థానీకాపీరాగము - ఆదితాళము.

తాపమొందఁగఁజాలనే కోపమేటికేసతీ ॥పల్లవి॥
పిన్నతనముననుండినీతో-పెరుగనేమటి ॥సతీ॥
యెన్నఁడునేనిట్టితాపము-నెఱుఁగనేహరీ ॥సతీ॥ ౧
సుందరాంగిరొనీకునెంతటి-మందమేలమే ॥సతీ॥
డెందమంతయుఁగలఁగెనీవెత-లొందఁజాలనే ॥సతీ॥ ౨
తరుణిననుమన్నించినాకగు-భరముఁబాపవే ॥సతీ॥
అరమర లేకింతనాపయిఁ-గరుణఁజూపవే. ॥సతీ॥ ౩

అనుబంధము - 8.

భారతి—కమాజురాగము - రూపకతాళము.

భామామరులేలా-యిఁక-భామామరులేలా-యకటా-
ఓరమణీ-ఓకలికీ-ఓతరుణీ ॥భామా॥ ॥పల్ల॥
ఇంచుకమదిఁదాళుకొనక-సంచలించెదే
ఈగతి-సంచలించెదే-తరుణీ
ఎంచవుమా-నాంచలమా-చంచలమా. ॥భామా॥ ౧
దీనగతినిబొందఁదగునె-మానినీమణీ-ఈగతి-మానినీమణీ-
తరుణీ-లోనవగ-మానవుగా-కానవుగా. ॥భామా॥ ౨
ముదితనీకుఁజెల్లదింత-మదనతాపము-ఇంతటి-మదనతాపము-
తరుణీ-ఇదితగవా-మదినగవా-ఓమగువా. ॥భామా॥ ౩

అనుబంధము - 9.

నలుఁడు—బ్యాగ్ రాగము - అటతాళము.

ఓరానారి-అరుదౌనొయ్యారి ॥పల్ల॥

అచ్చరసతియొ వి-యచ్చరతరుణియొ
హెచ్చైనసుందరి-మెచ్చరోహిణియో. ॥ఔరా॥ ౧

పాకారిరాణియొ-శ్రీకారి దేవియొ
లోకవిమోహనా-లోకమోహినియొ. ॥ఔరా॥ ౨

ఊహింపఁజాలమ-నోహరశృంగార
మహాశచిచేత-మోహనశుకమో. ॥ఔరా॥ ౩

## అనుబంధము - 10.

హిందూస్థానీరాగము - ఆదితాళము.

నళ—మందయానయాలింపుమా-బృందారకవరులు
అందముగానీ-పొందుఁగోరిన-న్నిందుఁబంపినారు.

దమ—సురనాథులకిదిన్యాయమా-నరసతిఁగోరంగా
నరుదగువారల-తరుణులలోనొ-క్కరిని బోలఁగలనే.

నళ—కల్లగాదువినుమింతిరో-యల్లసురలునిన్ను
సల్లలితముగా-నుల్లములనురం-జిల్లఁగోరినారు.

దమ—అకటాయిట్టిదికల్లునే-సకలజ్ఞులువారు
వికలమతిని నే-నొకటిమెఱుఁగ వా-రికినాకునుసీఁడే.

నళ—తరుణీయెంతటిపుణ్యమో-శరమేకొనియాడ
సురపతిఁబొందిన-సురలందఱునీ-చరణదాసులింక.

దమ—ఎక్కువతక్కువచూడకే-సొక్కి వరించెదనే
మక్కువగాదిది-నిక్కము వారికి-మ్రొక్కుదాననసుమా.

## అనుబంధము - 11.

భీమరాజు—కల్యాణిరాగము - ఆదితాళము.

ఇటుఁరమ్మా-సరససుందరీ ॥పల్ల॥

ఉభయగోత్రముల-కున్నతిఁదెమ్మా
శుభమొందఁగనిను-వరతనయా ॥యిటు॥ ౧



ఈరాజులనీ-కింపుగలుగు
ధారుణివరుని-గోరుమా ॥యిటు॥ ౨

వామనయననీ-వరునిగోర-
భామామణినా-భారముదీఱు. ॥నిటు॥ ౩

## అనుబంధము - 12.

భారతి—కమాజురాగము - రూపకతాళము.

బాలరావే-పోలనీభూ-పాలమాళినిజూడుమా
లీలమైవరియింపఁగోరినఁ-బూలహారము వేయుమా ॥పల్ల॥

## అనుబంధము - 12. A.

మానినీయీమేటిమాళవ-మానవేశుఁడుకంటివే
మానసీయుఁడుశూరుఁడేజయ-సేననాముఁడుకోమలీ ॥బాల॥ ౧

## అనుబంధము - 12. B.

వారిజాక్షీకుంతలేశుఁడు-భూరిసత్వుఁడుగంటివే
శూరమాలియటందురీతని-ధీరుఁడెన్నఁగనింతిరో ॥బాల॥ ౨

## అనుబంధము - 12. C.

కందవేణీయీనరేశుఁడు-సింధుభూమికినాథుఁడే
సుందరాంగుఁడుధారుణింబ్రతి-విందనాముఁడు కామినీ ॥బా॥ ౩

## అనుబంధము - 12. D.

ఓపడంతీయీతఁడావిది-శాపురీశుఁడుచూడుమా
భూపవంద్యుఁడుపుష్క రేశ్వరుఁ-డోపి తేనివరింపుమా. ౪

## అనుబంధము - 12. E.

శక్రసామ్యునినిప్పుడీనల-చక్రవర్తినిజూడుమా
విక్రమాఢ్యుఁడుసర్వధరణీ-చక్రమేలెడుసుందరీ. ॥బాల॥ ౫

## అనుబంధము - 12. F.

ఇతఁడుకాఁడే-యతఁడుకాఁడే-యితఁడె-యీతఁడె యీతఁడే
యతివయేవురిరూపమొక్కటి-యతివిచిత్రముచూచితే॥బాల॥౬

## అనుబంధము - 13.

దమయంతి—సరస్వతీమనోహరిరాగము - ఆదితాళము.

నీలవేణివాణీశారదా-ఆలకింపవేయోశారదా ||పల్ల||
సారధీప్రదా-వారిజాసనా-ధారకామినీ-భారతీసతీ. ||నీ|| ౧
సన్నుతాంగిని-న్నెన్న నేర్తునే-నిన్నెనమ్మితి-నన్నుబ్రోవవే. ||నీ|| ౨
ఇందునాకునీ-కుందుకల్గెను-సుందరాంగియింకెందుఁబోవుదు ||నీ|| ౩

యవనిక పడుటకుముందు.

## అనుబంధము - 14.

అందఱు—నవరోజురాగము - ఆదితాళము.

కలిగెనుముదంబుమాకు-అరుదుగ
ఘనం-బుగా-మనం-బులో-నరుదుగ. ||పల్ల||

ఇంద్రు—ధారుణీ-పాలనీ-సారసా-జన్యమః.
ధీరతనము నె-వ్వారికిఁగలుగుక
వారకకనఁగాఁ-బరమాద్భుతముగు. ||కలిగెను|| ౧

అగ్ని—అమ్మరామా-నెమ్మదుల-
సమ్మోదము-లిమ్మడిగా-
నలరెనుగదనీ-నలుఁడెవిభుఁడుగా
వెలసెఁజెలియలా-జలరుహనయనా. ||కలిగెను|| ౨

దమన—భామా-తిలకమతగునీ
రామాం-చితగుణగణముల్
భూమిక-సతులకుఁగలవే
యామో-దమునను-బొగడఁగ
నలవియె యరుదుగ. ||కలిగెను|| ౩

సుదే—ఘనమై-సుఖసా-ధనమై-వెలసెక
జనపా-లకయా-వనితా-మణినీ
ఘనసతిగాఁ-దనరుటచే-
జనతతికె-ల్లనుగలిగెక
నెమ్మది-వారని-సమ్మద-మొందును
నిమ్మహి-మీకుఁ ది-రమ్ముగు-సుఖమిఁక. ||కలిగెను|| ౪



భీమ— ధరణీ-పాల నిన్ను-గోరి-పొగడఁగమా
తరము-గాదు-మానవేశ-తిలకుఁడవై
పరఁగెదవీ-ధరణినినీ-వరయశము
విరివిగ-దిశలను-థిరముగ-వెలసెడు-
సురుచిర-విధమున. ||కలిగెను|| ౫

నళ— ఇంతేల-ననుబొగడదు-రంతంబు-సంతోష-
మడరెనుగద-యెంతయు-వింతాయె-
సురవిభులకు-స్వాంతంబు-లోనక-ప్రేమనా-
కెంతో-మోదమై-వంతలఁ-బాసితి-
సంతస-మారఁగఁ-గాంతను-బడసితి. ||కలిగెను|| ౬

సమ— వాణీ-నతగీ-ర్వాణీ-యుతశ-
ర్వాణీ-కరుణం-బ్రాణంబులని-
చ్చినన్నుమనిపితి-మనంగలిగెనల-
జనాధిపునిజిత-మనోజుఁబతిఁగను-
దనర్చి-ముదంబు-మనంబు-ననిండ
ననంత-సుఖంబు-లనింపి-తనిపితి. ||కలిగెను|| ౭

## అనుబంధము - 15.

కాముఁడు—హిందూస్థానిరాగము - ఆదితాళము.

లోకాలోకానేకస-మాకులావనిలో-ఘనముగఁ
బ్రాకటయువతీలోకమే-పరమానందము. ||పల్ల||

చిలుకలపలుకులమించు-పొలఁతులపలుకులవే కలుగఁగఁ
బలుతొలిపలుకులువేతే-యిలలోఁజెలువొనే. ||లోకా|| ౧

హరిణీనయనలపొందే-తరణోపాయముగాఁ-గలుగఁగఁ
దరుణీతరగురుదై వస్మరణంబేమిటికి. ||లోకా|| ౨

మఱియొకపాట—బ్యాగ్‌రాగము - ఆదితాళము.

సరి-యెవ్వరిఁకధరలో నా-సరి
విరి-బాణములఁబరఁగింపఁగను. ||పల్ల||

చెలువుమీరఁగఁ - జెలఁకువింటికి -
నళులనివహమె - నారిగాఁ
జిలుక తేరును - గడపుచుఁ
విల - సిల్లుగతి - నలరారఁగను ||నరి|| ౧
శుకపికంబుల - సేన వెలయఁగ
సకలవిరహిజనంబులుఁ
వికలమతులయితూలఁగా
సక - లంకుఁడగు మకరాంకుఁడన ||నరి|| ౨

## అనుబంధము - 16.

క్రోధుఁడు — కమాజురాగము - రూపకతాళము.

ప్రధనోగ్రజాగ్రదగ్రమహా - భంగురబాహా -
కుధరాగ్రకార్ముకాంచితా - క్రూరాగ్రహా. ||పల్ల||
పురుహూతమథనవిధృతధాతృ - భూరికపాలా.
హరిభూరిబాణభక్షితోరు - హాలాహాలా. ||ప్రధ|| ౧
అహితాతిభయదత్రిపురనిర్జ - రారివినాశా
బహుళాగ్ని హేతిభీప్రదోరు - ఫాలాంబకా. ||ప్రధ|| ౨

## అనుబంధము - 17.

లోభుఁడు — శంకరాభరణరాగము - ఆదితాళము.

ఈధరనిహపరసాధనమే - ఈధనమేమతియాధనమే -
ఈధనమేమతియాధనమే - ఈధనమేమతియాధనమే. ||పల్ల||
దుర్మతులందఱుదమవల్ల - ధర్మమటందురుధరనెల్ల
కర్మమువారికిగతిచెల్ల - ధర్మమునను మోక్షముకల్ల. ౧
జోగులుతమకేగతిలేక - త్యాగములేదందురువీక
రోగములను బడిపడిపోక - త్యాగముప్రాణత్యాగమెకా. ౨
భద్రముసేయుచులోనేల - నిద్రకుసెలవీవలెజాల
రుద్రుఁడువేడినవెయ్యేలా - క్షుద్రముదానముమనకేలా. ౩



## అనుబంధము - 18.

కలి — సురటరాగము - చాపుతాళము.

భీకరగతినేనీలోకములేల - నాకెవ్వఁడగుఁబోల
నాకోపభరమున - జీకాకుచేయఁగ శ్రీకాంతుఁడో
వా - ణీకాంతుఁడో - గౌ - రీకాంతుఁడో - శ - చీ
కాంతుఁడగునేమి భీకరగతి. ||పల్లవి||
భద్రమువిడిచినా - రౌద్రముఁగోర - క్షుద్రులుచెడిపోరా
మాద్రోహమునసంచ - లద్రూపులైని - ర్నిద్రుండవా -
వీర - భద్రుండవో - కాల - రుద్రుండవో - భీస
ముద్రుండవందురు. ||భీకర|| ౧
కుంభినినితరులదంభమెంతైన - సంభవించునెపూన
స్తంభించినాసమా - రంభముగలిగిన
జంభారియో - త్యక్త - గాంభీర్యుఁడై - శుష్క
దంభోళియై - ముక్త - కుంభీంద్రుఁడయిపోఁడె. ||భీకర|| ౨

## అనుబంధము - 19.

వార్ష్ణేయుఁడు — కాపీరాగము - ఆదితాళము.

శ్రీపతీయెంతటి పాపికాలముకలిగె ||పల్లవి||
ఆపదలెన్నెన్నియో - యీవరించునింకఁ
దాపసంతతులకుఁ - దాళఁగాఁగలమేమది. ౧
అక్కటామామది - హర్షముదీఱెను
పెక్కుసంకటములకుఁజిక్కఁగావలసెనయ్యో. ౨
ఈవిధికలిగిన - నెవరిసివేడుదము
కావవే శ్రీహరీ - కరుణఁజేపట్టిమమ్ము. ౩

## అనుబంధము - 20.

పుష్కరుఁడు — కాపీరాగము - రూపకతాళము.

చాలునోనళా - ఆహా - చాలునోనళా. ||పల్లవి||

అగ్గలముగనోరువిడిచి-యొగ్గులెన్నవలెనెనీవు
సిగ్గులేకమాటలాడెదే-ఆహా-చాలు. ౧

రాజ్యమోడిమాటలేల-పూజ్యసఖుఁడునాకునితఁడు
త్యాజ్యమేలనీకునితనితో-ఆహా. ॥చాలు॥ ౨

తొలుతనన్నునీవుపురముఁ-దొలఁగఁజేయలేదెపొంగి
తొలఁగవలదెనీవునిప్పుడు-ఆహా. ॥చాలు॥ ౩

* దేవలుఁడు—కాపీరాగము - సవారితాళము.

సం-తో-ష-మాయెనుగా యో-నరవరకరుణాకర ॥పల్లవి॥
సలలితలీలనీ-నలునిజయించితిగా. బలా-యిలా
పాలా-సుయశో-లోలా-నరవరకరుణాకర. ౧

అరుదుగసర్వమైన-ధరాతలమబ్బెనుగా-మురహరా
కారా-సుగుణో-దారా-నరవరకరుణాకర. ౨

## అనుబంధము - 21.

దమయంతి—కదంబరాగము - ఆదితాళము.

ఈమతమున-కేమిచేయుదు ॥పల్లవి॥
కాంతుఁడెయింతటి-భ్రాంతివహించెనే
ఇంతైనఁదెలియఁడే-ఏమిచేయుదు. ॥ఈమ॥ ౧
దాయాదుఁడింతటి-మాయలుచేసెనే
పాయకున్నాఁడిఁక-నేమిచేయుదు. ॥ఈమ॥ ౨

* ఈగీతమును 40 పేజికడపట 'సంతసింపుము ప్రజలపైఁ జింతయేల' యను దానికిఁ దరువాతఁ బాడుకొనవలయును.



కాదనియెవ్వగు-బోధింపఁజాలరే
జూదముమానఁడే-యేమిసేయుదు. ॥ఈమ॥ ౩

## అనుబంధము - 21. A.

నలుఁడు—నాథనామక్రియరాగము - అటతాళము.

అకటా-తరుణీ-ఇఁక నెట్లుభరియింతు
నొకనాఁడునిను బాయ-సుకుమారిదమయంతి. ॥పల్లవి॥
సముదారహిమకర-విమలసువదన
రమణీ-కమనీ-యమణీ-సుమపాణి. ॥అకటా॥ ౧
కలికినిన్నడఁబాసి-బలుచింత నేఁడాళఁ
గలనా-లలనా-కలనైన-నెలనాగ. ॥అకటా॥ ౨
చెలినిన్ను బాసిన-నిలఁబ్రాణములునాకుఁ
గలవే-చెలువే-యలివేణి-కలవాణి. ॥అకటా॥ ౩

## అనుబంధము - 22.

దమయంతి—తోడిరాగము - రూపకతాళము.

ఏలయలుకవో-నాథా-యేలపలుకవో-హాహా. ॥పల్లవి॥
ఈవిధమునఁబాసి-వేఱే-త్రోవలేకచేసి
పోవనేటికి-నాకీ-జీవమేటికి-హాహా. ॥ఏల॥ ౧
కాననంబులోన-కోప-మూనన్యాయమా నా
మానదాయకా-రావే-ప్రాణనాయకా
హాహా. ॥ఏల॥ ౨
దురితమిన్నరాదా-నన్ను-దెరలననఁగలేదా
వరముమీఱెనే-నాపైఁ-గరుణదీఱెనే. ॥హాహా॥ ॥ఏల॥ ౩

## అనుబంధము - 23.

దమయంతి—నీలాంబరిరాగము - ఆదితాళము.

కరుణాలవాల-వరభూమిపాల
విరసంబులేల భరియింపఁజాల ॥పల్లవి॥

అనయంబు నేలి-నను బాఁడోలి
మను జేళమాళీ-చననా నెళీలి. ॥కరు॥ ౧

విపరీతమైన-విపినంబులోనఁ
దపియించు దానఁ-గృపచూననౌనా. ॥కరు॥

## అనుబంధము - 24.

నళుఁడు—హిందూస్థానీకాపీరాగము - రూపకతాళము.

మానినీమణి-యెందుఁజనెనో-కాననసీమ
మానవతి నే-పాయఁజేసితె-హీనదైవమా. ॥పల్లవి॥

వనజలోచన-బాలామణి-వారణయానా
వనితనిను నేఁ-బాసివచ్చితిఁ-బాపినిగానా. ॥మాని॥ ౧

క్రూరకర్ముఁడఁ-బూని యెవరి-దూరుదులనా
కోరినిధియే-వైరమెంచినఁ-బోరఁగలనా. ॥మాని॥ ౨

అక్కటకట-యెందుఁబోయితె-హాదమయంతీ
చిక్కియడవి-లోననేమి-చేసెదవింతీ. ॥మాని॥ ౩

## అనుబంధము - 25.

నళుఁడు—తోడిరాగము - రూపకతాళము.

మానినీమణీ-కానలోన-హాహా.
దీనరీతినే-పూనగలైె-నాహా. ॥పల్లవి॥

తామసించియీా-పామఁగఱచెనన్ను
భామయింకనా-కేమిగతియొ-హాహా. ॥మాని॥ ౧

ఇందునాకునీ-చందమా యెహాహా
సుందరాంగిని-న్నెందుఁగాంతునయ్యో. ॥మాని॥ ౨

కాంతనీవునా-కింత వేళలోన
చెంతలేవుగా-యెంత పాపినయ్యో. ॥మాని॥ ౩



## అనుబంధము - 26.

నళుఁడు—మాయామాళవగౌళరాగము - ఆదితాళము.

మురవైరి-మురవైరి-మురవైరి. ॥పల్లవి॥
ముర । వైరిసకల-దురితారిదైత్యనుర వారితమందరధారీ
దర । ధారివినుతనరకారిని-గమహారభూరిమహాసురవైరి
నుర । వైరిజీవపరిహారివిబుధవరధారివిపులధరధారీ
ధర । ధారిమత్తతరవైరిప్రాణహరభూరికాంతతరవారి. ౧
శ్రీ । మంగళాంగ గోపాంగనావిరచితాంగిజలీలోత్తుంగా
ఉ । త్తుంగబలోజ్వలరంగదతులభుజసంగదళితసారంగా
సా । రంగపోషవరసంగరరంగళ తాంగమహాసురభంగా
సుర । భంగనాశకరథాంగసంగత విహంగమరాజతురంగా. ౨
శ్రీ । కందనీలతరుణేందుకళాధరవందిత కరుణామందా
ఆ । మందబాలహితసుందరలీలా నందితగోపజనందా
అజ । నందనసనకసనందనవిరచితవందనజనితానందా
ఆ । నందదాయి-యర-విందనయనవరమందరధరగోవిందా. ౩

## అనుబంధము - 27.

కర్కోటకుఁడు—పున్నాగవరాళిరాగము - ఆదితాళము.

నళ-రాజచంద్రమా-తలఁకేలచూడమా. ॥పల్లవి॥

తాపమేల - అనువల్లవి.

ఈ.— కాలమహిమ-కడచేయశక్యమా
పోలదుమదిలోఁ-దాపముఁజెందఁగ-వేళగుణము. ॥నళ॥ ౧
నీవెంతచూచిన- నేమైనఫలమా
చింత చేయఁగా-దీనతియొకటే-వంతబోవదిఁక. ॥రాజ॥ ౨

## అనుబంధము - 28.

ఎఱుకులు—యదుకులకాంభోజిరాగము - ఆదితాళము.

కానలోఁగాలిజాడ-గానుపించె నిందునింక
నీ నేలనుండులాఁతి-యింగాలోసింగాలో॥
రారాపోదము-వేటాడవేగమె. ॥రారా॥

చేరినజీవాలు-పారాడిపోకుండ ॥రారా॥
ప్రక్కలోఁబారిపోయె-నిక్కడఁగానుపించి
యక్కడదాఁగినది-చిక్కెజిక్కె సివ్వంగి ॥రారా॥ ౧
బింకముచూపించి-పెదపెద్దగంతులేసి
బొంకించి పాఱిపోయె-జింకపిల్లఁబట్టుకోను ॥రారా॥ ౨
సందడిచేయఁక-చదమూడుదముగాని
ఇందేదాఁగియున్నదీ-పందిగున్నకొట్టుకొట్టు ॥రారా॥ ౩
అద్దిరానాదెబ్బ-కదరియీకొండఁజేర
సద్దుచేయఁగూడదింకఁ-బెద్దపులిపారిపోవు ॥రారా॥ ౪
సింగంబున్నదీడఁ-జెలువైనకోనలోన
రంగైనబల్లేలఁ-బొంగిపొంగివేయుఁడింక ॥రారా॥ ౫

## అనుబంధము - 29.

### దమయంతి ప్రవేశమునకుముందు.

గరుడధ్వనిరాగము - ఏకతాళము.

వీరనాయ — పొందుపొందుగానకుఁ-గొండకోనకు
దండివేటలాడుఁడీ-తలచిచూడుఁడీ ॥పొందు॥ ౧
ఎఱుకలు — బుద్ధిబుద్ధిపోదము-పొదలియొయిదుము
పెద్దజీవనాలను-బెట్టనేలను ॥బుద్ధి॥ ౨
వీరనాయ — మేలుమేలుబావురే-మెచ్చుకుందురే
మేలిపులులఁజంపుఁడీ-కోలనొంపుఁడీ ॥పొందు॥ ౩
ఎఱుకలు — ఇప్పుడిప్పుడింతనే-యిరవుచెంతనే
కుప్పచూచెదల్లదే-కూఁతచెల్లదే ॥బుద్ధి॥ ౪
వీరనాయ — చాలుఁజాలుఁనీడనే-జరుఁగువాఁడనే
వాలుకేలఁబట్టెదఁ-దూలగొట్టెద ॥పొందు॥ ౫



ఎఱుకలు — సెలవు సెలవుమాకికఁ-జెలఁగిపూనికఁ
గలఁచిపొడిచివత్తుము-గములఁదెత్తుము ॥బుద్ధి॥ ౬

## అనుబంధము - 30.

దమ—హిందూస్తానీతోడిరాగము - రూపకతాళము.

భానురాంగుఁజూడనైతినేకటా-నను
బాసిపోవనంతభారమైతినే ॥పల్లవి॥
ఈ। కానలోననింక నెల్లునైపుదుర్
మానవేశునెన్నఁడింకఁజూచెదర్ ౧
భూపమౌళినన్ను మానిపోయెనే
యీ। పాపినిద్రనన్నునింతచేసెనే. ౨

## అనుబంధము - 31.

ఋతుపర్ణుఁడు — ఖమాజురాగము - అటతాళము.

మేరలేదుగదా-దుఃఖమునకు- ॥మేర॥ పల్లవి॥
మునకర్మగతిఁజేసి-యెనయుదుఃఖములకు
ననుదినమునుజింత-వనరిననెందును ॥మేర॥ ౧
ఒదవినయట్టియా-పదలుకొన్నాళ్ళలోఁ
జెదరిపోఁగలవంచు మదినూరడిలకున్న ॥మేర॥ ౨
నలరాజుదనకాల-బలమునఁజనెఁగాక
లలినేఁడొత్తెపోరాఁ-గలఁడెందుకీచింత ॥మేర॥ ౩

## అనుబంధము - 32.

### దమయంతి ప్రవేశించుటకుముందు.

ఋషులు—జంజూటిరాగము - ఆదితాళము.

నారాయణామురవైరీ-హారి ॥నారా॥ ॥పల్లవి
తుంగవిలాసా-మంగళవేషా
ంగతకౌస్తుభభూషణా ॥హారి॥

శ్రీమహనీయా- ప్రేమామేయా
కామితఫలసందాయకా ॥హరి॥ ౩

## అనుబంధము - 33.

సార్థవా—హిందూస్తానికాపీరాగము - ఏకతాళము.

వాసికెక్కిన వాఁడవుగా-నీకుఁ-గాసైనఁ జిక్కినఁ
జాలునుగా । అసహ్యేయవె-యొక్క రిసొమ్మును-నీసరి
యెవ్వఁడు బేహారీ-నాటు బేహారి ॥పల్లవి॥
చేకొనఁగా దేశ- దేశ పదార్థముల్ -లోకుల కెల్లను దెత్తువుగా
లోకము నెంతయుఁ బ్రోతుగదా నీవు లేకున్న నేమౌనో బేహారీ॥ ౧
ఎల్లభూములఁజుట్టుదుగా-నీకు నెందునుభయము లేదుగదా
పెల్లుగా నుండెదు కాఁడై నీకొక్క -యిల్లుగదా నాటు బేహారీ॥ ౨
ఏనుఁగులునుగుఱ్ఱాలుదొంకు- వేనడాలొంటెలునీకుఁగదా
వీనిఁజూడఁగవానికినీ కేమి- భేదము రా నాటు బేహారీ॥ ౩

## అనుబంధము - 34.

దమయంతి—బ్యాగ్‌రాగము - రూపకతాళము.

భూమిపాల నామొఱాల-కింపవే-నాథానా- నేరమేమి
నాకునీ- మోముఁజూపవే ॥పల్లవి॥
పోలఁగనినుజూడకున్నఁ- దాళుదాననే
సురుచిర-లీలఁబూనవే భూమి. ౧
వాసిగనను బాయననుచు-బాసచేయవే
నేఁడది- మోసమాయెనే-భూమి. ౨
నీదునుతునిదలఁచియైన-నాదరింపవే
నాదగు బాధఁదీర్పవే-భూమి. ౩

## అనుబంధము - 35.

సుదేవ—నాథనామక్రియరాగము - ఆదితాళము.

ఎంతదుర్దినమో-సంతాపదినమో
ఎంతని నేమదిఁ-జింత సేయుదుహరి ॥ఎంత॥ ॥పల్లవి॥



భోజనమెఱుఁగ-రాజెనాఁకలియు
నీజగమునసీ- యోజకలుగునే ॥ఎంత॥ ౧
ఇందుకాననము-నందు వెదకినను
నెందుసుగానసు-గందమూలములైన ॥నెంత॥ ౨

## అనుబంధము - 36.

సైరంధ్రి—తోడిరాగము - రూపకతాళము.

ఎన్నఁడునావిభునిగాంతుఁ-గన్నులారఁగా-హాహా ॥పల్లవి॥
లేరుత్రాతలెందునాకు- ఘోరదుఃఖమాఁపఁజాలఁ
జేరఁజాల-నేమిసేయ-భూరితాపమడరెనయ్యో ॥ఎంత॥
భూవిభుండునన్ను బాసి-పోయియెందుఁజేరినాఁడో
యీవిధమునా-కెన్ని నాళ్ళో-దైవమేమి-చేసె-నాహా
కొంచెమైననా మొఱనా-లించువారు లేరుగదా
సంచలింపఁజేసినన్ను-ముంచనాగెఁదాపమయ్యో ॥ఎంత॥

విపుల దమయంతిని కౌఁగిలించి

## అనుబంధము - 37.

విపుల—హిందుస్థానిరాగము - ఆదితాళము.

హాదమయంతీసతీ - రాఁగదవే-మాయమ్మా ॥పల్లవి॥
రాఁగదవేమాయమ్మా-రాఁగదనేకమలాక్షీ ॥అనుపల్లవి॥
ఎన్నాళ్లకు నిన్నుజూచితిఁదనయా
చిన్నతనంబునుండి-వన్నెలాఁడిమా
యమ్మవుగానిను గన్నులారఁగ నేఁడుగంటిమి ౧

## అనుబంధము - 38.

సుదేవుఁడు—ఖమాజురాగము - ఆదితాళము.

సుదినముకా దేచాల-భళీయిది-సుదినముకా దేచాల ॥పల్లవి॥
కడుకొనిమనమా యడవులలోపలఁ
బడినబాధలెల్లఁ-బాసె నెబాసిది ॥సుది॥ ౧

వ్యర్థమగు నెయీ-బహుళ ప్రయాసము
సార్థకమాయెను-జాలుభళీయిది ॥నుది॥ ౨

దినదినమును వే-దిరిగితిరిగియిట
ఘనవేణీమణి-గంటిమహాయిది ॥నుది॥ ౩

## అనుబంధము - 39.

నళ—సావేరిరాగము - అటతాళము.

ఆహా దైవమునకు-నూహింపనేనెంత
ద్రోహముఁ జేసి-యున్నానో-కన్నానో ॥పల్లవి॥

దుర్మతినై పూర్వ-జన్మమునను జేయు
కర్మమనుభవింపవలదే-కావలదే ॥ఆహా॥ ౧

కారుణ్యమతి లేక-ఘోరారణ్యములోన
నారీమణిని బాయ-నగునే-రాఁదగునే ॥ఆహా॥ ౨

ఎల్ల జీవులకిదే-తెల్లవాఱెను నాకుఁ
దెల్లవాఱుట-యెన్నఁడింక-గరుడాంక ॥ఆహా॥ ౩

## అనుబంధము - 40.

సుదేవుఁడు—బ్యాగ్‌రాగము - ఆదితాళము.

మేలాయెనిదిచాలదే-బలముగ-ఘనముగ-మేలా ॥పల్లవి॥

స్పష్టముగా నాకు-జాడగన్పించెను
దృష్టాంతమిదిచాలదే-బలముగ-ఘనముగ ॥మేలా॥ ౧

ఆపడఁతినిగంటి-నీపుణ్యుఁగనుఁగొంటి
నాపుణ్యమేమందును-బలముగ-ఘనముగ ॥మేలా॥ ౨

## అనుబంధము - 41.

దమయంతి—ధన్యాసిరాగము - ఆదితాళము.

హరిహరీనాకెంతటి-గురుపాపమాయెనో
తరముమీఱినమఘ-దురితమువింటిని ॥హా॥ ॥పల్లవి॥



నలుఁడె నాదైవమని-తలఁచి నేనుండఁగా
ములుకులవంటి-బలు-పలుకులాడితివి ౧

ఘనపతివ్రతయెందుఁ-దననాథుఁగాదని
మనమునందైన-వేఱే-మనుజునిదలఁచునే ౨

తెలియకాపూర్వజన్మ-ములను నేఁ జేసిన
కలుషముచాలు-హరీ-వలవదీపాపము ౩

## అనుబంధము - 42.

భీమ—కదంబరాగము - ఆదితాళము.

ఇంత తాపమెన్నఁడైనఁ-జింతసేయనౌనా ॥పల్లవి॥

అరసిచూడ భూమిపాల-వరులలోనఁజాల
గరువమెల్లఁదూల-నీ-దురితమెన్నఁజాల. ౧

భీమరాజు మేటియంచు-భూమిజనము లెంచు
నామమే నశించు-నిది-నీమదిం దలంచు. ౨

ఎవ్వరైన నమ్మువారె-యివ్వనంటదారె
నవ్వువారు కారె-నను-అవ్వ జేసిపోరె. ౩

## అనుబంధము - 43.

ఋతుపర్ణుఁడు—బ్యాగ్‌రాగము - రూపకతాళము.

బలువింతగాదెయిట్టి-లీల చేయఁబోలునే
లీలచేయఁబోలునే-యీ-లీల-చేయఁబోలునే ॥పల్లవి॥

స్వాంతమునను-దీనికా-యింతిసమ్మతించెనే
ఇంతిసమ్మతించెనే-దమ-యంతినిమ్మళించెనే. ౧

ఎక్కడఁగనలేదుగా-మక్కువగనుపించునే
మక్కువగనుపించునే-యిది-సిక్కమనుచుఁదోఁచునే. ౨

ఈమతమునజాబు-మీ-భీమరాజే వ్రాసెనే
భీమరాజే వ్రాసెనే-యా-కామిని వ్రాయఁజేసెనే. ౩

## అనుబంధము - 44.

బాహు—నాథనామక్రియరాగము - ఆదితాళము.

ఇంతభాగ్యరీతిచాలదె-చాలుఁ-జాలునాహాహాహా ॥పల్లవి॥
అంకపాళిలోననాకీ-పంకజాక్షిదక్కెననుటది
బొంకాయనేఁడక్కటకటా-యింకేగతినేఁదాళువాఁడ
నన్నుఁదాఁగిదమయంతి-నిన్నేమదిలోనమ్మియుంటి
ఎన్నఁడైననక్కటకటా-నన్నీలాగునఁజేయుటెఱుఁగను.

## అనుబంధము - 45.

బాహు—మోహనరాగము - ఏకతాళము.

రారాకామునిచనవెనసినతనయా ఇటు-వేగమె ॥రారా॥పల్లవి॥
ముద్దులుగులుకుచు-సుద్దులుపలుకుచు
ముద్దొసంగనవమో—హన ॥రారా॥ ౧
కాలందెలుఘలు-ఘలుమనిమ్రోయఁగ
వాలాయముగను-బా—లక ॥రారా॥ ౨
చందురుఁదెగడెడు-నందపుమోమున
మందహాసరుచిఁజూ—పుచు ॥రారా॥ ౩

## అనుబంధము - 46.

ఇంద్రసేనుఁడు—బ్యాగ్ రాగము - ఆదితాళము.

అమ్మమ్మయీమాటల-నమ్మఁజాలనే
నమ్మఁజాలనే-ఈ యెమ్మెలేలనే ॥పల్లవి॥
మా-యయ్యయీనాఁడిందువచ్చునంటివే
వచ్చునంటివే-నన్ను-మెచ్చునంటివే ॥అమ్మ॥ ౧
నా-కిన్నాళ్ళుదాఁచితివింక నేటికే
ఇంకనేటికి-నీ-బొంకులేటికే ॥అమ్మ॥ ౨
అయ్యయ్యోమాయయ్యను బాముపట్టెనే
పాముపట్టెనే-యింకేమిపుట్టెనే ॥అమ్మ॥ ౩



## అనుబంధము - 47.

భీమరాజు—ఉసేనిరాగము - ఆదితాళము.

ఆలకింపరాదా-వాదా-ఆలకింపరాదా ॥పల్లవి॥
తలపోయనీవెమా-నళరాజుకావా
చలమేలయీ-చందమేటికి ॥ఆలకింపరాదా॥ ౧
విపినాళినీసతి-తపియింపలేదా
కృపఁజూడనే-కీరవాణిని ॥ఆలకింపరాదా॥ ౨
నీతనూజునై నను-బ్రీతిఁజూడరాదా
భూతలేశయీ-రీతిచెల్లదు ॥ఆలకింపరాదా॥ ౩

## అనుబంధము - 48.

దమయంతి—ఖరహరప్రియరాగము - ఆదితాళము.

భూ-పాలచంద్రనన్ను గరుణనాలోకింపవే
నీ-లీలాధ్యానముఁదప్పనొక్కటి- లేదునాయాన ॥పల్లవి॥
భూ-కాంతా రెండవపెండ్లిఁ గోరఁగనంతద్రోహినినే
యే-చింతనెఱుఁగను-మ్రొక్కివేడెద-వంతఁబాపవే. ౧

## అనుబంధము - 49.

దమయంతి—జంఝూటిరాగము - ఏకతాళము.

చలమేలపాలింపుమా ఆలింపుమా-ధీరా ॥పల్లవి॥
వారకనమ్మిన-సారసగంధిని-ఊరడించుటింతనీకు
భారమా-నేరమా-వైరమా-గంభీర-మా-ధీరా ॥చల॥ ౧
ముందెయీకానల-యందునేబాధలఁ-జెందదీననైతి
బ్రీతిఁజెందుమా-యందమా-చందమా-ఆనందమా ॥ధీరా॥ ౨
నీపడంతికిదయ-చూపకయుండుట-భూపమౌళీనీకుధీర
రూపమా-కోపమా-తాపమా-నాపాపమా॥ధీరా॥ ౩

## అనుబంధము - 50.

నళ—కమాజురాగము - అటతాళము.

మన్నింపవే-మానిని మన్నింపవే॥ ॥పల్లవి॥
యన్నులమిన్నా నను-విన్నాణము చెన్నారఁగ॥ ॥అను॥
కానలలోనిను-మానినపాపుఁడ
హీనుఁడఁబోనాడక-నా నేరము-లోనెంచక॥ ౧
కాంతరో సంతాపము-లెంతో కలిగించితి
నంతయుఁజింతింపక-యింతీదమయంతీనను॥ ౨

## అనుబంధము - 51.

వార్ష్ణేయ—నాథనామక్రియరాగము - ఏకతాళము.

ఆనందమాయెను-మానవనాథమనోజా
భూనుత చరితుని-నీనాఁడుకంటిని-నేనిన్ను శ్రీనళరాజా॥
చింతలఁబాసితి-స్వాంతముననుభూ-పాలా
ఇంతటిభాగ్యము-నెంతని నేనుతి-యింతునుగరుణా లోలా॥

## అనుబంధము - 52.

ఋతు—కమాజురాగము - అటతాళము.

నళరాజకుంజరా-పర-రాజభీకరా॥ ॥పల్లవి॥
భూమిపాలయున్ని నాళ్ళు-నీమనంబుఁజూచి
నీమహత్త్వమెఱుఁగనైతిఁ-బామరుండను॥ ౧
దేవలోకపాలనముని-భూవరేణ్యనిన్ను
సేవచేయఁజేసెనహో-దైవకృత్యము॥ ౨
మించిఘోరపాపచయము-ముంచెనన్ను నింక
నెంచికరుణఁజూచిమ-న్నించికావవే॥ ౩



## అనుబంధము - 53.

నళుఁడు—ఖమాజురాగము - ఆదితాళము.

నృపమౌళీనాకింతయేల-ఉపచారమేటికింక ॥నృప॥ ॥పల్లవి॥
మానవపతినీ-సూనృతమహిమము
భూనుతము-మానితము ॥నృప॥ ౧
నరవరనీదగు-పరమాదరణము
భరమదినే-మఱచెదనే ॥నృప॥ ౨

## అనుబంధము - 54.

సుదేవుఁడు—పంతువరాళిరాగము - రూపకతాళము.

ధాత్రిపాలనాకునింత-స్తోత్రమేలా॥ ॥పల్లవి॥
దైవకృతముదప్పునే-భూవరేణ్యయొప్పునే
ఈవిధమునఁబొగడనంత-యేమిచేసితి ॥ధాత్రి॥ ౧
కోరిపొగడవలయునే-కారణంబుగలుగునే
ధారుణీశయీమహోప-చారమేటికి ॥ధాత్రి॥ ౨
ఖ్యాతియింతనిలువదే-రీతియింతవెలయదే
భూతలేశనాకునీదు-ప్రీతిచాలదే ॥ధాత్రి॥ ౩

## అనుబంధము - 55.

భీమరాజు—హిందూస్థానిరాగము - త్రిపుటతాళము.

ఏమేమిఁకఁ-దాపముదీఱె
మాన్యతయింతని చెప్పఁదుమే॥ ॥పల్లవి॥
కడుబాధించి-కానకుఁబంచి
చెఱుగుదైవమింతచేసెనుగా
పడఁతిని బాసియిటు-లిడుములకెల్లఁ
దడఁపడినీవెటు-తాళితివో॥ ౧
సారతబాసి-రూపముమాసి
కోరివంటలపనిఁజేసితిగా
ధారుణినాథయెందు-నింతటిబాధ
వైరులకైనను-వలవదుగా॥ ౨

## అనుబంధము - 56.

### ఇంగిలీషు నోటు.

శ్రీరమేశ భవతుమంగళం
మునీంద్రవంద్య-వారిజాక్ష భవతుమంగళం
నీ-లా-నా-థా
ధీరజనా-ధారఘనా-క్రూరవినా-శా
సా రా-కా రా-ధీ రా-భూ
జాలభరణ-కాలహరణ-లోలతరణ-ధీ
హరణా-తిరణా-కరణా-శ్రీ
రుంద్రోజ్వల-దింద్రోపల-సాంద్రామల-భా
పం-కజచరణా-సం-కటహరణా
సురుచిరతర-కరిగిరిధర-వరగురుకరు-ణా
దై-త్యా-రీ-
భామణాతి వేలసౌమ్య భూమణాల వాలరమ్య॥
శ్రీరమేశ భవతుమంగళం॥

సమాప్తము.




చెన్నపురి: వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్‌వారి
ఆదిసరస్వతీనిలయ ముద్రాక్షరశాలయందు ముద్రితము.—1916.

[illegible]

192, ఎస్ప్లనేడ్, చెన్నపురి. ఈ.

| | | |
|---|---|---|
| కుమారీశతకము, సటీక ప్రతి 1-కి రూ. | 0 | 2 |
| దాశరథిశతకము ,, | 0 | 4 |
| మానసబోధశతకము, సటీక | 0 | 2 |
| చిత్తబోధశతకము ,, | 0 | 2 |
| భాస్కరశతకము ,, | 0 | 3 |
| కలువాయిశతకము ,, | 0 | 2 |
| కవిచౌడప్పశతకము | 0 | 2 |
| రామలింగేశశతకము | 0 | 2 |
| కాళహస్తీశ్వరశతకము | 0 | 2 |
| కుక్కుటేశ్వరశతకము | 0 | 2 |
| దేవకీనందనశతకము | 0 | 2 |
| జగన్నాయకశతకము | 0 | 2 |
| కృష్ణశతకము | 0 | 2 |
| నారాయణశతకము | 0 | 2 |
| కాళహస్తిశతకము | 0 | 2 |
| సింహాద్రినారసింహశతకము | 0 | 2 |
| భోగినీదండకము | 0 | 1 |
| గజేంద్రమోక్షము, సటీక | 0 | 6 |
| రుక్మిణీకల్యాణము, సటీక | 0 | 6 |
| నలోపాఖ్యానము, సటీక | 0 | 6 |
| రాజయోగసారము, ద్విపద | 0 | 4 |
| శ్రీనాథుని వీథినాటకము | 0 | 2 |
| హంసవింశతి | 0 | 12 |
| గణికాగుణప్రవర్తన తారావళి | 0 | 2 |
| వేణుగోపాలశతకము | 0 | 2 |
| తారాశశాంకవిజయము | 0 | 12 |
| శ్రీమదాంధ్రబ్రహ్మాండపురాణము | 0 | 4 |
| లంకావిజయము (రావణదమ్మీయము), సటీక | 1 | 8 |
| కన్యాశుల్కము | 0 | 12 |
| కృష్ణాకుమారినాటకము | 0 | 10 |

— వచనము. —

| | | |
|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము | 7 | 0 |
| సంగ్రహరామాయణము, సులభశైలి | 0 | 8 |
| శివాజీచరిత్ర | 0 | 6 |
| రామానుజచరిత్ర | 0 | 2 |
| శంకరాచార్యచరిత్ర | 0 | 2 |
| రామకృష్ణపరమహంస చరిత్ర | 0 | 2 |
| బాలగంగాధరతిలకు ,, | 0 | 2 |
| దాదాభాయినౌరోజీచరిత్ర, ప్రతి 1-కి రూ. | 0 | 1 |
| అనిబిసెంటు ,, | 0 | 1 |
| వివేకానందస్వామి చరిత్ర | 0 | 1 |
| కృష్ణదేవరాయ ,, | 0 | 2 |
| స్వామిరామతీర్థ ,, | 0 | 1 |
| శాలివాహన ,, | 0 | 2 |
| శ్రీబుద్ధ ,, | 0 | 4 |
| సోదరినివేదిత ,, | 0 | 2 |
| శ్రీగైక్వారుగారి ఉపన్యాసము | 0 | 2 |
| సంస్కృతనాటక కథలు | 0 | 12 |
| దక్కనుపూర్వకథలు | 1 | 4 |
| అరేబియన్ నైట్స్ కథలు | 1 | 4 |
| ఈసబునీతికథలు, 1-వ భాగము | 0 | 6 |
| ,, 2-వ భాగము | 0 | 8 |
| షేక్స్పియర్ నాటకకథలు | 1 | 4 |
| లార్డ్ క్లైవుజీవితము | 0 | 6 |
| ఐవన్హో నవల | 0 | 6 |
| ఆనందమఠ ,, | 0 | 12 |
| మదాలస ,, | 0 | 10 |
| తారాభాయి ,, | 0 | 12 |
| మనోహరి ,, | 0 | 12 |
| టిప్పుసుల్తాన్ ,, | 1 | 4 |
| సీతారామము ,, | 1 | 0 |
| తెనాలి రామలింగని కథలు, జీవితము | 0 | 4 |
| పరమానందశిష్యులకథలు | 0 | 2 |
| మర్యాదరామన్నకథలు | 0 | 2 |
| రేచుక్కపగటిచుక్కకథలు | 0 | 2 |
| మైరావణచరిత్ర | 0 | 2 |
| నీతిచంద్రిక | 0 | 6 |
| పంచతంత్రము | 0 | 6 |
| రామదాసచరిత్ర | 0 | 8 |
| వాసుదేవమననము | 0 | 10 |
| అధ్యాత్మ రామాయణకీర్తనలు | 0 | 6 |
| ప్రౌఢవ్యాకరణము | 0 | 12 |
| శబ్దార్థచంద్రిక, అకారాదిఆంధ్రనిఘంటువు | 2 | 8 |
| శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారికవి జీవితములు | 2 | 8 |

ఇంకను అనేక సంస్కృతాంధ్రగ్రంథములు మావద్ద దొరకును.

